# భారతి—త్రయోదశ సంపుటము—భా.

## వ్యాసముల అకారాది సూచి

## త్రివర్ణచిత్రముల అకారాది సూచి

# విషయానుక్రమణిక



## చిత్రములు

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింద కనబరచిన నెంబర్లవారికి ఈనెల (1936 సం. జూలై)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తియగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో జూలై 8-వ తేదిని రూ॥ 6-4-0 లకు వి. పి. పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమ కీపత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

B 4. C 4, 5, 6. H 25, 29, 30. K 12. L 6. N 13, 16, P 13, 15, 17, 18, 31, 46. R 19, 20, 50. S 80, 82, 92, 93, 103, 227, 229, 231, 233, 234. V 24.

# ఆంధ్ర వాఙ్మయ సూచిక

## (ముద్రితాముద్రిత గ్రంథముల పట్టికలు)

ఈ పుస్తకమున ౧౯౩౨-వ సంవత్సరము చివరవరకు అచ్చయిన తెలుగుపుస్తకముల పట్టిక ఒకటి, ఆ పుస్తకములను వ్రాసినవారి పట్టిక ఒకటి, విషయమునుబట్టి విభాగించి ఆయా విభాగములక్రింద వచ్చిన పుస్తకముల పట్టికలు, ఇంకా కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు లైబ్రరిలోను, తంజావూరు సరస్వతీ లైబ్రరిలోను, చెన్నపురమున ఓరియంటల్ లైబ్రరిలోను ఉండే వ్రాతపుస్తకములలో ఇప్పటికి అచ్చుకాకుండ ఉన్న తెలుగుపుస్తకముల పట్టికలును, ప్రత్యేకము అకారాదిగా ఉన్నవి. ఆంధ్రవాఙ్మయవిమర్శనరూపమైన ప్రకాశకులపీఠిక ౬౦౦ పుటల పరిమితి గలది యీపుస్తకమున ఉన్నది.

తెలుగుభాషలో పుట్టిన పుస్తకములను, వానిలో, ఈపుస్తకము ముగియునప్పటికి అచ్చయినవానిని, కానివానిని తెలిసికొనుటకు ఈ సూచిక చాల ఉపయోగకరము.

భారతిసైజు పుస్తకము, పుటలు ౬౩౦, మంచికాగితములు. వెల రు. ౧-౦-౦ మాత్రమే.

మీ సేవకులు, **ఆంధ్ర గ్రంథమాల,** నెం. 7, తంబుసెట్టివీధి, మద్రాసు.



సంపు. ౧౩   ధాత సంవత్సరము, ఆషాఢమాసము (జూలై ౧౯౩౬)   సంఖ్య ౭

# తిల్లిక

## దాని పుట్టుపూర్వోత్తరాలు

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి

సుప్రసిద్ధులగు ఉమర్ అలీషా సాహేబు గారు గోదావరీమండలమున జరిగిన యాంధ్రసభలో, ఆంధ్రపదవివరణము తెలుపు సందర్భమున "బ్రాహ్మణ, క్షత్రియజాతులు తెలుగుదేశమునకు నవీనులు. వారు వచ్చు సరికి దీపము లుంచుకొనుట తెలుగువారికి తెలియదు. దీపమునకు అచ్చ తెలుగుపదము లేదు. కొరవిమంట యని వాడుచుండిరి. అదమాది అంధకారదేశ మని పేరుంచిన ట్లున్నది." * అని చెప్పినారట.

దానిపైని బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రులుగారు సాహేబుగారి వాక్యములు నుదాహరించి "......అని చెప్పగవిని నేను నివ్వెఱగు పడితిని; వగచితిని. ఏమైన నేమి? వారికి ఇప్పటికిని దీపమునకు అచ్చ తెనుగునుడియగు 'తిల్లిక' చెవిని బడ లేదు. తెలుగునుడులు సేకరించునప్పుడు నా కీనుడి

---

* 4 జూను 1936 ఆంధ్రపత్రిక.

తెలియవచ్చినది. ఈనుడి వాడుకలో ఉన్నది. నా నెయ్యురొకరు తామేదో గ్రంథములో అది చూచినటులకూడ చెప్పిరి. కాని దానిపేరు మఱచిపోయిరి. గుర్తున్న వారు తెలుపుదురుగాక.

"...ఏనాటిచదువులే ఆ నాటి వారికి మింటితిల్లికలయి మెఱయగలవా" అని తిల్లిక వాడితిని. శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణగారు......తమ బుడబుక్కలజోస్యంలో... ..."తిల్లిక మలిగిపోతే నీవు దేబరించిన లాభంలేదో" అని వాడినారు...బ్రహ్మశ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారితో 'తిల్లిక' నుడినిగూర్చి నేనుచెప్పగా, తూర్పుగోదావరి జిల్లాలోకూడ అది వాడుకగుచున్నట్లు వారు తెలిపియున్నారు. ...కోశమునకు అచ్చ తెనుఁగునుడి లేదనుకొనువారందఱును తెనుఁగంత గొడ్డుపోలేదనియు, 'తిల్లిక' అను నుడి ఉండుటయేకాక వాడుకలోకూడ నున్నదనియు తెలిసికొనదగు నని కోరుచున్నాను."* అని వ్రాసిరి.

పైవిషయము శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారు నాతో చెప్పుచు "'తిల్లిక' 'తిరువిళక్కు' అను తమిళపదమునుండి భ్రష్టమైన రూపమేమో. ఇది కేవలము తెలుఁగుపదము కాఁజాలదని తోఁచుచున్నది. దీనివిషయమున మీభావమును ప్రకటింపుఁ"డని ప్రోత్సాహపఱచిరి. ఇది పరిశీలింపఁదగినదేయని యెంచి నాకుఁదోఁచినది దొఱకినసామగ్రితోఁ బ్రకటింపఁదలఁచితిని. సుబ్బరామయ్యగారికి మొదటఁదోఁచినట్లు యీపదము తమిళపదభ్రష్టమే యనుట యుచితము. ద్రావిడభాషలకుఁ బరస్పరసంబంధ ముండునుగదా! ఇదియు నట్టిసంబంధమున మూలరూపములో నొకటినై యుండునేమో యనుకొనుటకు వీలుఅయినది గాదు. ముందు ప్రయోగముల రీతి చూతము. 'తిల్లిక'కుఁ గవిప్రయోగము లభింపలేదు గాని, ఆంధ్రపదపారిజాతమున 'తిల్లిక' 'తిర్వాళిక' అనుపదములు ఏకముగా గ్రహింపఁబడినవి. బ్రౌనునిఘంటువున 'తిల్లిక' దీపము అనునర్థముతోఁ గలదు. ద్విపదలలో నున్నట్లు 'D' అనుగుర్తుతో సూచింపఁబడినది. ఉదాహరణముగాని, గ్రంథనామము గాని లేదు. శబ్దార్థచంద్రికయను నిఘంటువున 'తిల్లిక' 'తిర్వాళిక' పదములు ఏకముగా దీపార్థముతో గ్రహింపఁబడినవి. పద్యరూపమున నున్న నాంబనిఘంటువునందు "తే. దీపంబు వెల్గు, వఱలు చుండును జోతి తిర్వాళిక, దివ్వె, యనగ" అనికలదు. దీనిటీకలో 'తిర్వాళిక' (యిది యఱవపదము) అని యొకప్రతిలోను, (యిది ద్రావిడపదము) అని మఱియొకప్రతిలోను వ్రాయఁబడినది. 'తిల్లిక'కు కవిప్రయోగము దొరకలేదుగాని, 'తిర్వాలిక'కుఁ గవిప్రయోగము దొరకినది. అది హంసవింశతిలోనిది. ఆంధ్రసాంఘిక వర్ణనలకును, ఆంధ్రపదప్రయోగములకును నాకరమగు హంసవింశతి, నీతిబాహ్యము లున్నవనువంకతో,

* 10, జూన్ 36 ఆంధ్రపత్రిక.

దొరతనమువారి శాసనప్రకారము సామాన్య జనమున్లభ మయిపోయినది. కావునఁ బద్య మంతయు నిట నుదహరించుట మంచిదని యుదాహరించుచున్నాను.

మ. జగతీజ్యోతులు, కాగడాలు, బలుబం
　　జాయీలు మోంబత్తులుఁ,
బగలొత్తుల్, దివిటీలుఁ దిర్వళిఘులుం
　　బంజుల్ మహాజ్యోతులుఁ,
పిగ సూర్యప్రభ లాయిలాయులును జం
　　ద్రజ్యోతులుఁ మైనపుఁ
జిగటాల్ నిచ్చెనపంజు లారతులు న
　　గ్నిజ్యోతులుఁ వెల్గఁగ.

అని యున్నది. తమిళమున క, ఖ, గ, ఘ లకు నొకటే గుర్తుగాన ఎట్లుచ్చరించినను నుచ్చరింతురు. ఇందున్న 'తిర్వళిఘు'లు అన్న పదమును "తిర్వళికలు"గా శబ్దరత్నాకర కారులు గ్రహించిరి. వారు 'తిర్వళిక' పదము ప్రధానపదముగా గ్రహింపకున్నను, 'పంజా యీ' 'పంజు' పదములక్రిందియుదాహరణ భాగమున గ్రహించిరి. 'తిర్వళిక' పదము కవులవాడుకలో నున్నది. దీనికి మూల పదము తమిళము లోని 'తిరువిళక్కు' అనునది కావలెను. 'తిరు + విళక్కు' అనువానిలో విళక్కు దీపవాచకము. ఇది ప్రకాశార్థకమగు 'వెలిచ్చం' అను పదమునకు సంబంధించినది. దీపశబ్దమును ప్రకాశార్థక ధాతుజన్యమేకదా! తత్ప్రకాశా ర్థకము తెనుఁగున వెలుఁగుశబ్ద మున్నను, దీపపర్యాయముగా వినఁబడుట లేదు. వెలుఁగు శబ్దమో, తజ్జన్యమో మొట్టమొదట నుండి యుండును. దీపశబ్ద ప్రాబల్యమునను దీపశబ్ద మునకు ద్రావిడోచ్చారణమునఁ గల్గిన దీవ, దివ్వె, దివియ, దివె మొదలగు రూపముల బాహుళ్యమునను, వెలుఁగునకు సంబంధిం చిన పదము వాడుకలో నంతరించియుండ వచ్చును.

'విళక్కు' అను తమిళరూపమునకు 'వళక్కు' అనురూపము మద్రపురమున కొం దఱివాడుకలో నేఁటికిని వినఁబడుచున్నది. వళక్కు అనగా దీపము. శైవవైష్ణవమతము లలోఁ బవిత్రతను సూచించుటకుఁ బాదాదిని శ్రీ శబ్దమును వలెనే తిరుశబ్ద ముపయోగిం చుట సుప్రసిద్ధము. దేవతాసన్నిధి నుంచు దీపములకు "తిరువళక్కులు" అని పేరు. ఉచ్చారణవశమున, 'తిర్వళక' 'తిర్వళిక' అనురూపము లేర్పడియుండును. దీపారాధన లకు ప్రసిద్ధమయిన తిరుపతి మొదలగు స్థల ములలో భక్త్యతిశయమున తెలుఁగులు, తమిళులు గలసి వాడునపు డీపదము నలగి, నలగి 'తిర్లిక' రూపము నొంది, తుదకు 'తిల్లిక' అనురూపముతో అవతరించియుండు ను. కర్మఠులు కర్మకాలమున సంస్కృత పదములు వాడుటకు యత్నించునట్లు శైవ వైష్ణవమతస్థులు తిరువారాధనాదిసమయము లందు ద్రావిడపదము నుపయోగింప యత్నిం చుట కలదు. అందులో నది దాసరులలో హెచ్చుగా నుండును. కావున 'తిర్వళిక' 'తిర్లిక' 'తిల్లిక' అను పదములకు దేవపూజా సమయములందు వెలిఁగించు దీపములని యర్థముగాని సామాన్యముగా వెలుఁగునకై

పెట్టుకొనుదీపము అని యర్థము గాదు. సామాన్యదీపవాచకముగాఁగూడ నవ దిగిపోవచ్చును గాని అది వాడుకనుబట్టి యుండును. వాడుకవిషయమునఁ జూతము. నేను గోదావరీమండలమువాఁడనే. 'తిల్లిక' వాడుకలో నేను వినలేదు. నామిత్రులను కొందఱ నడుగ వారును వినలేదన్నారు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచెవిని బడినదేమో? అన్నియు, నందఱచెవులను బడకపోవచ్చును. గుంటూరునివాసుల నిద్దఱ (వారు తెలుఁగు చదివినవారును, ఆంధ్రభాషాభిమానము గలవారును; సామాన్యులు గారు.) నడుగఁగా 'ఆపదము వినలేదండీ' యన్నారు. అది కొన్నిచోట్ల వ్యాప్తమయియుండవచ్చును. అప్పుడును శైవముతోనో, వైష్ణవముతోనో తమిళదేశమునుండి, తెలుఁగు దేశమునఁ బ్రవేశముగన్న పద మిది యనుట యుక్తిదూరము కాదు. ఆమతములకు వ్యాప్తి ద్విపదకవిత్వాదిసాధనములతో పండ్రెండవశతాబ్దియందుఁ గలిగియున్నది. (బ్రౌనుగారుగూడ ద్విపదలో నున్నట్లు సూచించిరిగదా!) పదునొకండవశతాబ్దినాఁటికే, గీప, దవియ, దివ్వె మొదలగుపదములతో నిండినశాసనములు గనఁబడుచున్నవి. అంతకుముందే 'తిల్లిక' దీపవాచకముగా నున్నదని విశ్వసించుటకు ప్రమాణము కనఁబడదు. దీపశబ్దము వాడు బ్రాహ్మణక్షత్రియజాతులు వచ్చునప్పటికే, 'తిల్లిక' యనెడి యచ్చతెలుఁగుపద మున్నదని సంతసింపఁగలమా! అచ్చతెలుఁగుపదము కనఁబడకపోయిన నేమి? అచ్చతెలుఁగుపదము నేఁడు కనఁబడనంతమాత్రమున తెలుఁగువారు దీపముపెట్టుకొనుట యెఱుఁగరు కావున నే వీరి నంధులన్నారు అని సిద్ధాంతముచేయుట యుచితమా! మనకన్నులయెదుట నెన్నో పదములస్థానమును ఆంగ్లపదములు ఆక్రమించుచున్నవే. ఎందఱో వానిని తమపుస్తకములలో నెక్కించుచున్నారే! అవిపఠించినవారు మొదట తెనుఁగుపదముల విననైనవినరే! కొన్నిసంవత్సరములలోఁ దత్పదవాచ్యములగు వస్తువులే ఆంగ్లేయులువచ్చుటకుఁబూర్వము మన దేశమున లేవని సిద్ధాంతీకరింపవలసినదేనా? అయ్యో, యిది యొకగొప్పసాధనమా? వెలనాడు అనుదానికి వలనాడు అని ఎన్నిచోట్లనో కనఁబడుచున్నది. అట్లే తెలుఁగుశబ్దమునకు సంబంధించిన రూపము 'వలక' అనిగాని, తత్సాదృశ్యముగల మఱొకపదముగాని యున్నదేమో తాళపత్రగ్రంథములలో వెదకుట యభిలషణీయము. 'తిల్లిక'వలె 'తి', లేక 'తిరు' లేక 'తిర్' తో సంబంధించినపదము దీపవాచకముండుననుట కవకాశము గనఁబడదు. సర్వము సంస్కృతజన్యమనుమతమువారు 'తిలము'లో నుండి లాగఁజూచెదరేమో? అదియు సంప్రదాయసిద్ధము గాఁజాలదు. ఒకవేళ అదియొప్పుకొన్నను సాహెబుగారు చెప్పినదోషము పరిహృతము గాఁజాలదు. వారన్నది మఱికొంత చము రెక్కును 'తిల్లిక'తో సంతసింపక దీపపర్యాయాన్వేషణమునకై మనము ప్రయత్నింపవలసియున్నది.

# నరసభూపాలీయము

బులుసు వేంకటరమణయ్య

కడచిన మార్చి నెల భారతిలో 'నరసభూపాలీయము' నుగూర్చి నే నొక వ్యాసమును వ్రాసితిని. ఆగ్రంథమందు నేఁ జూపిన కొన్ని యనుపపత్తులు నిజముగా ననుపపత్తులు కావని, కొన్నింటిలో నభిప్రాయభేదములు కలవని సమాధానమిచ్చుచు మన్మిత్రులు శ్రీ ఆకెళ్ల శేషాద్రిగారు 'మే' నెల భారతిలో నొక వ్యాసమును ప్రకటించిరి. నాకుఁ దెలియకనో, తెలిసియో కొలది పొరపాటులు వ్యాసమున దొరలినమాట సత్యమే; వానింగూర్చి శ్రీ శేషాద్రిగారు ఒసఁగిన సమాధానములకు ధన్యవాదములు. కొన్నిటింగూర్చి మాత్రము సమాధానము వ్రాయవలసివచ్చుటచే, తిరిగి 'నరసభూపాలీయము'ను గూర్చి యీ వ్యాసము వ్రాయుట తప్పనిసరి యైనది.

౧. మూర్తికవి శబ్దశక్తిమూలాలంకారధ్వనికి

'క. ఈ కోమలి పద్మిని యఁట
యేకాలముఁ బ్రోచునినుఁడ వీవట సతి దా
నీకరస స్పర్శసహన
గాక చెలంగునె నృసింహ ఘనబలసింహా!'

అని యుదాహరణము నిచ్చెను. ఇచట శబ్దశక్తిమూలధ్వని లేదని, మూర్తికవి చేసిన సమన్వయము సరిపడదని నేను వ్రాసితిని. పయి యుదాహరణమునఁ గల 'ఇనుఁడు, పద్మిని' అను పదములకు 'సూర్యుఁడు, కమలిని' అను నర్థములనే నేను చేసికొంటినని, ఆపదములు 'రాజు, పద్మినీ జాతిస్త్రీ' అను నర్థములను గూడ తెలియఁజేయుటచే నచట శబ్దశక్తిమూలధ్వని కలదని శ్రీ శేషాద్రిగారు మూర్తికవిని సమర్థించినారు.

పయిపదము లప్రకృతార్థములనుకూడఁ దెలుపుననుట యుక్తము కాదని, పయిపదము లట్లు తెలుపలేదని యెవ్వరు ననరు; ననలేదు. కాని కొన్ని నానార్థక పదము లున్నంతమాత్రమున శబ్దశక్తిమూలమగు నుపమాలంకారధ్వని (గాని, శ్లేషధ్వనిగాని, రూపకధ్వనిగాని) కాఁజాలదు. కొన్ని పదము లప్రస్తుతార్థమును స్ఫురింపఁజేసిన నచట వ్యంగ్యస్ఫూర్తిమాత్ర మగును. అది ప్రధానముమాత్రము కాఁజాలదు. వ్యంగ్యము ప్రధానమగునపుడే ధ్వని యగును. ఈయంశమునే ఆనందవర్ధనాచార్యులు ధ్వన్యాలోకమున

'వ్యంగ్యస్య ప్రతిభామాత్రే వాచ్యార్థానుగమేపి వా,
న ధ్వని ర్యత్ర వా తస్య ప్రాధాన్యం న ప్రతీయతే.'

అని వివరించియున్నారు.

సంస్కృతాలంకారగ్రంథములలో శబ్దశక్తిమూలాలంకారధ్వని కొసఁగఁబడిన యుదాహరణములలోని పదములు ప్రస్తుతాప్రస్తుతోభయసాధారణము లయి (శ్లేషమహిమచే) యున్నవి. ఉదా-

'భద్రాత్మనో దురధిరోహతనో ర్విశాల
వంశోన్నతేః కృతశిలీముఖసంగ్రహస్య,
యస్యానుపప్లుతగతేః పరవారణస్య
దానాంబుసేకసుభగః సతతం కరోఽభూత్.'

(కావ్యప్రకాశః)

ఇచటి విశేషములన్నియు గజ - రాజోభయసాధారణములయియున్నవి.

'కరతలనిర్గలదవిరల దానజలోల్లాసితావనీవలయః,
ధనదాగ్రమహితమూర్తి ర్జాతితరాం సార్వభౌమోఽయమ్.'

(రసగంగాధరః)

ఇచటి విశేషణము లన్నియు సార్వభౌముఁడు' సార్వభౌమ మనుపేరిగజమునకు సాధారణములు.

నరసభూపాలీయమునకు మూల మనఁదగు ప్రతాపరుద్రీయమునందే

'ఏష సత్యం రాజా, శ్యామా ఖలు త్వం, సమాగమో కిం పున ర్న ప్రదోషకథా దృశ్యతే, ఏతత్తు [ద్వయోః ల్యాశ్చర్యమ్.'

అని యుదాహరింపఁబడినది. ఇచటఁ బ్రస్తుతములగు కాంతా, నృపవాచక శబ్దములవలన నిశా, చంద్రప్రతీతి, ప్రదోషపదమువలన సాయంకాల, దోష ప్రతీతి కలుగుచున్నది. ఇందలి పదము లన్నియుఁ బ్రస్తుతాప్రస్తుతోభయసాధారణములు.

నరసభూపాలీయమునందలి పయి యుదాహరణమునఁ గల 'కోమలి, సతి, నృసింహ, ఘనబలసింహా!' పదములు ప్రస్తుతార్థమునే చెప్పఁగలవు. 'పద్మిని, ఇనుఁడు, కరసంస్పర్శసహన' అనునవి మాత్ర ముభయసాధారణములు. అవి కొంత వ్యంగ్యార్థమును స్ఫురింపఁ జేసినను ఉదాహరణము ధ్వనికి అనుగుణమయినదికాదు.

ఇచట 'రూపకాలంకారమే శబ్దశక్తిమూల ధ్వనియందు వ్యంగ్యమగు' నను పండితరాజుసిద్ధాంతము ననుసరించి రూపక మగునని చెప్పఁబడినది. అదియే సిద్ధాంతమని చాలమంది తలఁచుచున్నారు. మతాంతరములలో ఉపమగాని, శ్లేషకాని కావచ్చును.

౨. అర్థాంతరసంక్రమితావివక్షిత వాచ్యధ్వనికి నరసభూపాలీయమం దీయఁబడిన

ఉ. ఇంద్రసుతుం జయించి నర
సేంద్రుఁడొకమ్మన మత్స్యయంత్రముల్
సాంద్రనిరూఢి సేసెనని
సంతతము న్విని తత్తఱించి మ
త్స్యేంద్రుఁడు యోగముద్ర ధరి
యించి చరింపఁదొడంగె నార! ని
స్తంద్రజవంబునన్ విపిన
శైలగుహాగహనాంతరంబులన్.'

అను నుదాహృతి సరికాదని నేను వ్రాసితిని. శ్రీ శేషాద్రిగారు మత్స్యేంద్రుఁడను పదమునకు 'నరసరాజుచే సేయఁబడిన మత్స్యముయొక్క పేరు ధరించిన దేశమునకు రాజు' అని లక్షణచే నర్థమును గ్రహించి, ధ్వనిని సమర్థింపఁ బ్రయత్నించిరి.

అన్వయానుపపత్తి గాని, తాత్పర్యానుపపత్తి గాని లక్షణకు బీజము. వాచ్యార్థ మనుపపన్నమగుచో లక్షణ తప్పక ఒప్పుదగినది. పయి 'మత్స్యేంద్ర' పదమున వాచ్యార్థానుపపత్తిగాని, తాత్పర్యానుపపత్తికాని లేవు. ఏదేని పదము ప్రస్తుతమున అనుపయుక్తమయి అర్థాంతరమునఁ బర్యవసన్న మగునపుడే అర్థాంతర సంక్రమితధ్వని కాఁగలదు. 'నేను రాముఁడను, కాన సర్వమును సహింతును' అని సహ రాముఁడు తన్ను గూర్చి చెప్పినపుడు 'నేను రాముఁడ'నని చెప్పుట అనావశ్యకము; కావున అచటి రామపదము వ్యంగ్యార్థపర్యవసన్నము కాఁగలదు. పయి 'మత్స్యేంద్ర' పదము లేనిచో అన్వయమే కుదురదు. ఇచట లక్షణ వీలుకాదు; కాన తన్మూలమగు వ్యంగ్యార్థము అనుపపన్నము. పయి యంశములఁబట్టి చూడఁగా 'నరసరాజు మత్స్యయంత్రము సేయఁగా మత్స్యేంద్రుడు భయపడెననుట, 'నేను రాముఁడను, సర్వమును సహింతును' అనుదానివంటిదే కావచ్చును' అని శ్రీశేషాద్రి గారు వ్రాయుట పొరపాటని తెలియఁగలదు.

3. నరసభూపాలీయమందలి 'ప్రకృతోపయోగకరముగ ఉపమేయమునందు ఉపమానత్వము నారోపించుట పరిణామాలంకార మగు' నను లక్షణము, 'దేవ స్త్రీల కౌఁగిలికొఱకు స్వర్గమున కేఁగు శత్రురాజులకు నరసరాజుకత్తి నీలాలనిచ్చెన అయిన'దను ఉదాహరణము సరికాదని నా వ్యాసమున వ్రాయఁబడినది.

పయి పరిణామలక్షణము, రూపకలక్షణము ఒకే మాదిరిగ నున్నవని, ఉదాహరణములు కూడ నట్లే యున్నవని నా వ్యాసమునఁ గలదు. శ్రీ శేషాద్రిగారు లక్షణము సంగతి ఎత్తక లక్ష్యమునఁ బరిణామాలంకార సమన్వయము నొనరింపఁ బ్రయత్నించిరి. ప్రతాపరుద్రీయమున నిచ్చిన 'రాజా! నీ సామంతరాజులు నీ యాజ్ఞయనెడి పుష్పమాలను శిరస్సులందు ధరించిరి' అనుచోటఁ బుష్పమాల రాజాజ్ఞాతాదాత్మ్యము నొందుచుండలేదు. శిరస్సులందు స్రజమును ధరింతురు గాని యాజ్ఞను ధరింపరు గదా!' అని వారు వ్రాసిరి.

అజ్ఞను వీక్షించుట యసంభవమగునట్లు ఆజ్ఞను శిరసావహించుట అసంభవము కాదు. లోకమున ఇట్టి వాడుక ప్రసిద్ధము. మఱియు రాజులు తలదాల్పవలసినది కిరీటము కాని పూలమాల కాదుగదా! కావున రాజులు 'ఆజ్ఞారూపము నొందిన ప్రజమే ధరించిరని సమాధానము చెప్పుకొనుటయు, లోకోత్తరము నిచ్చెనయే స్వర్గారోహణమున నుపయోగించినదని యనుకొనుట యుఁ గ్లిష్టకల్పనములే అగును.

ఇచటఁ బరిణామము నెటులనైన సమర్థించి తీరవలయునని యాగ్రహమున్నను, లక్షణము రూపకలక్షణాభిన్న మగుటచే లక్ష్య, లక్షణముల కలయిక గగనకుసుమప్రాయ మనక తప్పదు.

స్వతః సిద్ధార్థశక్తిమూలాలంకారకృత వస్తుధ్వనికి నరసభూపాలీయమున

'ఉ. భూరిభుజా ప్రతాపగుణ
భూషణ! యోబయనారసింహ! నీ
గారుడశైవభూమణికి
సారసవైరి ముఖంబు తారకల్
సారసఖాంకురంబు లల
శంకరశైల, హిమాద్రు లాత్మవ
త్కోరుహముల్ సితాబ్జములు
సొంపగు లోచనపంకజాతముల్.'

అని యుదాహరణ మీయఁబడినది. అందఱి మతమునను ఇచట వాచ్యమగు నలంకారము రూపకము; మూర్తికవిమతమునఁ బరిణామము. కావుననే దీని వివరణముల నాతఁడు

'గీ. తనదు సత్కీర్తికాంతకుఁ దారకాదు
నరయ నంగంబులై వేడ్కఁ బరిణమింప,
గలుగు పరిణామమునఁ ద్రిలోకముల నిండు
నరసవిభుకీర్తి వ్యంగ్యమనం జెలంగు.'

నని యిందు వాచ్యాలంకారము పరిణామమనియే స్పష్టముగ వ్రాసినాఁడు. కవి తనంత చెప్పెడి దానిని కాదని వేఱొకరీతి సమన్వయించుట పాడిగాదు.

౮. స్థాయిభావములను వివరించు సందర్భమున మూర్తికవి ఉత్సాహమునకు మారుగ యత్నమును పేర్కొనుట అసంగతమని నే వ్రాసితిని. శ్రీ శేషాద్రిగారు మూలమున ఉత్సాహలక్షణము 'స్థేయాన్ ప్రయత్న ఉత్సాహః' అని యున్నదని, మూర్తికవియు 'నిత్యము దలఁచు ప్రయత్న ముత్సాహ'మని చెప్పెనని యు వ్రాసి 'నిత్యమును దలంచునది స్థిరము కావచ్చునుగదా!' అని సమర్థింపఁజూచిరి. నిత్యము తలంచు ప్రయత్నము స్థిరము కాకపోవుట అసంభవము కాదు. అస్థిర ప్రయత్నములనయినను అనుదినము తలంచువారనేకులు కలరు. స్థాయిభావ నామనిర్దేశము యత్నము అనియుండి లక్షణము మాత్ర ముత్సాహమున నుండుట అననుగుణమనియే తోఁచుచున్నది.

'రతి హాస శోక యత్నములు' అనుదానిని తద్వ్యాఖ్యాతలు శ్రీ వెల్లాల సదాశివశాస్త్రులు గారు 'రతి హాస శుగుత్సాహములు' అని దిద్దినారు. 'శోకము స్థాయిభావమును బోధించునట్లు 'శుక్' బోధించకున్నది. అట్లయిన 'క్రోధము'నకు మారుగ 'కోప, రోష' ములుగాని, తదితరములుకాని వాడవలసివచ్చును. ఒక తప్పుదిద్దిన వేరొకచోట చిక్కు తటస్థించుచున్నది. వావిళ్లవారు శ్రీసదాశివశాస్త్రులుగారి దిద్దుబాటులనే అధస్సూచికయందు గ్రహించినట్లు పీఠికలో నే వ్రాసి యున్నారు. ఆ పాఠాంతరము కల్పితము కాని మూలములోనిది కాదు.

౯. మూర్తికవి గ్రంథమునం దక్కఱలేని పెంపులను కూర్చినాఁడని, అవి కొన్ని సరిపడవని చెప్పుచు నేను 'కావ్యములు కాంతాసమ్మితములు' అనుదానికి 'అంగనా జన విలాసాలాప లీలాసమప్రాదుర్భావము' లని చెప్పుట సరికాదని తెలిపితిని. 'స్త్రీలు తమకోరికలను చేష్టలచేతనే ప్రకటింతురు గాని మాటలచే ప్రకటింప'రని నేను వ్రాసితి. స్త్రీలు మాటలచే తనే ప్రకటింతురని శ్రీ శేషాద్రిగారు దృష్టాంతపూర్వకముగ సమర్థించినారు. స్త్రీలు మూగవారని, వారికి మాటలు రాకపోవుటచే తమ యభిమతములను చేష్టలచేఁ దెలియఁజేయుదురని నేను వ్రాయలేదు. శ్రీ

తన యభిమతమును వాచ్యవిధిని మాటలచేఁ దెలుపక వ్యంగ్యవిధిని చేష్టలచేఁ దెలియఁజేయును; అదియే చమత్కారకారి. అట్లే కావ్యము శబ్దార్థములు గాక వ్యంగ్యమే ప్రధానముగాఁ గలదగును. అట్టి వ్యంగ్య ప్రధానమగు కావ్యమే ఉత్తమ కావ్యము (ధ్వని).

పయి విషయము నరసభూపాలీయ మూలమగు ప్రతాపరుద్రీయము వ్యాఖ్యయందే యిట్లు కలదు:

'యథా కామినీ కటాక్ష వీక్షణాది విలాసైరేవ కామిన మావర్జయంతీ 'మమేద మభిలషితం కురు; అనభిలషితం మా కు' రిత్యనుక్త్వైవ సర్వం సంపాదయతి తథా కావ్యశ్రీ రపి వ్యంజనా వ్యాపారమాత్ర పరత్వేన, ఉపసర్జనీభూతశబ్దార్థతయా శబ్దార్థప్రధానాభ్యాం ప్రభు సుహృత్సమ్మితాభ్యాం వేదపురాణాభ్యాం విలక్షణా సతీ సహృదయ హృదయాహ్లాదకారిణా వ్యంజనావ్యాపారేణైవ రామాదివ ద్వర్తితవ్యం, న రావణాదివ దితి పుంసః కర్తవ్యే ప్రవర్తయతి, నివర్తయతి చాకర్తవ్యాది త్యస్యాః కాన్తాసమ్మితత్వ మవగన్తవ్యమ్.'

పయి యంశములను బట్టి, కవినిబద్ధవక్తృప్రౌఢోక్తి సిద్ధము, రసవదాద్యలంకార నిరూపణ విషయము మొదలగువాని విమర్శనములనుబట్టి మూర్తికవిని సమర్థించుటయందుకంటె నా వ్యాసమున, వ్యాసలేఖనమునఁ బడిన తప్పులను గోరంతలను కొండంతలను జేయుటయందే శ్రీ శేషాద్రిగారికి ప్రానిక కల్గినట్లు తోఁచుచున్నది.

శ్రీ శేషాద్రిగారి అధిక్షేపణములకు ప్రత్యుత్తర మనావశ్యకము.



భవిష్యత్తు A. D.

# మానవుని యేకాకిత్వము

వసంతరావు వేంకటరావు

"పరకాయ ప్రవేశము" నే మహామాత్ర మైనను క్రమశిక్షాగత చిత్త సామర్థ్య విశేషములు గ్రహింపగల హిందువులకీ విషయ మూహాతీతము కానేరదు. ఆధ్యాత్మిక చింతనాపరులగు పురాతన యోగిపుంగవులం దీవిద్యయం దారితేరినవారు మెండుగ నుండి రని ప్రతీతి. ప్రతివాదిభయంకరుండగు మండనమిశ్రు నోడించి వాని యర్ధాంగియగు ఉభయభారతితో వాగ్వాద మొనర్చుతఱి కామశాస్త్ర విషయములు ప్రశ్నింపబడి హిందూ మతోద్ధరణమునకు బద్ధకంకణులగు శంకరాచార్యులం దనుభవ శూన్యులగుటచే, నా విద్యాభ్యాసమునకు వలయుగడువుగైకొని మృతుడైన యొక రాజుకళేబరమున దన జీవాత్మ బ్రవేశపెట్టి పట్టపుదేవులతో రతిశాస్త్రాధ్యయన మొనర్చుచుండిరట. భద్రముగ శిష్యులచే గాపాడబడుచున్న శంకరుని దేహమపుడు రాజభటులు దహించుచుండ, రాజశరీరమం దున్న శంకరుని జీవాత్మకు శిష్యులీవార్త తెలిపిరనియు, తత్క్షణ మాయాత్మ నిజశరీరప్రవేశ మొనర్చి దగ్ధావయవ సంపాదనార్థము "లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబ" మను మకుటముగల శ్లోకములచే భగవంతుని స్తుతించి సర్వాంగసుందరుడై యథాపూర్వముగ భాసిల్లెననియు నమ్ముటకు తార్కాణముగ భక్తమందారములగు శ్లోకములు గలవు.

భౌతిక దేహమునుండి నిర్గమించిన జీవాత్మ ప్రకృతిశక్తులతో మేళవింపక, వ్యక్తిత్వమును గోల్పోక ఆకాశమున సంచరింపగలదు. స్వయంకృషివలన మానవుడు గణించిన జ్ఞానమును వాని జీవాత్మసంగ్రహించి, తన ప్రవాసములలో దాని నుపయోగింపగలదు. వేరొక దేహములో బ్రవేశించినపుడు తన ప్రచారములలో నార్జించిన జ్ఞానమును జీవాత్మ ప్రకటింపగలదు. కావున మానవార్జితజ్ఞానము వాని దేహముతో నశింపక జీవాత్మ నాశ్రయించియుండు ననువిషయము గ్రహింపగలము.

దేహ విసర్జనరహస్య మెఱిగిన జీవాత్మ మన కగోచరము, దురవగాహమునగు శక్తులను విశాలాకాశమున గనిపెట్టి యథేచ్ఛగ వాని నుపయోగించు విధాన మెఱిగియుండవలయు. మానవుని క్షణ క్షణ ప్రవర్ధమాన సామర్థ్యము నిరర్థక మొనరించి, నిరంతరాధ్యయనమున నశ్రాంతము విస్తరించు జ్ఞానవాహిని నపహసించి, తన చేతిలోని కీలుబొమ్మవలె వానిని శోచనీయముగ నాడించు ప్రకృతిగత శక్తిసంచయము నీ జీవాత్మ యుక్తియుక్తముగ లాలించి, మచ్చికచేసి, వశ

మొనర్చుకొని, సర్వాధికారము వహించి తుదకు శాశ్వత భృత్యవర్గములోనికి జేర్ప గలడు.

దుర్లభమగు నీవిద్యయం దుత్తీర్ణుడగు టకుమానవుడు నిష్ఠాగరిష్ఠుడై యేకాగ్రచిత్తముతో జ్ఞానాభివృద్ధియే లక్ష్యముగా నుంచుకొనవలయు. మానవు డట్టి దీక్షానిమగ్నుడైనను సహచరుల నతిక్రమించి జ్ఞానపథమున సహస్రయోజనములు ముందుగ బోజాలిన వాడే సాఫల్యము నొందుట కవకాశమున్నది. దానికైన కొన్ని శతాబ్దములుగడువవలయు. కాలక్రమమున దేహావిసర్జనవిద్య మానవుడు సముపార్జించు ననుకొందము. తన భౌతిక దేహమున కెట్టి అపాయము వాటిల్లకుండ జీవాత్మను దానినుండి నిర్గమింపజేసి, అవసర మైనపుడు పునఃప్రవేశ మొనర్పగలడు. జీవాత్మయొక్క బహిర్గమన, పునఃప్రవేశములు సకాలమున, నిరపాయముగ, నిశ్చితముగ నొనర్చుట కష్టముగాదు. అట్టి శక్తియుక్తుడగు మానవుని జీవాత్మ భద్రముగ నొకచో తనపంజరమును గుప్తపఱచి, సంధ్యాసమయముల విలాసార్థముపూదోటల మనము విహరించునట్లు, అనంతాకాశమున స్వైర సంచార మొనర్చి, క్షణములో బ్రహ్మాండము చుట్టిరాగలడు. మన స్థూలదృష్టికి త్రోవ తెన్నులు కాన్పింపని శూన్యాకాశమున జీవాత్మ నిజమార్గమును సులభముగ గుర్తింప గలడు.

మానవుని సాధారణ మేధాశక్తి వేయి మడుంగు అభివృద్ధియగుటచే వశీకృతమైన దేహావిసర్జన పాటవమున జీవాత్మ శారీరబంధములనుండి విముక్తుడై, యాకాశవిహార మొనర్చుచు, వసుధకనతిదూరముననున్న బుధుడు, శుక్రుడు, గురుడు మొదలగు గ్రహములను తొలుదొలుత దర్శించును. వానియందుభూత రూపమునగాని, భౌతిక దేహములతోగాని జీవరాసు లున్నయెడల వాని నీజీవాత్మ అనాయాసముగ గుర్తింపగలడు. ఎట్లన, శక్తి సంబంధమగు భూతరూపముల నున్నచో సజాతీయులను సహజముగ హెచ్చరింపగలడు; భౌతికదేహధారు లైనచో శరీరపంజరవాసి యగు జీవాత్మ యెంత వికృతాకారులైనను గుర్తింపకుండుటకు కారణములేదు. కావున మన సోదరగ్రహవాసు లీయాత్రికుని పరిశీలనమునుండి తప్పించుకొనజాలరు.

ఇట్లీ గ్రహసంచార మొనర్చుచున్న జీవాత్మ యే యేలోకముల సందర్శించునో, ఆ యా లోకములందున్న జీవులతో సంప్రతింప ప్రయత్నించును ఆదేశవాసులు దేహధారులైనచో నీ జీవాత్మ పూర్వభౌతిక దేహసంపర్కవాసనచే మాయారూపము ధరించి, వారికి వ్యక్తీకృతమై యథోచితముగ నిష్ఠాగోష్ఠియొనర్చును. వారుభూతములైనచో మంత్రబలప్రభావమున మన దృఢశరీరావరణము నధిగమించి, మనఃప్రవృత్తిని తయస్ఫటికము వోలె విశదీకరించు మాంత్రికునివలె అదృశ్య

శక్తిచలనమూలమున వారితో సంభాషించును.

నానాలోక సందర్శనోద్యోగమున జ్ఞానవికాసప్రమాణమున వివిధాంతరములలో నున్న జీవగణముల నీ యాత్రికుడు గాంచవచ్చును. ఏలోకమునగాని బుద్ధివిస్తరతలో దనకు లోకువయగువారున్న యెడల వారినుద్ధరించును. అమేయమేధాసంపన్నులున్న లోకమున కేగినపుడు వినయపూర్వకముగ వారి శుశ్రూష జేసి, భక్తిపురస్సరముగా వారి యుపన్యాసము లాలకించి మనకన్న వేయిమడుంగు లప్పటికే వికసించిన నిజజ్ఞానమును తన్మూలమున శతసహస్రాంతము విస్తరించుకొనును. ఈరీతి నపరిమితజ్ఞానసంపాదన సామర్థ్యమున ప్రజ్వలిత సోపానములపగిది రాజిల్లు నక్షత్రములలోనొకదానినుండి వేరొకదానికి ఊర్ధ్వాభిముఖుడై పోవుచు, సృష్టిరహస్యమందలి పరమార్థమేతావున నైననుండి, అది శాశ్వతాగమ్యము కానిచో నచ్చోటికి చేరవచ్చును.

జీవాత్మ, తన సంచారములలో మనకన్న నజ్ఞానతిమిరావృతులగు జీవులు వసించు లోకము చేరెననుకొందము. మన ఆదిమకాంతారవాసులు నియమించుకొనినవాటికన్న వారిమతాచారములు సాంఘికపద్ధతులు రాజశాసనములు క్రూరమై, అశ్లీలమై, మహాఘోరమై యుండును. మన మీలోకమున నివారించి జయించి, నిర్మూలించు దురంత క్షామములు, తీవ్రతరరోగములు మొదలగుజాడ్యములు పెనుభూతములవలె ఆ జీవులపైబడి క్షణక్షణము లక్షలకొలది నశింపజేయుచుండును. తా గ్రహించిన రహస్యములు వారి కెఱిగించి దురదృష్టవశమున వారుపాల్పడిన దుర్భరక్లేశములనుండి వారినయ్యవసరమున నుద్ధరించుట మనపథికుని ముఖ్యవిధియై యున్నదిగదా?

పరలోకవాసులతో కొంద రపారవిద్యాపారంగతు లనుకొనుట కవకాశ మున్నది. అట్టివారిలో కరుణాపారీణుడగు జీవాత్మ యొక్కడు మన వసుధ కేతెంచిన నెట్లుండును? మన శాస్త్రీయాన్వేషణములు, వివిధమతచర్చలు, వాగ్బహుళ తర్కవాదములు, బాలిశకళావాఙ్మయములు, రాజ్యాంగప్రహసనములు, దుర్బలశాసనములాదిగ వానికి హృదయంగమముగ తోచకున్నను, ప్రకృతిజన్యమై మానవాతీతమగు దురన్యాయములు వానిననివార్యముగ నాకర్షించుట నిశ్చయము. నిర్హేతుకముగ వ్యాధిగ్రస్తులై మహామారుల కాహారులగుచున్న శిశువులు హతాశులై, నిరాశ్రయులై, నిరర్థకులై, జీవితాంతమువఱకు భయంకరవ్యథా భారమున క్రుంగుచున్న వృద్ధులు నివేదించుదృశ్యము వాని నామూలాగ్రము చలింపజేయును. మన వైద్యశాస్త్రమీవఱకు కనుగొనజాలని యౌషధరాజములననాదిగ హస్తగతమొనర్చుకొని, తత్ప్రయోగమునం దారితేఱిన అభ్యాగతు డొక్క స్వచ్ఛందపదోచ్చారణతో యమయాతనలు మాయమొనర్చి స్తనంధయులకు పూర్ణారో

గ్యమును, వయోవృద్ధులకు జీవితసౌఖ్యమొన గూర్పకుండునా ?

అట్టి మహాభాగ్యము మన కెన్నడైన లభించెనా? సృష్ట్యాది గతించిన కాలములో జననీగర్భసంభవుడు కానట్టి పథికు డేలోకమున నుండియైన వచ్చి మనల నుద్ధరించెనా? పరలోకవాసు లెన్నడైన మనకుమహోపకార మొనరించి రని సందేహించుటకైన అవకాశ మున్నదా? స్వానుభవము, కల్పనా సామర్థ్యము, విజయోత్సాహము, సౌఖ్యస్థానాభిలాషకన్న మన జ్ఞానాభివృద్ధి కాదినుండియు చేదోడైన వేమైనగలవా? అట్లయిన దీని పర్యవసానమేమి? అపారవిశ్వమున గల బహుధానేకలోకములలో మనకన్న మేధానిధులు లేరన్నచో దోషమున్నదా? ఆకాశమయ విశ్వములో భూవాసులమగు మనము ఏకాకులమైతి మని భీతివివశుల మగుటకు హేతువులేదా? అనంతవిశ్వసామ్రాజ్యమునకు మనమే నవరత్నఖచితకనకమయమకుట మైనచో నింతకుమహోన్నతముగ నాశింప దగిన దేమున్నది? భావి మహోత్కృష్ట కాంక్షాపరుల మగుట కే మున్నది? ఐన, ఈ విశ్వమేమి? ఈ విశ్వమును సృజించిన భావమో, విధియో, శక్తియో, దైవమో,—అదేమి ?



దమ్ముచాలదు C. C. R.

# ప్రభావతీప్రద్యుమ్నము

వోలేటి వేంకటసుబ్బరాయశాస్త్రి

ఆశ్వయుజమాసపు 'భారతీపత్రిక'లో "శ్రీతిరుపతి వేంకటేశ్వరకవుల ప్రభావతీ ప్రద్యుమ్న" మను నాటకమునందలి కొన్ని విషయములను గుఱించి నే నొకచిన్నవ్యాసమును వ్రాసితిని. దానిపై శ్రీవేంకటశాస్త్రులవా రాగ్రహపూరితులైనన్నుఁ దమ విధేయకోటినుండి వెలిఁబుచ్చి, ప్రకృతమున కనుసరింపని వ్యక్తిగత ప్రసంగములతో నాప్రశ్నలకు సరియగు సమాధానమిప్పింపకయే, నన్నెఱిఁగిసూన "గంపంగడచి పిండం బయలుపడితే" యనిసూచ వ్రాసి, యొకపెద్దవ్యాసమును సముల్లేఖించిరి. ఏమైననేమి? పెద్దలగు వారి వ్యాసమునందలి వ్యక్తిగతవిమర్శనాదికమును గణింపక, పైనాటకమునందు శేషించియున్న నాసందేహములనుగూడఁ బనిలోపనిగా శోధించి, తిరిగి యీవ్యాసమును వ్రాయ సాహసించితిని. ఈనాహృదయము నెఱిఁగి శ్రీశాస్త్రులవారు దయతో సమగ్రముగా సమాధాన మిప్పింతురని యాశించుచున్నాఁడను

"ఈమూఁగురు జామాతల"కను పద్యము సందేహాస్పదముగా నుండుటచే నేనడుగుటలోఁ దప్పులేదుకదా? షష్టిపూర్తి మహోత్సవ సందర్భములో శ్రీవారి గ్రంథరాజములను దిరిగి సమగ్రముగా సచ్ఛాత్తించునప్పుడు శ్రీశాస్త్రులవా రీవిరోధమును దెల్పినట్లును, దానిపై శ్రీకాటూరి వేంకటేశ్వరరావుగారు దిద్దినట్లును నాకుఁ దెలియలేదు. గురువును మెప్పించిన శిష్యులగువారు దిద్దిన దిద్దఁగలుగుదురు. షష్టిపూర్తి ముద్రణమునఁ గూడ వారు సాధారణులకు సాధ్యపడని పద్యమునుమాత్రమే దిద్దిరి. మఱియొకచోట దిద్దలేదు. అదెట్లున్ననేమి?

ఇంక శ్రీశాస్త్రులవారి నాగ్రహపూరితులనుగాఁ జేసిన నావ్యాసములోని విషయమునకు నాయాశయమును దెలియఁబఱచుచున్నాను. సమంజసమో, అసమంజసమో సహృదయు లాలోచింతురుగాక!

"వెక్కిరింపఁబోయి బోల్తాపడుట" యనునది శ్రీశాస్త్రులవారి కాగ్రహమును గలిగించినది. ఆవాక్యమునకు నే ననుకొనిన యభిప్రాయము తగియున్నదనియే తలఁచి యారీతి నుపయోగించితిని. అట్టియభిప్రాయము దానికి సరిపడనిచో క్షంతవ్యుఁడనే. ఆగ్రహబుద్ధితోఁగాక సరళాభిప్రాయముతో నీ విషయమును బరిశీలింతురుగాక!

తాను బ్రతిఫలింపఁ దలఁచుకొనుటచేఁ బింగళి సూరనార్యుఁడు శుచిముఖిపాత్రను గవయిత్రిగాను, విదుషిగాను మాత్రమే చూపియున్నాఁడు. అంతమాత్రమునఁ బ్రకృతమునకుఁ గలుగు ప్రయోజనముకంటె ధారణాసంపత్తితోఁ గూడుకొనినదని చెప్పుటచేఁ బ్రయోజన మెక్కువగానుండునని తలఁచి, పిం. సూ. కంటెఁ దమ కెక్కువశక్తి గలదని చూపుటకేగదా వీ రారీతిగా వ్రాసియున్నారు. పిం. సూ. కవియుఁ బండితుఁడును మాత్రమే కాని శతావధానాదికమును జేయఁగలవాఁడుకాఁడు. మేమో పండితులము, కవులము, శతావధానాదికమును జేయఁగలవారము నని లోకులకుఁ దెలుపుటకేకదా యావిషయమునుగూడఁ దఱచుగా వ్రాయుట. ఇది పిం. సూ. ను వెక్కిరించుటకాదా? ఇట్టి యభిప్రాయముతో వ్రాసిన నావాక్యము ప్రకృతమునకు సమన్వయింపకున్నదా? సమన్వయింపనిచో క్షంతవ్యుఁడనే.

"ప్రభావతీప్రద్యుమ్న" మనుశీర్షకముతో నిదివఱలో వ్యాసముఁ బ్రకటించినప్పుడు నేను నాల్గు విషయములఁగూర్చి వ్రాసితిని.

1 ప్రద్యుమ్నగదసాంబుల పుత్రులెందఱు? ముగ్గురని యొకచోట, నల్వురని వేఱొకచోటనుండుటచేఁ బూర్వోత్తర విరోధముగా నున్నది. నల్వురగుటచే "ఈమూఁగురు జామాతల" కనుపద్యమును దిద్దవలయును.

2. శుచిముఖి పాత్రలోఁ బ్రతిఫలింపఁ బోయి ప్రత్యక్షవిరోధమును బరిశీలింపలేదు.

3. "నలినాసనవాహనహంసములలోని యొక మరాళపతి ధర్మపత్ని" నని ప్రబంధములోని పుత్రిని బత్నిగామార్చుటలో ఫలము. వివాహసంబంధముకుదురు నట్లుతోఁపదు. "వంశపతి సారసనంభవు తేరివార్వ" మనుటచే విరోధముగానున్నది.

4. రాజరాజేశ్వరియొక్క దయచేఁ గవిత యల వడినట్లు చెప్పి వాణీదయావిశేషముచేనని వేఱొకచోట నుండుటచే విరోధముగానున్నది.

ఇఁక నీవ్యాసములో వ్రాయఁబూనుకొనిన నూతన సందేహములను నిరూపింతును. పట్టిప్రూఫ్రీ ముద్రణము నీసారి చూవియే వ్రాయుచుంటిని. తప్పులున్న క్షమింపఁ బ్రార్థన.

1 ప్రద్యుమ్నగద సాంబులు ముగ్గురును కృష్ణ పుత్రులా? నావ్యాసములో "కృష్ణపుత్రులగు ప్రద్యుమ్నగదసాంబులని వ్రాసితిని. ఈవిషయమున నేమేని శంకచేయుదురేమోయని తలఁచితిని. కాని యట్లుచేయ లేదు. గదుఁడు కృష్ణసోదరుఁడుగాని కృష్ణపుత్రుఁడు గాఁడేమో? కృష్ణసోదరుఁడనుటకు హరివంశము పూర్వ భాగము-

"వసుదేవునకు బాహ్లికపుత్రియైన రోహిణి ప్రథమపత్నియై బలభద్రుండాద్యుండుగాఁ గ్రమంబున...... గదుండునను కొడుకులంజిత్రయను కూఁతుంగాంచె"

"దేవకియాదిగాగ వసుదేవుఁడు......

సూనులఁ బల్వుర నాగదాదులన్."

ఉత్తరభాగము-

"విను ప్రద్యుమ్నుఁడు జనియిం
చిన నెలలో ననఘపుణ్య శీలుఁడు పుత్రుం
డనుపమశౌర్యుఁడు సాంబుఁడు
జనియించెను జాంబవతికి జగదభినుతుఁడై."

భాగవతము-నవమస్కంధము.

"వసుదేవునివలన రోహిణియందు బలుండును... గదుండును."

వాచస్పత్యం-గద—రోహిణీ గర్భజాతే వసుదేవపుత్రభేదే. గదాగ్రజ—గదస్యాగ్రజః. శ్రీకృష్ణే. తస్యసాపత్న్యభ్రాతృత్వేపి ఏకపితృకత్వేనతస్యగద తోఽగ్రజత్వాత్ తథాత్వమ్." అమరకోశము మున్నగునిఘంటువులలోఁగూడ గదాగ్రజ శబ్దము గనఁబడు చున్నది.

"జగా దాగ్రే గదాగ్రజమ్" అని మాఘకవి ప్రయోగము. గదుఁడు కృష్ణునకు సోదరుఁడేగానిపుత్రుఁ డుకానియెడల "నల్వురు......వారె పోయగుదురు నాగుమనుమలు," "ఇటనాత్మజాలూనిరియూఢభారమున్" అనుట యెట్లు సరిపడును?

చంద్రప్రభుండు:—"తాతా! చంద్రవతీ గర్భ సంజాతుండు గదాత్మజుండు మీమనుమండు చంద్రప్రభుండు మీకిదె నమస్కరించుచున్నాఁడు." అనుట సరిపడునా?

ఈవిషయమును బరిశీలించియేకాఁబోలు పింగళి సూరనార్యుఁడు పంచమాశ్వాసమునకుఁ జివర "అంత నచ్యుతుండు.. ...తదాధిపత్యంబునకుఁ బ్రభావంతునిఁ జంద్రప్రభుని గుణవంతునిఁ గీర్తిమంతునిం బట్టాభిషిక్తులంగావించి, కొడుకులం గోడండ్రనుం దమ్మునిమఱఁదలి" నని వ్రాసియున్నాఁడు. "కోరికఁ దావకానుజుని కూఁతులకుం బతులైనవారు మావారలె" యనుటలోఁ గూడ స్పష్టపడుచున్నది. గదుఁడుసోదరుఁడై నపక్షమున నిట్లుచెప్పించియుండడేమో?

2 దేవాంశ సంభూతులుగనుండి మనుష్యాకారముతోఁ బూజింపఁబడుచుఁ గేవలస్వతంత్రతాసంయుక్తులుగ నొప్పినహనుమంతుని, గరుత్మంతుఁదక్కఁ దక్కిన తిర్యగ్రూపపాత్రల రంగస్థలమునఁ బ్రధానముగఁ బ్రదర్శించుట నాటకసమయానుగుణముగా నుండునా? ఎక్కడనో యేకదేశములోవచ్చిన, దాని నేదోరీతిగఁ ద్రోసివేయవచ్చునేమోకాని ప్రకృతనాటకమునఁ జాల వఱకున్న శుచిముఖిపాత్రను నటకుఁ డేరీతిగా నటించి సామాజికులకు రసానుభూతిని గలిగించును?

హంసయొక్క యాకారముగానుండి నటకుఁడు నటింప వీలులేదనియే కాఁబోలు హోతావేంకటకృష్ణ కవిగారు "ప్రభావతీ ప్రద్యుమ్న నాటకము"లో

"శుచి:—నాకాధిపా! దేవరవారి నందనవనంబునంగల మానససరోవరమందు విహరించెడు రాజహంసలలో నేనొకదానను. కామరూపసంచారిణి నగుటచే నే నిట్లు స్త్రీరూపంబున సంచరింపుచుంటిని" అని శుచిముఖి పాత్రను బక్షిరూపమునఁగాక స్త్రీరూపమున నటింపఁ జేయించినారు.

3 నాందిలో "రాక్షసఖండనక్రియ పయిం బ్రేమించు" అనియుండుటచే నిందు ముఖ్యముగాఁ జూపఁ దలఁచినది వజ్రనాభవినాశనమా? అగుచో నిందుఁ బ్రధానరసమేది?

4 "పరమ్మునకుఁ బూర్వమ్ముచే శాస్త్రబాధ చోదితంబు" "కృతాకృతప్రసంగిత్వ ముభయత్రతుల్యమే", "శీఘ్రోపస్థితమగుకతన అంతరంగమ్మగుచున్నదే" ఇట్టి వెంత పాత్రపోషణార్థమైనను నాటకాదులలో నుపయోగించుట తగునా? దీనివలన సద్యఃపరనిర్వృతికలుగునా?

శ్రీవేంకట శాస్త్రిలవారు రెండుసంవత్సరముల నుండి మిక్కిలియనారోగ్యముగా నుండినసంగతి నెఱుఁగకుండ నిటులేల వ్రాసితినో, శ్రీశాస్త్రిలవారీపర్యాయ మీవిధేయకోటిలోనివానిపై దయనుంచి బాగుగా నాలోచించెదరుగాకయని ప్రార్థించుచుంటిని.



అక్కచెల్లెండ్రు హంపీమార్గమున

# పిక్టోరియల్ ఫొటోగ్రఫీ

తేజోలేఖనాన్ని కొత్తగా నేర్చుకున్న వ్యక్తికి దానివిషయమై దిగులేవుండదు. తనకు బాగుందనితోచిందల్లా తియ్యటమే ఆవ్యక్తిపని. ఇట్లాతీసేటప్పుడు మన మేమి తీస్తున్నామా, ఇది తర్వాత ఇప్పుడున్నంత బాగావుంటుందా అన్న ఆలోచనేవుండదు. ఆవ్యక్తి పిల్లలుఎక్కడున్నా ఫొటోతియ్యటానికి బాగుంటారు. ఆవ్యక్తిబొమ్మలుతియ్యటంలో ఏమన్నా శ్రమపడాలిసిన విషయముంటే తనకు కావలిసినది బొమ్మలో పడుతున్నదా, లేదా అని చూచుకోవటంవరకే. కెమేరాలో సాధారణంగా లోపం వుండదు గదా? తరువాత బొమ్మలు ఎవరు కాగితంమీదికి తీసిపెట్టలేరు?

నిజమాలోచిస్తే ప్రతివ్యక్తీ ఇట్లాబొమ్మలుతీసి తగలెయ్యాలిసిందే. కాని ఈతమాషా ఎంతకాలమనేది ప్రశ్న. సాధారణంగా ఆరునెల్లయ్యేటప్పటికి విసుగేస్తుంది. ఎందుచేతనంటే ఫోటోతీసి చూసినప్పుడల్లా పన్నెండింటికి ఒకటి వస్తే బాగారావటం, తతిమ్మావన్నీ ఏదోవికంగా చెడిపోవటం, చివరకు తనకు ఫోటోలు తియ్యటం చేతకాదని అనుమానంవేసి మళ్లీ ప్రయత్నంచేసి అవీ బాగా రాకపోగానే నిర్ధారణ కావటం తరచుజరగటంవల్ల. ఇది సాధారణంగా ప్రతివ్యక్తికీ తప్పదు.

కాని ఈ వ్యక్తులలో కొందరు తెలివిగలవాళ్లు మనుకునేవాళ్లున్నారు. వీళ్లు అనుకున్నబొమ్మలు తప్ప తియ్యరు! అనగా కనపడ్డదల్లా తియ్యరు. దీచి, విడోస్ హోము, క్వీన్ మేరీకాలేజి, హైకోర్టు, వాళ్ల బ్బాయి!

ఇట్లా ఫోటోలు తీస్తుండగా స్వాభావికంగా మంచిఆర్టిస్టును చెయ్యటానికి ప్రకృతే అవకాశమిస్తుంది. కాగితంమీద బొమ్మతీసిచూడగానే "అరెరె! అదిలేకపోతే ఈ బొమ్మ ఎంత బాగుండేదిరా!" అంటాడు. అంటే మనిషివెనకాలో, పిల్లవాడివెనకాలో ఏదో అసహ్యంగానో, అడ్డంగానో వుంటుంది. లేకపోతే ఇంకేదో విధంగా బాగుండదు. వ్యక్తి అదిగుర్తించటమే మొదటి స్థితి. పాటకచ్చేరి కాబోయ్యేముందర సుతిపెట్టినట్లే. తరువాత తనేదోబొమ్మతియ్యగానే అదిఎందుచేతనో తనకేకాకుండా (దానివిషయం పూర్తిగా తెలిసినవాడవటంచేత!) ఇంట్లోవాళ్లందరికీ (దాని విషయం ఏమీ తెలియనివాళ్లకి) బాగుంటుంది, అదితన పిల్లవాడిబొమ్మకాకపోయినప్పటికీ. ఈబాగున్నబొమ్మను తనుతియ్యలేదు. ఎట్లాగో పొరబాటున వచ్చింది. తిను మళ్లీ తియ్యలేడు. పైగా ఆబొమ్మ ఎందువల్ల బాగుంది? అందులో ఏముంది? ఈప్రశ్నలూ, ఆలోచనలు సుత్తిపెట్టి కొట్టినట్లు వ్యక్తికి ఒకవేదన కలిగిస్తాయి. ఈ వుక్కబొమ్మనే ఆ వ్యక్తి కొన్నాళ్లు తెగచూస్తాడు. చూసినకొద్దీ ఆబొమ్మ ఇందువల్ల బాగుండవచ్చునని అనుమానంవేసి తర్వాత నిర్ధారణవుతుంది. తను ఇదివరకు తీసినబొమ్మలలో ఒక్కటీ బాగుండదు. ఇట్లా మంచిబొమ్మ ఒకటి తీసి అది మంచిదని గుర్తించగానే ఫోటోలు తియ్యటంలో జోరు తగ్గుతుంది.

ఇట్లా మంచిబొమ్మలు పొరబాటున రావటంకంటె వ్యక్తిఎప్పుడుబడితే అప్పుడు అటువంటిబొమ్మలు తియ్యగలిగే శక్తికన్న ఇంకోటి కళోపాసకుడికి జీవితంలో కోరుకోతగ్గదిలేదు. ఈ బొమ్మలకే Pictorial Photographs అనిపేరు వీటి కంతూలేదు, అయిపోవటమంటూలేదు.

వ్యక్తి పైనచెప్పిన స్థితికొచ్చింతరువాత ఆలోచనలు జాస్తవుతాయి. తనకి ఏబొమ్మాబాగుండదు. తనుబొమ్మ తియ్యలేడు! తన కసలు ఫొటోగ్రఫీ ఏంచాతవును? ఈ స్థితిలో ఎవరన్నా "మా అబ్బాయి ఫోటో తీసిపెట్టండి!" అని అడిగితే "నేనుతియ్యలేను." అనిచెప్తాడు. వాళ్లకిది అర్థంగాక గర్వ మెక్కువైందనుకుంటారు.

వ్యక్తి ఈస్థితిలో చాల అవస్థలుపడతాడు ఒక పురుషుణ్ణిప్రేమించిన స్త్రీకిమల్లేనే! తనకు మంచిబొమ్మలు తియ్యాలనివుంది. కాని "ఎట్లా?" అనేప్రశ్న ప్రతిసారీ ఎదురొస్తుంటుంది. తరవాత మనస్సులోనే బొమ్మ

లను కల్పిస్తాడు. ఇక్కడో చెట్టు, దానిమీద అటునించి సూర్యరశ్మి, పక్కనకొంత ఖాళీ, తరవాత అదివరగేటు. ఇట్లా మనస్సులో వున్న బొమ్మలను తియ్యాలనుకుంటాడు ఈ స్థితిలో Photographyమీద పత్రికలు, పుస్తకాలు తెప్పించి చదవటం సమయానికి కూరలో తిరగమోతవెయ్యటంతో సమానం! ముఖ్యంగా అందులో వున్నబొమ్మల్ని జీర్ణంచేసకోటం. మొదట చాలబొమ్మలుబాగుండవు! ఈబొమ్మలు ప్రచురించినందుకు పత్రికవాళ్లకు సిగ్గులేదనుకోవలిసివస్తుంది. కొంతకాలమైంతరవాత పత్రికవాళ్లకు సిగ్గులేదనుకోటం పొరబాటేనని ఆవ్యక్తికే తెలుస్తుంది. ఈబొమ్మలు చూడటంలో ఇంకోచిక్కుకూడా వస్తుంది. అదేమిటంటే తన మనస్సులో అట్లాతీస్తేబాగుంటాయి అనుకున్న బొమ్మలు (తనబొమ్మలు!) ఎవరో తీసి పత్రికల్లో సిగ్గులేకుండా వేయిస్తారు. ఈ దెబ్బసరిగా నడినెత్తిమీద పడుతుంది. త నసలే ఫోటోలు తియ్యలేకుండా వున్నాడు. ఆపైన సాధ్యమైనంత త్వరలో తీద్దామనుకుంటున్న బొమ్మలు ఇదివరకే ఎవరో తీస్తే తన గతేమిటి? ఈసమయంలో ప్రతివ్యక్తికీ నిరుత్సాహం కలుగుతుంది. వ్యాసరచయితల్లోకూడావుంది ఈవిషయం. కాని ఇట్లా నిరుత్సాహంచెందటం మంచిసంగతికాదు. పైగా సంతోషించాలిసినవిషయం. ఎంచేతంటే తను ఇట్లాతీస్తే బాగుంటయి అనుకున్నబొమ్మలు నిజంగామంచివేనన్నమాట! కళ ఒకడి సొమ్ముకాదు. కొందామంటే దొరకదు.

ప్రతివ్యక్తికీ కళ అబ్బదు. కాని ప్రతివ్యక్తిలోనూ కళనలుసు లుంటయి. వీటిని వృద్ధిచెయ్యవచ్చు. వృద్ధిచెయ్యకపోవటం వృద్ధిచెయ్యకుండా వున్నవాళ్లదే తప్పు. ఈవృద్ధిచెయ్యట మనేదే లేకపోతే ప్రస్తుతం లోకంలో ఇంతమంది కళోపాసకు లుండరు. వీటిని వృద్ధిచెయ్యటానికి మొదలు ముఖ్యంగా ప్రకృతిని గమనించటం. ప్రకృతికన్న అందమైంది లేదు. ప్రకృతిలో ప్రతిచోట అందముంది. అది కనిపెట్టేవాడే గొప్పకళోపాసకుడు.

కొన్నిపుస్తకాల్లో ఈ Pictorial Photographyకి కొన్ని Principles వున్నయి. వీటినన్నిటిని Satisfy చేస్తే ఆబొమ్మ తప్పకుండా Royal Photographic Society లో పాస్ అవుతుంది. కాని ఆ బొమ్మ బాగుండక పోవచ్చు! ఈ బొమ్మల్లో టెక్నిక్ జాస్తిగా వుంటుంది. ఎంత సేపటికి ఆ Principles దగ్గిరికి రానియ్యకుండా, వాటిని అతిక్రమించకుండా తియ్యాలి. అప్పుడే అవి బాగుంటయి. Principles కోసమే తీసే బొమ్మ తాళంకోసమే పాడేపాటల్లే వుంటుంది. పుస్తకాలన్నీ చదివి మనిషి కొంతిరట్టులోపడ్డ తరువాత ఈపుస్తకాలన్నీ అనవసరమనిపిస్తుంది. అదీనిజమే! కాని ఆమాటని పుస్తకాలు చదవకుండా వుండొద్దు. అవి తప్పకుండా అవసరం. ఎట్లా అనవసరమో చదివినా తెలియక పోవచ్చుగాని చదివిం తరువాత ఇవి అనవసరమని అనుకుంటేతప్పులేదు. ఎందుకంటే పుస్తకాలెప్పుడూ పుస్తకాల అవసరాన్ని చెప్పవుకాబట్టి.

కొంతమంది ఏకళనూ చస్తేఅభివృద్ధిచెయ్యలేరు. అందులో కొంతజీవితంగడిస్తే అసలు చెయ్యలేరు. ఎందుచేతంటే వాళ్ళకు ప్రతిదీఅనుమానమే! హార్మోనియంలో అన్నీ సరిగమపదనిసలే కదా? నోటితోపడ్డట్టు హార్మోనియం ఎందుకుపడుతుంది? అని వకాయన ప్రశ్న ఈయన కొంతకాలంకింద హార్మోనియం నేర్చుకోటం మొదలుపెట్టాడు. బహుశా ఈపాటికి మానేసివుంటాడు. ఈలాగే ఈఫోటోగ్రాఫీలోకూడాఅనుమానాలువస్తయి. అసలుబొమ్మెందుకుపడాలి? నేను ఈపీటనెందుకు ఫోటో తియ్యటం ఆ అబ్బాయినితియ్యక? అదేమిటి మనిషిని పక్కకుతిప్పి ఫోటో తియ్యమంటాడు? ఎదురుగ్గా తీస్తే శుభ్రంగా మేడంతా పడుతుందికదా? నేనెందుకు పక్కక్లి తియ్యటం? ఇటువంటివాళ్ళనరట్టుపడియ్యాలన్నా, దీనియందు కొంచెము గౌరవముకలిగించాలన్నా ఒకమందుంది. అదిచాలచౌక! ఆవ్యక్తిని ఏమీలేని చోటును (ఏదైనాసరే. అంటేఅందులో ఫోటో తియ్యటానికి ఏమీలేనిది) ఫోటోతియ్యమనటమే! దాంతో కొంత జటిల వదుల్తుంది. పొలాల్లో ఏమీవుండదు. మరిఎట్లా ఫోటోతియ్యటం? అప్పుడావ్యక్తికి ఎదో ఒకచెట్టుకాని, పుట్టగాని తనుతీశేఫోటోలో పడేటట్టుచెయ్యాలని తప్పకుండాతట్టుతుంది. ఇట్లాసాగిస్తే కొంతకాలానికి మనిషిని ఎందుకుపక్కకుతిప్పి ఫోటోతియ్యాలో, ఎప్పుడు

తియ్యాలో మేడని యెదురుగా ఎందుకు తియ్యకూడదో, ఎప్పుడు తియ్యవచ్చునో తెలుస్తుంది.

ఈఫొటోలుతియ్యటం నేర్పమంటారు కొందరు. వ్యక్తి మామూలుఫొటోలు ఆనందించటంపోయి, పైకి పోయింతరువాత (అంటే బ్రహ్మిగాడు కనపడ్డతరవాత!) ఈనేర్పటంకష్టం. అందులో కళతోకూడుకున్న ఫొటోలుతియ్యటం అనేది నేర్పటం ఘటం. ఎందుకంటే నేర్పేందుకేమీ లేదనీ, అందులో తన కసలు చాతకాదనీ ఆవ్యక్తికిస్పష్టంగా తెలుసునాయె!

ఈ Pictorial Photographyని నేర్పటానికి చాల Courses వున్నాయి. ఇవి ఎక్కువలాభం లేదు. ఇవి చెప్పేదిఏమిటంటే, తప్పుదోవలు, గుంటలు చూపించటం, మంచిదోవకుమార్గంఇది అనిచెప్పటం, ఇంతే. ఈ Courses కంటె స్వానుభవం చాలమంచిది. రెండు మూడువందల వ్యాసాలురాసి, చించి, అవతలపారేస్తేగాని మంచివ్యాసాలు వరసగా, ఎప్పుడుపడితే అప్పుడు, రాయలేని వ్యాసరచయితమల్లే, రెండుమూడువందలు ఫోటోలుతీసి వాటిని చూసి, అవి బాగా లేకపోతే కారణంఏమిటో తెలుసుకొని, మళ్లీ ఆతప్పు ఎన్నడూచెయ్యకుండా ఫోటోలు తీశేటట్లయితే ఒకవిధంగా ఆదీపం ఆరదు. తీసినప్పుడల్లా కొంతకాలంవరకు ఏదో ఒకపొరబాటు కనపడుతుంది. దాన్ని మళ్లీ రానియ్యకూడదు.

కాని ఈ అనుభవం బుర్రకెక్కి జ్ఞాపకముంచుకుంటే ఏమీలాభంలేదు. ఈ అనుభవం రక్తంలో కలిస్తేనే లాభం. ఇది జరిగినప్పుడు ఏవ్యక్తీ మొదటతీసినంత జోరుగా ఫొటోలు తియ్యలేడు. ప్రతిబొమ్మకీ ఆలోచన జాస్తవుతుంది. ఒకవేళ మొదట్లోనే మంచి ఫొటో రావచ్చు! కాని అది పెద్ద Fluke. గొప్పవాళ్లు చాల తక్కువ ఫొటోలుతీస్తారు. వాళ్లకి పూసులాం అవసరంలేదు. వాళ్లకి ఏది, ఎప్పుడు, ఎట్లా తియ్యాలో తెలుసు. అందుకనే వాళ్లుతీసినవి అట్లావుంటాయి! మనకి చాల బాసున్నవి (ఆబొమ్మలన్నీ మనమే తీస్తే బాసుండేది అనుకునేవి!) వాళ్లకి చాల సామాన్యంగావుంటాయి. ప్రతివ్యక్తీ రక్తంలోపడ్డతరువాత చూచినమంచి బొమ్మల్లా తనే ఇదివరకు తీసివుంటే తనకి ప్రతికాంపిటీషన్‌లోనూ ఫస్టుప్రైజువస్తుంది అనుకోటం సహజం!

కొంతమందిపని Negative తయారుచెయ్యటంతో అయిపోతుంది. ఆ Negatives ని ఎవడికో ఇయ్యటం, వాడు వాటిని Print చేసిఇయ్యటం. ఇది లాభంలేదు. ఇవి ఇంట్లో చూసుకోటానికి తప్పితే మరెందుకూపనికిరావు. మంచికాంపిటీషన్స్‌లో వీటిగతి తెలిస్తే ఆఖరు ప్రైజుకూడారాదు. Exibitions లోవీటినసలుదగ్గిరికే రానియ్యరు. ఇప్పుడు Exibitions లో ఎంతసేపటికీ ఒకటేపద్ధతి బొమ్మ అసహ్యంగాలేకుండ Print అత్యద్భుతంగావుంటే చాలు. మంచిబొమ్మతీసి అసహ్యంగా Print చేసి పంపిస్తే పొరబాటున మంచిబొమ్మ తీశా అనుకుంటారు! కాబట్టి Printing విషయం పూర్తిగా తెలియాలి.

బొమ్మమంచిదైంది, కానిది తెలిసికోటానికి ఈ కింది పద్ధతికంటె మంచిదిలేదు. JohnErith అనే అతను బొమ్మ తీస్తాడు. వెంటనే దాన్ని Print చేస్తాడు. బొమ్మలో ఏభాగ మవసరమో, ఏభాగ మనవసరమో తెలుసుకోటానికి నాలుగు బద్దలుపెట్టి చూస్తాడు. చివరకు ఆబద్దలమధ్యభాగం బాగానేవుంది అనుకుంటాడు. Negative లో ఆభాగాన్నే Enlarge చేస్తాడు. ఇట్లాచెయ్యటంవల్ల కలిగేలాభం ఏమిటంటే ఒకవేళ ఆబొమ్మ బాగా లేకపోయినప్పటికి పూర్తి Negative వుండటంచేత ఇబ్బందిలేదు. కొందరు Negative ను బాగావున్న దనుకున్న భాగంవరకు కత్తిరిస్తారు. సాధారణంగా తరవాత ఎక్కువ కత్తిరించామని విచారపడతారు. పోయిన Negative రాదు. మళ్లీ తియ్యాలనుకుంటే సాధారణంగా కుదరదు. ఒకవేళ కుదిరితే కత్తిరించకుండా వున్నప్పుడున్న మొదటిదే బాగుంటుంది. అట్లా Enlarge చేసి దాన్ని పెట్టెలో దాచిపెడతాడు ఆరునెల్లదాక! తరువాత తీసిచూసి అప్పటికీ తనకుబాగుంటే అప్పుడు దాన్ని Exibition కి పంపిస్తాడు!

నిజానికి ఒకవిషయాన్ని గురించి మంచిచెడు తెలుసుకోవాలంటే Time కంటె మంచి Test ఏముంది ?

# రామ టెక్

క్రమధాటి వెంకటగిరి

మధ్యపరగణాలకు (Central Provinces) ముఖ్యపట్టణమైన నాగపూరునకు ౨౮ మైళ్ల దూరమున 'రామటెక్' అను ఒక చిన్నగ్రామము కలదు. ఈ గ్రామము సమీపమున ఒక చిన్నకొండపై శ్రీరాములవారిగుడి యుండుటచే దీనికి 'రామటెక్' అను పేరు కలిగెను. 'టెక్' అనగా కొండ. ఈకొండపై నుండు దేవాలయములన్నియు ౬౦౦ సంవత్సరములక్రిందట కట్టబడినవని శాసనముల ద్వారా తెలియవచ్చుచున్నది. ఇది యొక పవిత్రస్థానముగ పేరందినది. ప్రతి సంవత్సరము కార్తీకమాసమునందు పూర్ణిమ మొదలు పదునైదు దినములవరకు ఉత్సవము జరుపబడును. ఈ యుత్సవమునకు సరాసరి లక్షజనము కూడుదురు.

కాళిదాస మహాకవియొక్క మేఘదూతలో చెప్పబడిన "రామగిరి"యే యిదియని కొందరు చెప్పుదురు. శ్రీరాములు లంకకు పోవుమార్గమున కొంతకాల మిచ్చటనుండిరనియు,మఱలపట్టాభిషేకానంతరము శంబూకుడను శూద్రుడు తపస్సుచేయుచుండుటను గూర్చి బ్రాహ్మణులు మొరబెట్టుకొన, శంబూకుని వధించుటకు ఇచ్చటికి వచ్చిరనియు చెప్పుదురు. ఈ కొండకు "సింధూరగిరి" యనియు, 'తపోగిరి' యనియు పేర్లుగలవు. విష్ణువు నరసింహావతారమెత్తి హిరణ్యకశిపుని ఇచ్చట జంపగా కొండయంతయు రక్తప్రవాహములచే ఎఱ్ఱనాయెననియు చెప్పుదురు. ఇందువలన దీనికి 'సింధూరగిరి'యని పేరు. ఇచ్చటి రాళ్లుకూడ ముక్కలుగచేసిన ఎఱ్ఱనిరంగుతో కలసియుండును. అగస్త్యమహర్షి యీ కొండపై తపస్సుచేయుచుండినందున దీనికి "తపోగిరి" యనుపేరు వచ్చెనని చెప్పుదురు.

ఈ కొండ సుమారు ౫౦౦ అడుగుల ఎత్తు గలది. శ్రీరాములవారి ఆలయమున కెదురుగా లక్ష్మణస్వామిగుడి యొకటికలదు. ఇవిగాక కౌసల్యా, సత్యనారాయణ, మహిషాసురమర్దని, లక్ష్మీనారాయణులు, వెంకటేశ్వరుడు, హనుమంతుడు మొదలగు దేవతల విగ్రహములతో ప్రత్యేకాలయములు గలవు. ఈ ఆలయములకు నలువైపులను ఒక ప్రాకారముకలదు. ఈ ప్రాకారము ౧౭౮౩ వ సంవత్సరమున కట్టబడినది. శ్రీరామలక్ష్మణుల విగ్రహములు నల్లరాతితో తీర్చబడినవి. ఈ విగ్రహములు "దుదల"అను కోనేటియందు దొరికెననియు, శిథిలమైనందువలన మారువిగ్రహములు తీర్చి స్థాపింపబడెననియు చెప్పుదురు.

లక్ష్మీనారాయణుని గుడిపైన 'రామ యరోక'యను నొక గాలిమేడ (Balcony) కలదు. దీనిపైనుండి చూచిన, రామటెక్ పట్టణము ఒకమ్యాప్ వలె కనబడును. ఇచ్చట "కబీరు చబుత్ర" అను నొక అరుగు కలదు. ఇది కబీర్ దాసు కూర్చొనుచున్న స్థలమని చెప్పుదురు. కాని ఇచ్చటిపూజారులు అది సూర్యవంశ రాజపుత్రికలు వన విహారానంతరము ఉయ్యాల లూగుచుండిన స్థలమని చెప్పుదురు.

ఇచ్చట మరియొక స్థలమునందు దశరథ మహారాజుయొక్క గుడియొకటికలదు. ఇచ్చటికి రాములవారి దర్శనమునకు వచ్చువారెల్లరు మొదట దశరథమహారాజు దర్శనము చేసికొని పిమ్మటనే దాశరథిదర్శనము చేయుదురు. ఇచ్చట మహారాష్ట్రులు కట్టిన ఆయుధశాల కలదు. మరియొక స్థలమందు వరాహవిగ్రహము కలదు. దీనికి సమీపమున నొక మహమ్మదీయుల మసీదుకూడకలదు. ఈ మసీదునుగురించి అనేకకథలు, పురాణములు చెప్పుదురు. ఇందులో ఒక సంగతి యేమన:- ఒకముసల్మాను ప్రభువు ఈ దేవాలయమును శిథిలపరచుటకు వచ్చినపుడు తేనెటీగ లతనిని క్రమ్ముకొని అతనికార్యమును భంగపరుప, అందునిమిత్త మతడు ఇచ్చట నొకమసీదు కట్టివెడలెను. అందువల్లనే ఇప్పుడుకూడ "రామరహీమ్‌కోజ్లో డాహై" అని చెప్పుదురు.

కొండకు సమీపమున చండికాదేవి యొక్క గుడియొకటి, అంబాతటాకమొకటి కలదు. ఈ తటాకముచుట్టును పెక్కుగుడులు కలవు. అందులో సూర్యభగవానుని గుడి చాలముఖ్యమైనది. ఇవి కాక చకోర్ద, రామతౌలా, దశాశ్వమేధ మొదలగు తటాకములు నీ కొండ సమీపమున గలవు.

లక్ష్మణస్వామి గుడిగోడపై యొక శాసనముకలదు. ఇందులో చెక్కిన కొన్నియక్షరములు శిథిలమైపోయినవి ఇందులో మువ్వాతిక భాగమంతయు 'రామటెక్' తీర్థముయొక్క మాహాత్మ్యము వర్ణింపబడియున్నది.

ఈ శాసనములనుబట్టి ఈగుడులన్నియు ౬౦౦ సంవత్సరములకు మునుపే కట్టబడినవని తెలియుచున్నది. ఈ శాసనములో అనేక పవిత్రస్థలముల వర్ణనలు కలవు. అందులో చెప్పిన అష్టతీర్థములు యీ కొండ చుట్టును వుండు తటాకములే యని చెప్పవచ్చును. ఈ కొండక్రిందనుండు 'అంబాల' తటాకమే పితృతీర్థమని చెప్పుదురు. ఇప్పుడు కూడ నిచ్చట పితృదేవతలకు, మృతినొందిన వారికి, తర్పణములును, ఆహుతియు నిచ్చువాడుక కలదు. "చక్రతీర్థ" యనునది యిప్పుడిచ్చట నుండు 'చకోర్ద' తటాకమే. ఇట్లే అష్టతీర్థములన్నియు తటాకములుగానున్నవి. ఇచ్చటి కోట సమీపమున పుష్కరిణి అను సరోవర మొకటి కలదు. ఇచ్చటికి అనేక తీర్థయాత్రికులు వచ్చెదరు.



౧ శిథిలములు



౨ శిథిల సింహద్వారము

I. R. K. S.

రామ దేవాలయమునకు పోవు మార్గమందు 'ధూమకేశ్వర' అను పేరుతో ఒక గుడి కలదు. ఇందులో లింగరూపముతో నొక విగ్రహ మున్నది. దీనికి ఈ పేరువచ్చుటకు కారణ మేమన:—

శంబుకుడను శూద్రుడు తపస్సుచేయు చుండుటనుగూర్చి బ్రాహ్మణులు శ్రీరాముల వారితో "శూద్రుడు తపస్సుచేయుట కేవలము మతాచారమునకు లోపమనియు, శంబుకునియొక్క అహంకారమును అణచవలెననియు మొరబెట్టుకొనగ శ్రీరాములు కొండక్రిందినుండి బాణముతో శంబుకుని వధించిరి. అతడు చచ్చుటకు మునుపు శ్రీరాముని మూడు వరములు కోరెను—'తన శవమును శిలారూపముగ జేసి అచ్చటనే స్థాపింపవలెననియు, శ్రీరాములు ఆ కొండమీద నెల్లకాల ముండవలెననియు, తాను శ్రీరాములకు ముందే పూజింపబడవలెననియు కోరగా శ్రీరాములు ఆవరములిచ్చిరి. ఇందువల్లనే యచ్చటికి వచ్చు యాత్రికులు మొదట "ధూమకేశ్వర మహాదేవ" లింగమునకు పూజ గావించిన అనంతరమే శ్రీరాముల వారి సేవచేయు వాడుక.



దుగ్ధసాగరం

# నా మహారాష్ట్రయాత్ర

శ్రీ

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

తెరువునకొంతసే పల్లెనిలువంబడిపోతిని. చీకటి ఇంకనుపలుచబడలేదు. చలిగాలి అల్లనల్లనవీచుచున్నది. నలుదిక్కులు ఇంకనుసుషుప్తిమగ్నమైయున్నవి. అప్పటి నిస్తబ్ధత భావమయమైచూపట్టినది. రెప్పవాల్చక దశదిశలను పరికించుచుంటిని. చాలదూరమునుండి అపుడేదో మధురరవము వినవచ్చినది. సుమారస్మృతిపథమున మధుమయ స్వప్నములను లేపుచు, ఆత్మచే "హాయి! హాయి!!" అనిపించు ప్రణయభావమువలె నానిస్వనము శ్రుతిగోచరమైనది. ఒక్కొకగీతికావాక్కు ఒక్కొక పిల్లగాలియలపై నధిష్ఠించి చెవిసోకుచు నాయంతరంగమునజొచ్చి అందనంత ఆనందవీచికల నుప్పొంగించెను.

మనుష్యస్పర్శనెఱుగక మంచుకొండపై నడయాడు గంగోత్తరి ప్రశాంతహృదమున అల్లన జారిపడు చల్లనిచినుకువలె శాంతిమయమైన ముహూర్తమున, శీతలమైన శర్వరీవాతావరణమున, చింతాస్పర్శనెఱుగని అంతరంగమున గీతికాహృదినుండి రాలు తియ్యనితలపు అనంతభావమహోదధికి కన్నతల్లియగునుగదా! మునులును, కవులును రమ్యప్రకృతియందే తమ జీవనములను కడప నిచ్ఛగించుట మానససరోవరమట్లందు వెలయు శాంతియందు గ్రుంకులిడి, గభీరధ్యానమున మునుగీతలిది క్రొంగ్రొత్తమానికములనుచేబట్టుటకేకదా! సచ్చిదానందములందు త్రివేణియగుటపరికించి వారచ్చో విజ్ఞానయాత్రికులగుటకైకదా !

మనసంతయు నామధురరవముపై నిలిపితిని. పొలములందు నడిరేయి వినబడు తేటపాటవలె నది వినబడుచున్నది. అందు సంస్కృతపదములు లేవు. కాపులుచ్చరించు తేలికహిందీమాటలే పాటలైనవి. ఇట్టి మాటలేకదా నీట నవలీలగ గలియు చక్కెరవలె మనసున గలసిపోవును! విన్నన చుక్కలు తోచినంతన కొండలందు జోలపాడును పక్షిసంతానమును నిద్రపుచ్చు చల్లని కడుపుగల వెల్లువవలె, కొండొక పల్లెవాసిశుభ్రచిత్తమునుండి అల్లన వెడలు నాగీతిక అత్తటి నాసికావాసులను జోకొట్టుచుండెను. గీతికయందు మాటిమాటికి వినబడు సంబోధనశబ్దము "కన్హైయ్యా!"

గోకులవాసులు శ్రీకృష్ణుని "కన్హైయ్యా" అనుచుందురు. ప్రేమరసమును వెలార్చునది తల్లిముద్దుగాని సింహాసనాసీనయైన రాజమహిషి యుచ్చరించు ముదలగాదు. మనసునకు ముద్దుగొలుపునది తల్లిమాటగాని సంస్కృతశబ్దముకాదు. సుధనుచిందించునవి శీతకర కిరణములుగాని మోటుత్రాళ్లా? చెమ్మటలందు పెంపొందిన సంస్కృతపాండితి చెమ్మటలనే పుట్టించునుగదా! సూనగర్భమునుండి యవిరళధారయై వెలువడు సౌరభమ్ములు గంధబంధురహృదినుండి సహజభావధారయే నిలింపుల కమృతము నొడ్డించిన దేవదేవునివలె జిజ్ఞాసువులయాత్మల కానందమునొడ్డించును. గట్టికాయలనుండిగాక లలితసుమదళములనుండియే మంచుమంచిముత్తెపుకేరుదాలిచిన రేకుమూకలనుండియే మాధురవాసనలు వెడలులీల గట్టిమాటనుండిగాక చక్కనై, చల్లనై కోమలమైన పదములనుండియే తేనెతుంపురులు పోలు తలపులు వెల్వడును. చక్కనికవిత మెదడునకు బొప్పిగట్టించు జటిలవాక్కునందుగాక, కమ్మతావిని కలువడించుచు "హాయి! హాయి!!" యనిపించు పంటపైరుపోలు తల్లిమాటయందే తన దివ్యార్థమును వ్యక్తపఱుపజాలును. ఈయంశమును పండితులందు మసలినపుడుగాక పల్లెలందు, పామరులందు మసలినపుడు గ్రహింపగలిగితిని. సంయుక్తరాష్ట్రములందలి పల్లెలందు చాలనెలలుండి, కవిజనమనసులు పోలు నచ్చటిపొలములందు పెక్కురాత్రులుకడపి, హిందూ

స్థానీరైతులపాటలకు వీనుదోసి యొగ్గి, పరమపరితోషమున మున్కవేసిన భాగ్యము నాకు చేకూఱినది. "కన్హైయియా!" యని ముద్దుకృష్ణునికడుచనువున సంబోధించి, ఆవేశపూరితులై వారు పాటలుఃపాడుచుందురు. ఆహా! వానియందలి కైత ఎంతమహత్తరమైనది! హృదయమును కదలించునదేకదా కవిత! ఆత్మచే తాండవనృత్యము చేయించునదేకదా కవిత! మనసున తన్మయానందమును నిండించునదే కదా కవిత! ఇట్టి యద్భుతానుభవములను గేయములు కలిగించులీల మఱేరచనములును గలిగింపవని నాయూహ. బిడ్డను ముద్దుపేరున బిలచినదే కదా కన్నతల్లి గుండెయందలి నిండుప్రేమను గుమ్మరించును! ముద్దుకృష్ణుని తలమూర్కొనుచు మురిసిపోయిన యశోదవలె "కన్హైయియా!" యనుచు, నిర్మలాత్ములైన పాలికాపులు ఇంతింతనరాని యానందమున గంతువేయుచుందురు.

నాటిపాటయందలి "కన్హైయియా!" శబ్దము మాటిమాటికి చెవిబడినందున వెనుకటి యనుభవములెన్నో నాస్మృతిపథమున పొడసూపినవి.* గోకులవాసియైన గొల్లయెవ్వడో యాత్రికుడై నాసిక కరుదెంచి మధుమయరజనీసమయమున తన గొల్లదేవుని ప్రస్తుతించుచుండెనని గ్రహించితిని. పాట వినవచ్చుదెస కల్లన జని గొల్లనెచ్చెలిని చేరవలెనని మక్కువపడితిని. చాలదూరమునుండికదా అది వినబడుచుండెను! "పొలమునుండియో? పడిసెనుండియో? గుడినుండియో? ఎట్లుగ్రహింతును? అయినను కొన్ని యడుగు లాదిక్కుగాబోతిని. అపుడెవడో ఒకవ్యక్తి నాకెదురై "అయ్యా! మీదేయూరు?" అని నన్నడిగినాడు. "నేనుయాత్రికుడను. త్రియంబకముపోదును. ఆపాట యెందుండివినవచ్చుచున్నది?" అని నేనడిగితిని. "కొందఱుకొందఱు యాత్రికులు ఇందుండి త్రియంబకము నడచిపోవుచుందురు. పోవుచుపోవుచునో, విడిసినచోట్లనుండియో వారట్లుపాడుచుందురు" అని యాతడనినాడు. అట్టిపామరులతో, అట్టియమాయకులతో - యాత్రయందును, జగదీశునందును సంపూర్ణవిశ్వాసముంచినడచువారితో - పొలములందును, పైరులందును, శేలందును నిస్తబ్ధతయందును సలిపిన యాత్రయే యాత్ర! ఇట్టి యాత్రయందే ప్రతియంగుళమును, ప్రత్యంగుళమందలి ప్రత్యణువును బహుళభావ సంభరితమై మనకు చూపట్టును. ఆర్యావర్తమున పెక్కుతూరు లట్టియాత్ర సలిపి ధన్యుడనైతిని. గగనచుంబి మహావిశ్వవిద్యాలయమున, పెద్ద పరీక్షలందు నెగ్గి, పెక్కుపసదసము లంది ఎంతోజ్ఞానమును పడసితినని నే నెన్నడు విశ్వసింపలేదు. నా విశ్వవిద్యాలయము నుండి కదలిపోయి, విశాలభారతభూమియందు పచ్చికపానుపులందు, పండుచేలందు, పర్వతసానువులందు, లోతులోయలందు, మంచుతెరువులందు, పల్లెవాసులందు, రైతుబిడ్డలందు మసలినపుడే నేనించుక విజ్ఞానమును చవిజూచితినని విశ్వసించుచుందును. నా యీ యాత్రను గుఱించిన కథనము నాంధ్రావని కర్పనమొనరించుట తెలుగున యాత్రకు సంబంధించిన గ్రంథములెవ్వియు లేవనియేగాక నిక్కంపు విజ్ఞానము లభించు తెన్నుల నెన్నో తోడిజిజ్ఞాసువులకు చూపజాలుదునని నమ్మి యని వినీతభావమునపాఠకమహాశయుల కెఱిగించుచున్నాను. ఆర్యావర్తమునందువలెనే మహారాష్ట్రమందు గూడ అంగుళమంగుళమును పఠించుచు పయనముసాగింప నుద్దేశించి కొంతదనుక నెగ్గుదల నందితిని. మహారాష్ట్రమందు కొండలును, అడవులును విశేషముగ నుండుటచే, వానియందే విశేషకాలము కాల్నడకను గడప నిశ్చయించి సమతలప్రదేశములందు (నిర్దిష్టసమయమందు యాత్రను ముగించుకొనుటకై) అక్కఱయగువేళలందు బండియందో, బస్సులోనో పయనముసాగించితిని; నాసికాత్రియంబకములనుండి బొంబాయి తరలిపోయిన పిదప అందుండి పలుపవలయు దీర్ఘమైన మహారాష్ట్రయాత్రకు వలసిన సన్నాహములను ముందే ఆయత్తమొనరించుకొంటిని. నాసికనుండి త్రియంబకము

* సంయుక్తరాష్ట్రములందును, అన్యప్రదేశములందును పాలికాపులతో నే గడిపినవేళల గుఱించిన విపులోదంతమును చదువరులు వేఱుగ్రంథమున విలోకింపగలరు.

నకు నడచిపోవలెనని తొలుత నేను నిశ్చయించుకొన నైతిని. నడచిపోవు యాత్రికులం దెందఱో యుందురని నేనెఱుగనైతిని. నాటినిశీథినీసమయమున నట్టియాత్రికులెవ్వరును నాకు సన్నిహితులుకాలేదు. పోయి, ఆపాటగానిని జేరుకొందమనినను, అల్లనల్లన నది గాలిలో లీనమైపోయినది! ఇక నడచి అత్తటి ఎందరుగుదును? కావున త్రియంబకమువఱకు బస్సుమీదనే పోక తప్పదని గ్రహించితిని. "త్రియంబకముపోవు బస్సు కొంచెముప్రొద్దెక్కిన పిదప బయల్దేరును. అది కదలు చోటు ఇచ్చటికి ఫర్లాంగుదూరమందున్నది. విశ్రమించుటకు మీకందుచోటులభించును. దానిని మాపెదను రండు." అని తెరువరి పలికను. వానితో కొంతదూరము సాగిపోతిని. ఆదూరమున నొకచావడిజూపి, "అది బస్సుప్రయాణీకులకై యేర్పడిన విశ్రాంతిగృహము. మీ రందు పరుండవచ్చును" అనిచెప్పి ఆవ్యక్తి తనదారిని తానుపోయెను. మెల్లగ నే నావిశ్రాంతిస్థానముకడ కరిగితిని. అది పశువులసాలవలెనున్నది. కొలది మాత్రపుస్తంభములపై కప్పునిలిచియున్నది! గోడలు లేవు! పలువురు నాలుగుమూలలందు నిద్రించుచుండిరి. రకరకము లగుఱ్ఱులు వినబడుచున్నవి. వారియం దాసమయమున ప్రవేశించు టెట్లు? మధ్యభాగమున నేదో పెద్ద బస్తా కానుపించినది. దానిసమీపమున జేరవచ్చు నను కొంటిని. పోయిబస్తాపొంత చతికిలబడితిని. మేను వాల్చుటకు చోటులేదు. వాల్చవలెనను నిచ్ఛగూడ నాకులేదు. ఒకగడియ నేనెట్లో కాలక్షేపముచేయ నిశ్చయించితిని. కూర్చుండియు, నిలిచియు, ఒక్కొకయడుగు ముందులకువేసియు నిద్రించుమహాశయులతో * నీవఱలో ప్రయాణములు సాగించుతరుణములు నాకులభించినవి కాని యీయద్భుతచర్యలం దొక్కటియు నాకు పట్టుబడలేదు. కనులుమూసి నాటి యాత్రోదంతమును తలపోయుసాగితిని. దీర్ఘయోచనమునకును నిద్రకును దగ్గఱిచుట్టరిక ముండునుకదా! యోచనా మగ్నుడును, నిద్రామగ్నుడును బాహ్యప్రపంచమునుండి దూరముగ తొలగిపోదురు. నాకు కొంతసేపు యోచనయందు మునిగియుంటిని. వాయుతరంగములందు నెందో యంత గాఢమైన మధుర కృష్ణగీతికనన్వేషించుచు శర్వరీనిస్తబ్ధ యందు నాగాత్మ యొందేనిచనుచెంచినది.

శరీరమును, మానసమును కైదీలిపట్టి యుండు జోడు జోగులట్లు ఆత్మను పట్టియుండునుగదా! వీనిపై హుకుమ్‌చలాయించి, వీనిచే నిట్టి కర్జమైన

* ఇట్టివారిలో నరసింగదాస్ రాతి యనువ్యక్తి యొకడు. ఇతనిది రాజస్థానమండలి, బికనీరురాష్ట్రములోని 'దేశనోక్' అనుపల్లె. ఇతడు మంచిభక్తుడు. సరయూపరితీరమున నయోధ్యలో "స్వర్గద్వార" ఘట్టమునకుసమీపమున యాత్రికులకై ఒకవిశ్రాంతిగృహమును కట్టించినాడు. ఏబదేండ్లు (పిల్లనిచ్చే పుణ్యాత్ములు ప్రత్యక్షముకాలేదుకనుక) కఠినబ్రహ్మచర్యదీక్ష సలిపినాడు. తొండములేని విఘ్నేశ్వరునివలె తయారైనాడు. నాతో నీతడు ఉత్తరహిందూస్థానమున యాత్రసలిపినాడు. ౧౯౩౮ ఏప్రిల్ ౧౩వ తేదీని హరిద్వారమున జరిగిన అద్భుతమైన గంగాకుంభమేళ సమయమున నాతో నున్నాడు. నాటిఅపరాహ్ణసమయమున పలువురుసన్న్యాసులు అలంకృతగజములెక్కి మహాసంరంభమున జాహ్నవీతీరమున నుత్సవముసలిపిరి. ఎందరెందఱో భక్తులు సన్న్యాసులు పోవుతెరువున నిలిచి, అచటిదుమ్ము పవిత్రవంతమైనదనియెంచి దానిని తలపైబోసికొనువారు. వీరిలో నరసింగురాతియొకడు. నాటిదృశ్యమును చూచుటకై గట్టుమీద బహుసంఖ్యాకులతోపాటు నేనుకూర్చుని యుంటిని. నరసింగ్ బూడిదబుస్సవన్నెయైవచ్చి నాప్రక్క జతికిలపడి నాటియల్లకల్లోలమం దరనిముసములో గాఢనిద్రపట్టించుకొనినాడు. నాతోకలిసి ఈతడుదీర్ఘయాత్రసలిపినాడు. కడుపునిండ చనవలయువేళలం దీతడు తప్పక కునికిపాట్లుపడువాడు. ఈతనివిచిత్రోదంతమునుచదువరులు వేఱుగ్రంథముల గాంచగలరు. అందు "ధమేనా" యనిపేర్కొనబడునాతడితడే! తులసీదాసురామాయణమును చదువునపుడు మాటిమాటికితడు తలవూచుచు కడువింతగ నీతడు మాటలుచ్ఛరించువాడు. 'ధమేనా' పోలువింతశబ్దమును తఱచుగ పలుకువాడు గావున, వీనికి 'ధమేనా' గాడని నామకరణముచేసితిని.

రించునది కర్మయే. వీనిపట్టునుండి వదలి ఈశ్వర ధామమును చేరుకొనుట కాత్మ తపించుచుండును. కళ యిట్టిపట్టులనుండి వీనిని విడిపింపజాలునని నావిశ్వాసము. కళ ఈశ్వరదూతి! కళామహత్త్వముకతన శారీరకమానసిక నిర్బంధము నిరర్థకమగును. బుసగొట్టుచునెగయు విషోరగముకూడ నాగస్వరమువిని, తన క్రౌర్యమును నేలరాల్చి తన్మయచిత్తమైనమహాభక్తునిభంగి ఆత్మహృదినానందమునునింపుకొని ఆందీదులాడదా? కళలందుమిన్నయైనది సంగీతమే! అందును మధురభావసంభరితమైన ఈశ్వరనామమునుగూడిన గీతాలాపనము ద్విగుణీకృత మాధుర్యమునదొలుకాడదా? ఎంకుదొన్నిలోని తేనియకంటె పుష్పాంతరంగమున నుప్పొంగు మరందము మహత్తరమైనదికాదా? దిక్కులేని యిల్లాలివలె నమవసనిశియందల్లాడు సుగంధముకంటె శారదచంద్రికలను తోడుజేసికొని కుసుమోద్యానము లందు విహరించు సౌరభము ఘనతరమైనదికాదా? దివ్యపుష్పకమెక్కి మేఘమార్గమున శ్రీరామునిగూడి పరమ పరితోషమున నయోధ్యకు మరలిన వైదేహివడువున, భక్తిభరమైన గీతావాక్కును ప్రాపొనరించుకొని మనుష్యాత్మ దివ్యబృందావనమును చేరుకొనును. నాటి కృష్ణసంస్తవము విహంగపతి వీపెక్కి అదృశ్యుడైన విష్ణువువలె సమీరస్కంధము నధిష్ఠించి యెందో యరిగెను! అరిగిననేమి? శ్రీకృష్ణుని సంబంధించు రాగలీల మనుష్యహృదయము మహిమోపేత వస్తువులను, శక్తులను అనుసరించుచుండును. కావున నొకప్పుడు మనుష్యదృష్టియందు తవులొక్కనిన దృశ్యములును, మనుష్య కర్ణపుటముల జిక్కిన స్వానుశబ్దములును, చెప్పనేల, మనుష్యానుభవమున జొరబడిన వివిధాంశములును, ఉచ్చులందు బడిన పిట్టబిడ్డలవలె మనుష్యస్మృతినుండి చులకనగ విడివడజాలవు. ఇట్టి యనుభవముల కతన మానవస్మృతి అమృతసూతియట్లు మధురభావపూరితమై యుండును. కావుననే కాబోలు మానులును, కవులును స్మృతిమహత్త్వమున కంజలిఘటింతురు! కావుననే కాబోలు వర్డ్సువర్తు మున్నగు ప్రతీచీకవులును స్మృతినుండి కైకొనిన తీపితలపులను వెలుపలికి తోడి తోడి వానిని రంగారు పద్యపంక్తులందు నింపిరి.

మనుష్యస్మృతి హిందూమతమందు విశేష ప్రాముఖ్యము నందినది. జన్మ జన్మలందలి వివిధానుభవములు మానవహృదియందు గూడియుండునని గదా హైందవ తత్త్వశాస్త్రము తెలుపుచున్నది! నేటి శాంతిదేవి దృష్టాంత మిందులకు ప్రత్యక్ష దృష్టాంతము. స్మృతిగర్భమందలి యనుభవములు మణిపేటికలోని రంగారు బంగారు నాణెములు పోలునవి. బైబిలులో పేర్కొనబడిన నాణెములు ("Talents")— మిల్టన్ కవిచంద్రు డుల్లేఖించిన నాణెములు ఆత్మవృద్ధికనిగదా నిర్దేశింపబడినవి. స్మృతిపేటికయందలి నాణెములును ఇట్టివే! కావుననే మన ఋషికవులును, కవి ఋషులును కనులు మూసికొని స్మృతిమంజూషములను దెఱచి అందలి నాణెములకతన నెంతేనిపరమార్థమును చేబట్టిరి.

రేపల్లె గొల్లపాడిన తియ్యనిపాట మేఘమాలికలందూగాడు దివ్యడోలికవలె నా స్మృతియందింకను దోగాడుచుండెను. శారీరకమైన నాటి పరిశ్రమనుండి, మానసికమైన నాటి పరితాపమునుండి విడివడి నా యాత్మ గోపాలుని పాటవెంట జనినది.

ప్రశాంత సలిలముపై హఠాత్తుగ దొరలిన బండరాయివలె ఆనందమగ్నమైయున్న నా హృదయమున నపుడు మహాప్రళయధ్వని గుభాలుమనినది! పదుగురూ కెవ్వుమనిరి! నే నులికిపడి లేచితిని! అంతవఱకు నా ప్రక్కను పడియున్న పెద్దబస్తా లేచి గణాచారివలె చిందులు త్రొక్కసాగినది! అదేటిచిత్రమో నాకు బోధపడలేదు. నేనత్తఱివిడిసినది "దయ్యముల కొంప కాదుకదా ?" అని తలపోసితిని. బస్తాలోనుండియే ప్రళయధ్వని వినబడుచున్నది! తక్కుంగలవారు గగ్గోలుపడిరి! కొందఱు స్మృతితెలుగక పిచ్చివారివలె నఱువసాగిరి! కొంతసేపటికి మహాకాయ యొత్తుక కప్పుకొనినగోనెను క్రిందపాఱవేసి "చోర్ ! చోర్ !!" అనియఱచి నాపై దుముక గమకించినది. అప్పుడప్పుడే తెల్లవారుచున్నది. వెలుతురులో అందఱూ నన్నే తేటె

చూచిరి. "ఇది ఘోరమైన అత్యాచార"మని నే నూహించితిని. మదరాసు రాజధానియందుతక్క ఇట్టి మూర్ఖుల నెందటినో భారతసీమయందు గాంచితిని. మెత్తగనూరకొనుట అవివేకమని గ్రహించి, లేచినిలిచి "మీ వలెనే నేనును ఇచ్చట విశ్రమించుటకై వచ్చి నాను. ఈముసలిరాకాసి ఇట్లేల యల్లరిచేయుచున్నదో యెఱుగను. చోటు తక్కువయగుడు, బస్తాయనితలచి సమీపమున గూర్చుంటిని. ఏదేని పీడకలగని ముసలిది అల్లరిచేసిన, క్షమింతును. 'చోర్! చోర్!!' ముందు ల పలికినయెడల దీని ముక్కుచెవులు కోయింతును" అని తీవ్రస్వరమున బలికితిని. అచ్చటచేరిన మూక (వీరిలో చదువుసంధ్య లెఱిగినవా డొక్కడును లేడు) సంగతిగ్రహించి ఆయవ్వను కసరికొట్టిరి. అప్పటి కాల్యకృత్యములు నెఱపుటకై నాకు తోడుపడిరి.

బస్సుకై తడసితిని. త్రియంబకము పోయి, అచటి గోదావరియందు స్నానముచేయ నిశ్చయించితిని. కావున నాసికలో నాటియుదయము టీగాని, టిఫిన్ గాని పుచ్చుకొననైతిని. బస్సుస్టేండుకడనున్న బల్లపై నేగూర్చుని యున్నపుడు ఒక్కని వెంబడియొకడు, పండాబఱుద్దాయిలు నాయొద్దకువచ్చిరి. 'నాసికలోని యాత్రముగించుకొని, పిదప త్రియంబకము పోవలెను. ఇట్లని శాస్త్రము చెపుతోంది' అని వారు తమతమ కార్డులను నాకు సమర్పించిరి. "సరే వింటిని ఇకదయ చేయుడు" అని వారినిసాగనంపితిని. ఎనిమిది గంటలైన పిదప మేల్ బస్సువచ్చినది. పోయి దానిలో కూర్చుం టిని. పావుగంట సేపటిలో పెద్దంజలువేయుచు గజా సురుడు వచ్చిపడినాడు. నాసికస్టేషనునుండి అత డెట్లు వచ్చినాడో యెఱుగను. తెల్లవారువఱకు స్టేషను లోనే సుఖనిద్రజెంది, ఉదయమునలేచి యథేచ్ఛగ నడచివచ్చినాడని గ్రహించితిని. ఈతని పంథనవలం బించియుండినచో నాటిచిక్కులు నన్ను మార్కొని యుండునవికావు [illegible] ఆచిక్కులులేకున్న నాయీ కథనము ఎందు[illegible] నుండెడిదని పాఠకులకు మనవిచేయుచుంటిని. గజాసురుడు వచ్చి చివాలున బస్సులో ప్రవేశించినాడు. ౫.

పగటివేళ గజాసురుడు మఱింత స్ఫుటముగా కనుపించినాడు. అతడు పశ్చిమోత్తర రాష్ట్రమందుండు వాడని గ్రహించితిని. తక్షశిలకు పోవునపుడు ఒకప్పు డారాష్ట్రమున పరిభ్రమణ మొనరించితిని. నౌషేరాకు కదలిపోవుటకున్ను కేంబెల్‌పూర్‌లో ఒకవకీలు యింట బసచేసితిని. ఈతనికి మదరాసీలయెడల నెంతేని ప్రీతికలదు. "The brains of Madrassi Brahmins are the best brains in the world" అని యీతడు పలుమాఱు పలుకుచుండువాడు. దాక్షిణాత్యులు మేధావులని సింహస్థానీయు లును, వంగీయులును పరస్పర ప్రసంగములం దను కొనుచుందురు. మఱ్ఱిమ్రానుచెట్టి ప్రభృతు లీవిషయము నెఱుగుదురు. పశ్చిమోత్తర రాష్ట్రమందు పిల్లకొండ లబోలువారును, మఱ్ఱిచెట్లులట్లుండువారును ఎందఱో కలరు. శరీరమునకు సరిపడు మెదడు వీరికిలేదు; కాని వీరు చక్కనిహృదయములు గలవారు. ధైర్యసాహసము లందు వీరు జగతియం దజేయులు. కేంబెల్‌పూరులో నా కాతిథ్యమొసగిన లాయరు ఏనుగవలె నుండువాడు. గజా సురు డాతనియన్నయని భ్రమసితిని.

గజాసురుడు పెద్దకోటు తొడుగుకొనినాడు. ఉన్నతమైన ఉష్ణీషమును ధరించినాడు. బస్సులో సగముచోటు నాక్రమించినాడు అందఱికన్నులు వాని మీదబడినవి! వానిని పలుకరింపదలచితిని. ఇంతలో అతడే "బాబూసాబ్! ఆప్ కహా రహితేహై?" ("అయ్యా! తామెందుండువారు") అని నన్ను ప్రశ్నిం చినాడు. "మద్రాస్" అని చెప్పితిని. నేగూడ అతని నట్లే ప్రశ్నించితిని. "మాది నౌషేరా, నేనుబనియాను, గడియారముల వర్తకముచేయుచుందును. పనిమీద బొం బాయివచ్చినాను. నాసికాత్రియంబకములను చూచి పోవలెనని వచ్చితిని. మీరుకూడ ఇప్పుడు త్రియంబక మునకే పోదురనుకొందును." అని అత డనినాడు. "అవును, నావలె మీరును యాత్రికులని యెఱిగి ఆనం దించితిని" అని యుత్తరమొసగితిని. "నాకుగూడ చాల సంతోషముగానున్నది. మద్రాసునుగుఱించి విశేషము గావినియుంటిని. మనదేశమం దది దొడ్డదావని వింటిని.

"మీరు త్రియంబకములో నెన్నాళ్లుందురు?" అని గ[redacted]సురు డడిగినాడు. "ఆ ప్రదేశమును పూర్తిగపరిశీలించి, నాసికవచ్చి యిందుండి బొంబాయిపోదును. పదపడి అందుండి మిగిలిన మహారాష్ట్రయాత్రసాగింతును." అని బదులుచెప్పితిని.

ఉత్తరయాత్రయందు జగదీశుడు నాకొక పొట్టి పిచికిని ప్రసాదించినాడు. మహారాష్ట్రయాత్రయందాతడు గజాసురుని నా కప్పనమొనరించెనని ఆనందించితిని. ఇరువురము మామా ప్రత్యేకరాష్ట్రములను గురించి ముచ్చటించుకొనసాగితిమి. ఇంతలో బస్సుబయల్దేరినది. మెయిల్ బస్సుకావున చాలనేపుతజులుక కొందఱిని మాత్రమే యెక్కించుకొని అది కదలినది.

మాకెదురుగ నెవడో యొకవ్యక్తికూర్చుని రెండు కన్నులూ మాపై నిలిపినాడు. కడుశ్రద్ధగ మాప్రసంగము వినుచున్నాడు. మనిషిరూపము వింతగమాపట్టి నందున నేనాతనిలక్షణములను పరికింపదొడగితిని. అతని యంగప్రత్యంగములు కలకలుదేరియుండెను. బ్రహ్మదేవుడు Triangles ను మనుష్యాకారముగ మాటగట్టి పుడమిమీదికి పుత్తెంచెనని యూహించితిని. కందగడ్డవలె నెఱ్ఱనెఱ్ఱగానున్నాడు. ముఖమైఖరినిబట్టి "నిస్సంశయముగ నీతడు రక్తమాంసములతోనొప్పు డైమానురాజని గ్రహింపగలిగితిని. "బాబూసాబ్! ఆప్ కహాఁసే ఆయేహై?" అని నన్నడిగినాడు. "వీడు పండాగ్రహ" మని యూహించుకొని నేను ప్రతివచనమీయలేదు. గజాసురునికూడ అతడట్లే ప్రశ్నించినాడు. "నోషేరా" అని అతడు బదులుచెప్పినాడు. "త్రియంబకములో మీ కన్నిసదుపాయములు సమకూర్చి చక్కగ మీచే యాత్ర జరిపిస్తాను" అని అతడు తన కార్డును గజాసురునకిచ్చినాడు. దానినతడు నాచేతబెట్టినాడు. "ఉద్ధవనానా దీక్షిత్, త్రియంబక్, నాసికజిల్లా" అను హిందీఅక్షరములు దానిపై తోచినవి.

నాసికయందుగాని, త్రియంబకమందుగాని ఏ పండావాని గృహమందును విడియుటకు నాకిష్టము లేదు. పండాల "జులుమ్" యెట్టిదో నా బొంబాయి [redacted]. వారివలన తమకు కలిగిన యనుభవములను పూసగ్రుచ్చిన ట్లెఱిగించి, కావునట్లు వారిని దూరముగా తఱిమివేయుమని వారు నాకుసలహా చెప్పిరి. బొంబాయిలో, దాదర్ లోగల భవానీశంకర్ రోడ్డులోని "రాధానివాస్"లో వసించు ముకుందరావు మొరాబా అను మహారాష్ట్రమిత్రుడు త్రియంబకమందు రథగల్లీలో వసించు త్రియంబక్ వినాయక్ వాడేల్ కార్ అను తనకెచ్చెలియింట విడియుమని నాకు సలహాయొసగి నారాకనుగుఱించి ముందే వానికిజాబు వ్రాసెను. అట్లే బొంబాయిలో, థానాయందు, బోంబేరోడ్డులో వసించు ఎస్. సి. బ్రహ్మ అను నింకొక మహారాష్ట్రమిత్రుడు నాసికలో, పంచవటికడ, గంగామందిరప్రాంతమున వసించు తనమిత్రుడు ఎస్. ఎస్. సత్పతీ బి.ఏ, బి.టి గారింటనుండుమని నాతో చెప్పి తాను కూడ వానికి ముందే నాయాగమనమునుగుఱించి ఉత్తరము వ్రాసినాడు. పండాల యెగములు చూడక ఈమిత్రుల తోడ్పాటున నీరెండుయాత్రలను విధ్యుక్తముగ నిర్వర్తించుకొనవలెనని నిశ్చయించితిని కాని, యీనిశ్చితాభిప్రాయమునకు థక్కాతగులునేమోయని యిపుడు తొట్రుపడసాగితిని. నాతోనిపుడు గజాసురుడున్నాడు! ఒకమాదిరి మానవుడయిన నంతగా యోచింపవలసినపని లేదు. ఈతని కతిథిసత్కారముచేయవలెనన్న, దేవాసురులు మానవులకుతోడుపడి, నడుముగట్టి వంటకూ, వడ్డనకూ పూనుకొనవలెను. రథమువంటి మనుజునిచూచి క్రొత్తనెచ్చెలులు మూర్ఛిల్లుదురనుట తథ్యము. పుణ్యమునకుబోయినవారికి పాపమెదురగునేమో! గజాసురునిపరిత్యజించి నాదారిని నేనుపోవుట నాకిష్టములేదు. అతని చంకనిడికొనవలసివచ్చునో మిత్రులనుగాక తదితరులనే పట్టుకొని రెండుయాత్రలూఅయినవనిపించుకొనవలెను. అయినను పండాలదెస నాబుద్ధిపోలేనదికాదు.

"మన మీపండాను చేతబట్టుట మంచిదేమో యోచించండి. క్రొత్తచోటుకనుక ఇటువంటిబ్రాహ్మణుని పరిచర్య మన[illegible] గజాసురుడు నాతోపలికినా[illegible] యుద్దేశమును [illegible]టించుట అత్తఱికూడద[illegible] పండాబాపడు ఉ[illegible]మాట ప్రక

ర్తించు నెడల నిమిషములో గజాసురుడు వానిని 'గుటకాయస్వాహా' చేసితీరుననియు నూహించి "వీడిని పిడికిటబట్టండి" అని నా మిత్రునితో చెప్పితిని.

రమారమి పదునొకండుగంటలగునప్పటికి మాబస్సు త్రియంబకమును చేరుకొన్నది.

ఏసరిల్లలామ దాక్షిణాత్యమందేగాక ఉత్తర హిందూస్థానమునగూడ కడుంగడు పవిత్రవంతమైనదని కొనియాడబడుచుండెనో, ఏమహాపగపూతనామము విని నంతన భక్తులహృదయము లావేశపూరితము లగుచుండునో, ఏసరిత్తీరమున శ్రీరాముడు సతీసోదర సహితుడై వసించి పదునాలుగేండ్లు ప్రకృతిశోభకు కమలప్పగించినాడో, ఏఋషికీమతల్లి నాశ్రయించి గౌతమప్రభృతులు ప్రహృష్టాంతరంగులై తపోధనులై వరలిరో, ఏకల్లోలినికతన బహుళకేదారములు బంగారు పైరులీని అసంఖ్యాకులఉదరములను, హృదయములను, నయనములను తనుపుచున్నవో, ఏయేటిపొంత పోతన రామదర్శనమంది మహాగ్రంథరచనకుగడంగెనో, ఏవెల్లువనీరు త్రావిత్రావి పల్వురు తెలుగుతనయులు అనన్యసామాన్యకవితాశక్తినంది ఆంధ్రభారతి కమూల్యభూషలుసమర్పించిరో, ఏశైవలినిచుట్టు పెక్కుపురాణములును, చరిత్రలును పుట్టుకలంది శతాబ్దులందును, సహస్రాబ్దులందును దాని యద్భుతమహిమను కీర్తించుచున్నవో, ఏనిర్ఝరిణిలో నిలింపులుకూడ జలక్రీడలాడ నింగినుండి యవతరించిరో, ఏధునీకూలమున జనించి ఏనదీవీచికలం దీదులాడి ఏవాహినీకూలస్థవాలుకాస్తూపములం దాటలాడితినో, ఆస్వర్గదాయిని (గో=స్వర్గము, దా=ఇచ్చునది)గనిన త్రియంబకమహాక్షేత్రమున గాలిడినంతన నాహృదయము బహుళభావ సంభరితమైనది; నాయాత్మ ఇంతింతనరాని యానందమున నృత్యమొనరించినది.

బస్సు ఆగినంతనే మాపై పండాజీగలు వ్రాలినవి. తమ ప్రశ్నపరంపరలతో పీడింపసాగినవి. ప్రతివచనమేమియు నీయవలదని గజాసురుని హెచ్చరించి, చరచర నడవదొడగితిని. లావువాడు, నలుపుదాళ్లుగలవాడు, ఘిగులనాటముగ పాగాచుట్టినవాడు, కళావరురాజనదగు వ్యక్తియొకడు మమ్ములను తగులుకొనివచ్చెను. వానిని వదలించుకొనవలెనని మేమెంత యత్నించినను సాగ్గలేక పోతిమి. ఈతనిధాటి నామీదనే పడినది. "అయ్యా! మీది రాజమండ్రియా? మీమకాము ఇన్నీసుపేటలోనా?" అని తొలుత నన్నతడు ప్రశ్నించినాడు. మహారాష్ట్రులకు రాజమండ్రిపేరు పరిచితమైనదని నెఱుగుదును. కాని ఆవ్యక్తికి ఇన్నీసుపేట యెట్లు పరిచితమైనదో గ్రహింపజాలక అబ్బురపడితిని. ఏయుత్తరమొసగక ముందంజ వేయుచునేయుంటిని. "రాజమండ్రివారంతా నాకడను వత్తురు నేనే మీచేవక్కగ యాత్రసాగింతును. నాతోరండు" అనుచు గజముపొడవుగల ఒక పుస్తకమును తెఱచి పల్వురపేర్లను ఏకరువుపెట్టసాగినాడు. ద్రుతగతిని మేము నడచుచునేయుంటిమి; మమ్ము తగులుకొనియే వచ్చుచు తన చిట్టానుండి అతడు యాత్రీకులనామములను గుక్కత్రిప్పుకొనకుండ చదువుచునేయున్నాడు. ఎట్లైనమమ్ములను—ముఖ్యముగ నన్ను—ఈడ్చుకొనిపోవలెనని అతడు నిశ్చయించుకొన్నాడు! కళావరురాజు చదివినపేర్లలో రెండు నాకు పరిచితమైనవి. తొలుతటిది శ్రీపాదకామేశ్వరరావుగారిది. వీరు రాజమండ్రివాసులనియు, ఆంధ్రులకు పరిచితులైన గ్రంథకర్తలనియు, వారలె నొకప్పుడు ద్విజకవినాటకముల నాంధ్రీకరించిరనియు నెఱుగుదును. నేనెఱిగిన రెండవపేరు మేడేపల్లి శ్రీరాములది. ఇతడు నాబాల్యమిత్రుడు. నాల్గవతరగతిమొదలు కొన్నేండ్లవఱకు రాజమండ్రిలో వీరేశలింగం హైస్కూలులో నాసహాధ్యాయుడైయుండెను. కాలేజీచదువు పొంతబోక Technicals పిడికిటబట్టి, బొంబాయిపోయి సోదరుడు అనంతముతోనుగలిసి ఒకపెద్ద ఫర్ములో ప్రవేశించి విశేషధనమార్జించుచు తనయింట రాజన్యుడైయున్నాడు. కామేశ్వరరావుగారి పట్లను, శ్రీరాములుపట్లను ఈ బ్రాహ్మడు ఎట్లు ప్రవర్తించెనో నే నెఱుగను. పండావాడు వారిపేరు లుచ్చరించువఱకు వారు త్రియంబకము పోయిరనియైన నెఱుగను. కాని, కళావరురాజు వర్తనము నాకు దుస్సహమైపోయినది. వాని జబర్దస్తీవైఖరి

నా మనసును మిక్కుటముగ బాధింప దొడగినది. పండాలవలని యనుభవము లెట్టివో సూచనగా చదువరుల కీవఱలో తెలిపియుంటిని. ఈసుప్తగ్రహము మీదికి గజాసురు నుసిగొలిపి వానిపీచమడంచి తక్కుంగల పండాలకు కొంత బుద్ధిగఱప దలచితిని. కాని దౌర్జన్య భావమునకు మనసున జోటీయరాదనియు, అది యాత్రీకుని హృదయమున పొడసూపరాదనియు వెంటనే గ్రహించి "ఏమోయీ ఛాందసుడా! నీవు చచ్చిదోరినను నేను నీవెంట వచ్చువాడనుకాను. నీవూ, నీజాబితా కట్టా ఇక వెనుకకుమరలిన సంతసింతును." అనిపలికితిని. "రానిండు, అలువనిండు, రండు" అని గజాసురుడు డైమాక్ రాజువెంట జరచర నడచుచునే యుండెను. కొంతసేపటిలో డైమాక్ రాజు యిల్లు చేరుకొన్నాము. తఱుముకొనివచ్చిన పండావాడు తనపట్టు దిగ్గనంగని మండిపడి, పండ్లు పటపట లాడించుచు వాడిమాటలు విసరుచు డైమాన్ రాజును మార్కొనినాడు! డైమాక్ రాజు అగ్గి బరాటమైపోయినాడు! "నా యాత్రీకులను—నాసికలోనే నేను సంపాదించుకొనిన యాత్రీకులను కఱచుకొనిపోవుటకు నీకెన్ని వేల గుండెలున్నవిరా? ఇకపో; లేకున్న నీకు తగినట్లు బుద్ధి చెప్పెద"నని అతడు రంకెలు వేసినాడు. అసలే కందగడ్డవంటి మనిషి! ఇప్పుడు మఱింత కందిపోయినాడు! కన్నులనుండి నిప్పులు చెరిగిపోయసాగినాడు! పండు కోతికిని, కొండముచ్చుకును పోరు పొసగినది! "భేష్! మంచి తమాషా!" అని మురిసిపోతిని. ఈ దుండగులను నిర్జించుట అస్మదాదుల పనికాదు కావున, వారొకరినొకరు పచ్చడి చేసికొనవలెననియే విధాత ఉద్దేశించి యుండునని గ్రహించి బ్రహ్మదేవునకు బహుళములైన ధన్యవాదములొసగితిని. క్రోరచూపులూ, కారుకూతలూ, పండ్ల పటపటలూ, దడబడలూ మిలరేగినవి! కురుక్షేత్ర యుద్ధమందలి మహావీరుల ద్వంద్వ యుద్ధములు డైమాక్ రాజు కళావరురాజుల పోరుముందు చచ్చు పెద్దమ్మలని చెప్పవచ్చును! సహజముగ విక్రమశాలులేమో ఒకరికొకరు తీసిపోలేదు. పండ్లూ, గోళ్లూ ఒహాటోరకంగా పయోగింపబడుతూ ఉన్నవి! ఇరువుర ఒడళ్లూ గీరుకొనిపోయినవి! ఈ మహావీరులపై దివినుండి దేవతలింకను పుష్పవర్ష మేలకురిపింపకుండిరో నాకు బోధపడలేదు. నింగినుండి కరతాళధ్వనులైనను వినవచ్చినవి కావు. కలియుగములో నిలింపులుకూడ కఠినాత్ములైరని మిగుల వగచితిని. ఇరువురూ వగర్చుచూ కుమ్ములాడుచుండిరి. అప్పుడు లోపలినుండి డైమాక్ మదాం తాటకివలె అఱచుచు చీపురుపుచ్చుకొని రంగస్థలమున ప్రవేశించినది! గిరజాలులేని డైమాక్ జాకీ (మదాం రాజులపుత్రరత్నము!) ఎదుటివీరునిపై బెడ్డలురువ్వసాగినాడు. గజాసురుడిక నోద్యము చూచుచునిలువంబడలేదు. ఇర్వురు యోగ్యులనడుమ బ్రవేశించి, బలముకొలది కళావరురాజును త్రోసినాడు. ఆత్రోపుతో వాడు గిరగిర దిరిగి తిరిగి, సుభాలున నాసికస్టేషనుపైపడినాడు! పదంపడి డైమాక్ రాజు రాజఠీవితో పెద్దంజలు వేయుచు అంతఃపురమున ప్రవేశించినాడు.

బెడ్డలు రువ్వి రువ్వి, కుఱ్ఱవాడు గుమ్మముముందు చతికిలపడినాడు. అచ్చముగ వాడు డైమాక్ రాజు యొక్క Small edition వలె నున్నాడు. పాపము కురుపులు వేసిన వికారాబోలు, వానితలకాయ అనాసకాయకు అన్నగారివలెనున్నది! తలవెనుక చింతకాయను బురుడించు ముడికలదు! చేరంతగల వానినొసలున రూకంత గందపుచుక్క ఉన్నది. దానిపై అగ్నికణముబోలు బొట్టు అలరారుచున్నది. మిగుల తెల్లనైన వానియజ్ఞోపవీతము పోయి చీలమండను ముద్దుకొనుచున్నది. వాడి వయసు రమారమి పన్నెండేండ్లుండును. కందిన శరీరముతో వాడు మిరపపండువలెనున్నాడు. పద్మాసనము వేసికొని మూతి మెలివేయుచు, అత డేవో పనసముక్క లుచ్చరించుచున్నాడు. మే మాతని తేఱిచూచుచున్నను, మమ్ము పరికింపక అతడు తన ధోరణిలోనే పడియున్నాడు. డైమాక్ రా జపుడు పిడుగువలె నీవలబడి "ఈ బాబుజీల నింకా పైకి తీసుకొనిపోలేదేమిరా కుంకా?" అని శాంపిలుగా ఒక చిన్ని మొట్టికాయ వాని ముడిపై సమర్పించి, వంటింట బ్రవేశించినాడు. "శయ్!" అని వా డొక్క అఱపు అఱచి ముందుకు ఒక్క దూకు దూకి మాత్రమోల నిలిచి, "అయ్యలూ! రండి! పైకి

రండి! దబ్బున! లేకపోతే పిశాచీ హూనంచేస్తారు" అన్నాడు. మేము వానివెంటబడితిమి.

డైమాక్ రాజుమేడ మిగుల విచిత్రమైనది. ప్రపంచమందలి రాజభవనములన్నియు నొకయెత్తు, అదొక యెత్తు! రాళ్ల దరిగాని, యిటుకలదరిగాని పోక సౌధ నిర్మాణమున డైమాన్ రాణీరాజులు అద్భుతమైన స్వతంత్రభావమును వ్యక్తపఱచిరి! తమ మహలును పెదుళ్లతో నిర్మించి దానిపై ఒహాటోరకమైన పేడను దట్టముగా ఫూసిరి! దొడ్డదైన ఈ పదార్థముయొక్క కోటింగ్ డైమాక్‌మదాం స్వయంగా, అతి శ్రద్ధగా తఱచుగా చేయుచుండునని మేడవాలకము చెప్పక చెప్పుచున్నది. గంధవహుని ధర్మమాయని హర్మ్యమాహాత్మ్యము నిముసములో మాకు స్పష్టమైనది. పవిత్రమైన గోమయమున నుత్పన్నమైన వాసన పవిత్రతరమైనది కావున దానినుండి కాలికొలది పరుగెత్తుట సహజ సహనాశీలురకు తగదని గ్రహించి "ఇక లోపల ప్రవేశింతము రండు" అని మహోన్నతశరీరుడైన నామిత్రవరేణ్యునితో తెలిపితిని. కాని మేడమాస్తే పిట్టవలె నున్నది! గజాసురుడో, పడమటికనుమలకు పెద్దన్నయ్యాకదా! "దానిలో నీతడు ప్రవేశించినయెడల దాని గతి యేమగునో దైవమా!" యని అడలితిని. మిరపపండుగాడు "ఆయియే! బాబూ సాబ్!" ("రండు! బాబుగార్లు!") అని తొందరపెట్టుచునే ఉన్నాడు. ప్రాణాలను గుప్పిట్లో పెట్టుకొని అడుగువేయుచు ముందు గజాసురుని దారితీయనిచ్చితిని. అడుగువేసినకొలది పైనజిలిపిన సమీరుని పవరు హెచ్చినది. సంయములకు ప్రాణాయామము అత్యంతావశ్యకమైనది! అప్పట్లో మేము జోడుజోగులవలె తయారైతిమికదా! ఊపిరి బిగబట్టుట మా కపుడు తప్పనిసరియైనది! జగదీశుడు దయామయుడు కావున అప్పట్టున మమ్ముల నట్లు ప్రాణాయామమునందు ప్రవేశపెట్టినాడు! కంపులో పుట్టి పెరిగిన బిడ్డగావున మిరపపండుగాడు నిముసములో మేడమీదికి తుఱ్ఱుమన్నాడు. గజాసురుడు మెల్ల మెల్లగా మెట్లపై అడుగులువేయుచుండెను! నేనాతనివెంట నడుగులు వేయుచుంటిని. పిడుగువలె పైకప్పు ఏ ముహూర్తమున తలపై జారిపడునోయనియు, నేనీ మహాభవనమునుండి డైరక్టుగా ఏకాయకీని వైకుంఠమునకు టపాకట్టినయెడల నింటియొద్ద శారదపని యేమగునోయనియు, ఎన్నో యాత్రలు చేసి, భయంకర ప్రదేశముల నుండి పలుమాఱు భద్రముగా బయటబడి తుదకీ బ్రాహ్మణునియింట నాజీవనచరిత్ర కీతీఱున గద్యచెప్పవలసియుండుట దైవేచ్ఛయేమోయనియు, "చావునకన్ని మాఱులో ఉండవు. ఈ మహాక్షేత్రమున నది లభించుట మహాభాగ్యమే" యనియు, నడుముగట్టిన యోధుడనై అత్తఱి అట్లు అసువులను గోల్పోయినను చిరకీర్తిని పొందజాలుదుననియు, కాని గోదావరితల్లి చల్లనితల్లి కావున తన యనుంగుబిడ్డపై కనికరించి, ఆతనిని ఆపదనుండి కాపాడవచ్చుననియు పరిపరివిధముల తలపోయ మొదలిడితిని. అనుకొనినట్లు గోదావరితల్లి మాపాలిటనున్నది. కొంతసేపటికి మేము సురక్షితముగా పైన జేరుకొంటిమి. చీకటి మూడుమూటలై అక్కడ జేరినట్లు తోడనే మా కందు మూవుర వింతస్వరూపములు ప్రత్యక్షమైనవి! అంత గజాసురుడంతటివాడే ఉలికిపడినాడు! "ఈ మువ్వురును దివినుండి ఈ సౌధాగ్రమున విడిసిన యక్షులో, కిన్నరులో, గంధర్వులో యైయుందు" రని నే నూహించితిని.

# గ్రేటా గార్బో

'కళావినోది'

"అదే మొదటిసారి 'గ్రేటా'ని నేచూడ్డం. ఆవేళ 'గ్రేటా' పదమూడోపుట్టినరోజున, వాళ్ళన్నతక్కున స్నేహితులతోపాటు నన్నూ ఆహ్వానించాడు. నేను ఆలస్యంగా వెళ్ళటం తటస్థించింది. గ్రేటా వాళ్ళ చదువుకునేగదిలో కూర్చుని చదువుకుంటోంది. వాళ్ళన్న అన్నాడు: "ప్రొద్దుటినుంచీ గ్రేటా ఆగది విడిచిరాలేదు. బైట మిత్రులంతా ఆమెకోసం కూర్చున్నారు. నేను నాలుగుసార్లు వెళ్ళి పిలిచాను. చదువుకుంటోన్నప్పుడు ఆమెనికదిపితే కొట్టవచ్చేటంత కోపం తెచ్చుకుంటుంది....అయినా నువ్వోమాటు పలకరించిచూడు."

బెరుకుపడుతూ లోపలికి మెల్లగా అడుగులేసుకుంటూ వెళ్ళాను. తదేకదీక్షతో ఫెయిరీటేల్సు (Fairy Tales) చదువుతోంది. బంగారం లాంటి మెరిసే ఆమెజుట్టూ, పాలుచిలికే ఆమెపాలబుగ్గలూ, నీలాల్లాంటి ఆమెకండ్లూ, కెంపులా మెరిసిపోయే ఆమెపెదిమలూ, తూచినట్లున్న ఆమె అవయవసౌష్ఠవమూ చూసి ముగ్ధుణ్ణయినా. నేనేమిటి, నాయీడులో వుండే యువకులెవ్వరేనాసరే ఆ సమయంలో ఆమెని చూసినా ముగ్ధులేఅవుతారు.

వెళ్ళి ఆమెకెదురుగా నిలబడ్డాను. ఓసారి కనుబొమ్మలెత్తి నావంక చూసింది. ఆహా! ఏమి సౌందర్యం?...

మళ్ళీ తనచదువులోపడింది. ధైర్యంచేసి "మీకోసం మీమిత్రులంతా బైటకూర్చున్నారు" అని చెప్పా. చప్పున పుస్తకం మూసేసి "ఫెయిరీటేల్సులో కథలన్నీ నిజంగా జరిగినవేనంటారా" అంది. ఎంతఅమాయికంగా అడిగింది! నాకు నవ్వువచ్చింది.

"అలాంటికథలు నిజంగా జరిగినవేఅయితే యిప్పుడుమాత్రం ఎందుకుజరుగుతూండవు. అన్నీ అబద్ధం." నేనూ తెలివితక్కువగానే జవాబుచెప్పాను.

ఆనాడుమొదలు రోజూ 'గ్రేటా'ని చూడ్డంకోసం వాళ్ళింటి కెళ్ళేవాణ్ణి. ఆదివారం శెలవువస్తే యిద్దరమూ సమీపంలో వున్న పెద్దపెద్దతోపుల్లోనూ, చిన్నచిన్నగుట్టలెక్కి గడిపేవాళ్ళం. ఆతోపుల్లో మేము షికారుచేస్తూంటే 'నైటింగేలు' పిట్టలా 'గ్రేటా' గొంతెత్తిపాడేది. తన్మయుణ్ణయ్యేవాణ్ణి.

రెండుమాసాలు యిలాగడిచేక 'గ్రేటా'కి టైఫాయిడ్ జ్వరం వచ్చింది. నెలాపదిహేనురోజులు మంచంపట్టి చిక్కి శల్యమైంది. ఆరోజుల్లో నేను అనుభవించిన ఆవేదన...ఏం చెప్పను!

'గ్రేటా' కి బాగా నెమ్మదించేసరికి రెండునెల్లు పూరాగా పట్టింది. నవనవలాడే ఆమెశరీరం కృశించి శల్యమైంది. పాలబుగ్గలు, ఎముకలు బైటపడ్డాయి. నీరసంతో బాధపడేది. కాని కన్నులలో సౌందర్యమూ, తేజస్సూ ఏమాత్రం తగ్గలేదు. పైగా యినుమడించాయి. ఏదేనా సమయంవొచ్చినప్పుడు ఎండిపోతోన్న పెదిములు నాలికతో తడుపుకుంటూ, కనుబొమ్మ లెత్తి నీరసంతో గ్రేటా నవ్వుతోంటే అంతనీరసంలోనూ ఆమెని అట్టే కావిలించుకోవాలని బుద్ధిపుట్టేది.

మాయింట్లో నేను గ్రేటాని వివాహంచేసుకోబోతున్నానని తెలిసింది. మాఅమ్మ సణుక్కుంది. మాచెల్లెళ్ళిద్దరూ హేళనగా నవ్వారు. 'ఆరోగిష్టిపిల్లని చేసుకుని ఏంసుఖపడతావన్నయ్యా?' అంది పెద్దది. 'అసలు గ్రేటా ఏం బాగుంటుందేం? పాలిపోయినవొళ్ళూ అదీను' అని రెండోదంది. మానాన్న లేకపోవటం, మాయింటికి పెద్దని నేనే అవటంవల్ల నావివాహం జరగడానికి వేరేఆటంకం లేదు. అప్పుడు గ్రేటా కూడా తండ్రి లేనిదే.

మావివాహం నిశ్చయమైంది. చర్చిగంటల మ్రోతలతోను, బిషప్‌గారి మంత్రాలతోనూ పెండ్లయింది.

'హనీమూన్' (Honeymoon)కి వెళ్ళాలంటే డబ్బు కావాలి. అప్పట్లో మాయిద్దరిదగ్గిరా పెళ్ళికయిన ఖర్చు గాక వేరేఒక్క షిల్లింగ్ కూడా లేదు.

'స్టాక్‌హోమ్ సిల్కు పేటర్న్ స్టోర్సు' (Stockholm Silk PatternStores) వారు వారి వ్యాపార ప్రకటనానికి ఏదోఫిలిం తీయబోతున్నామనీ, దాంట్లో నటించడానికి ఒకనటకురాలు కావాలనీ ప్రకటించారు. ఆప్రకటన గ్రేటాకి నేనే చూపించాను. అంతే. నాగొయ్యి నేనే త్రవ్వుకున్నాను.

అదృష్టమంటే అదే. మావూళ్ళో వున్న యౌవనస్త్రీలంతా ప్రయత్నించినా, 'గ్రేటా'నే యేరుకున్నారు ఆకంపెనీవారు - తక్కినవాళ్ళందరికంటే గ్రేటా అంతఅందమైంది కాకపోయినా కూడాను. వారానికి నలభైపౌనులకంతున మూడువారాలు జీతం తీసుకుని గ్రేటా ఆ ప్రకటనఫిలింలో నటించింది. ఆమెభావప్రకటనమూ, ఆమె 'పోజు'లూ (Poses) చూసి ఓ ప్రక్కగుండె తరుక్కుపోతోన్నా నేనీ ఆశ్చర్యపడ్డాను. ఇకనైనా సుఖపడదామనుకున్నాను.

ఎవరో ఒక పెద్దమనిషి గ్రేటా నటించిన ఫిలిం చూసి మా దగ్గిరకి వొచ్చి 'హాలీవుడ్డు వెళ్లితే నీకు బోలెడంత డబ్బిస్తారు. వెళ్ళగూడదూ?' అన్నాడు. గ్రేటా సంపాదించిన నూటయిరవై పౌన్లలో ౬౦ పౌనులు ఖర్చుపెట్టాము. యింకా ౬౦ పౌనులు మాత్రం వున్నాయి. అది హాలీవుడ్డు వెళ్ళేందుకు చాలదు. అప్పుచేసి డబ్బు రెండువందల పౌనులు తెచ్చి యిమ్మంది. బల్లెంపోటులా తగిలింది.

"నువ్వు హాలీవుడ్డు వెళ్తావాఏం?" అని అడిగాను. "నీ కా సంగతులన్నీ ఎందుకు ? రెండువందల పౌనులు తెచ్చియివ్వాలి." అంది.

"గ్రేటా ! నీకు మతిపోయిందా? నన్ను మోసం చేస్తావా ? ప్రాణాలన్నీ నీమీద పెట్టుకున్న నాకు ద్రోహంచేస్తావా ?" అన్నాను.

తన మృదుహస్తాల్తో నాముఖం పట్టుకుని 'స్టిల్లరూ ! నిన్ను మోసంచేస్తానా ? అందుకుగాదు. నాకు వేరేపనుంది. మళ్ళీ రెండునెల్లలో యిచ్చేస్తాను డబ్బు తెచ్చిపెట్టవూ ?" అంది. అలా నాగ్రేటా అడుగుతోంటే ఎలావూరుకోను ? గుండెల్లో గాయం రేగుతోంది. వెళ్ళి వారంరోజుల్లో అమితకష్టంతో రెండువందలపౌనులు తెచ్చాను. వాళ్ళింటికెళితే గ్రేటా లేదు. వాళ్ళన్న వున్నాడు. అతనితో సంగతంతా చెప్పి ఎలాగయినా గ్రేటా హాలీవుడ్డు వెళ్ళకుండా చెయ్యమన్నాను. పదినిమిషాలు పోయాక గ్రేటా వొచ్చింది. "గ్రేటా ! హాలీవుడ్డు వెళ్తానని రెండువందలపౌనులు తెమ్మన్నావట ...ఏం?" అని వాళ్ళన్న అడిగాడు. నావేపు చురచురా చూసింది.

వాళ్ళన్నయ్య వెళ్ళాక "నీకు మూర్ఖత్వం తప్ప యింకోటి తెలీదు. మాఅన్నయ్య కెందుకుచెప్పావు ? నీ ధవడబ్బు తీసుకెళ్ళు. పో" అంది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆస్థితిలో నాయెదుట నాగ్రేటా కంటతడిపెట్టుకుంటే వోర్చగలనా. ఆమెని ప్రార్థించాను క్షమించమని. ఆఖరికి వొప్పించి డబ్బుచేతి కిచ్చాను. విసిరిలాగింది నాచేతుల్లోంచి. ప్రాణం చివుక్కుమనదూ?

మర్నాడు రాత్రి గ్రేటా చెప్పకండా వెళ్ళిపోయింది. హాలీవుడ్డే. వూరంతా వెతికాం. ఎందుకు కనబడుతుంది ? ఎలా కనబడుతుంది ?

వూళ్ళోవాళ్ళంతా "స్టిల్లరూ ! నీ ప్రియభార్య అర్ధరాత్రి వుడాయించిదటే. వేరేఎవర్నన్నా తీసికెళ్ళిందా ?" అని అడిగేవాళ్లు. చావు మేలనిపించింది.

*　　*　　*　　*

సంవత్సరం గడిచాక గ్రేటా మళ్లీ స్వీడన్‌లో అడుగుపెట్టింది. నా కామెని చూడాలని బుద్ధిపుట్టలేం. వూరుకోగలనా. వచ్చిన్నాడురాత్రి మాయింటికి వచ్చింది. నేను యింట్లో వేరేగదిలో వుండి లేనని చెప్పించాను. మాచెల్లెల్తో "వారానికి 700 పౌనులు యిస్తారు. ఎంతసుఖంగా వుంటుందనుకున్నావు? " అని చెప్పింది. నాగుండెల్లో మంటబయలుదేరింది. ఎదురుబడి నాలుగూ అడుగుదామనుకున్నాను. "మీ అన్నయ్య ఏడీ? " అని అడిగింది. ఎంతప్రేమ వుట్టిపడింది ఆమాటలో!

మర్నాడు మాయింటిసమీపంలో వున్న డాక్టరు నాసి "స్టిల్లరూ! నీకొళ్ళంతా నెత్తురువిరిగి, పాలిపోయి నట్టుగా వుందేం!" అని అడిగాడు. నా కాళ్ళర్యాంకల గలా. పైగా సంతోషించాను యీపాడుప్రపంచంలోం చి వెళ్ళిపోతానుగదా అని. నాకూ తెలుసు నావంట్లో మనోవ్యాధి వుందని. కాని మందూ, మాకూ తీసుకోదలు చుకోలే. వారంరోజులు గడిచాక గ్రేటా నన్ను చూడ కుండానే మళ్ళా హాలీవుడ్డుకి వెళ్ళిపోయింది.

*  *  *  *

రెండోసంవత్సర పుశలవుల్లో గ్రేటా మళ్ళీవచ్చింది. వాళ్ళింట్లో నాకు జబ్బుగావుందని చెప్పారు. మహాప్రేమ వున్నదానిలా పరుగెత్తుకొచ్చింది. కాని ఆమెమొహం చూడబుద్ధిపుట్టలే. నా చెల్లెళ్లు అడ్డుకుని "అన్నయ్యాకి చాలా పెద్దజబ్బు. యిప్పుడెవరితోటే మాట్లాడడు." అన్నారు. ఎక్కి ఎక్కి ఏడుస్తోంది. నాకు గూడా గుండె చెఱువైంది. పట్టలేక "గ్రేటా- నా గ్రేటా" అనిపిలిచాను. లోపలికి పఱుగెత్తుకొచ్చింది. నా మంచం దగ్గిర పడి వలవలా ఏడ్చింది. నేనూ ఏడ్చాను. మళ్లీ తనచేతుల్లో నాముఖం పట్టుకుని "నాస్టిల్లరూ! ఎంతకృశించి పోయావు ?" అంది.

"చాలాకాలం బ్రతకను గ్రేటా! యీకొద్దికాల మేనా నాదగ్గిరుండవూ?" అని దీనంగా అడిగాను. మాట్లాడలే గ్రేటా.

*  *  *  *

ఎంతోకాలం అవలేదు. నా బ్రతుకుమీద ఆశ కూడా లేదు. మరణాన్ని ఆహ్వానించాను. నాఆహ్వానాన్ని ఒప్పుకున్నట్లే వుంది. నేచచ్చిపోతే నా గ్రేటా ఏడుస్తుందా? ఏడ్చినైతేనూ, నామీద ప్రేమవుంటేనూ యిలాచేస్తుందా ? అట్టేకాలం బ్రతకను.........

*  *  *

(పైదంతా గ్రేటాని చిన్ననాటినుంచీ ప్రేమించి, ఆమెకోసం తపించి, కృశించి శల్యమై చనిపోయిన స్టిల్లరు దినచర్యపుస్తకంలోది. ఆ పుస్తకాన్ని ఫిలింరూపంగానూ, కథారూపంగానూ పేర్లుమార్చి ఫిలిం పిక్టోరియల్ వాళ్ళు ప్రకటించారు)

యీ గ్రేటా స్వీడన్ దేశంలో స్టాక్‌హోమ్ (stock-holm) అనేచోట ౧౯౦౫ సంవత్సరం సెప్టెంబరు ౧౮ తారీఖున పుట్టింది. అసలుపేరు గ్రేటా గస్టఫెజన్. తన పదహారోఏట హాలీవుడ్డు వొచ్చింది. మొదట కొద్దిపాటి శీతంమీద 'టొరెంటు' అనేఫిలింలోనూ, మరిరెండు యితరచిత్రాల్లోనూ చెలికత్తెగా నటించింది. తరువాత 'అన్నాక్రిష్టి' అనేఫిలింలో ప్రధానభూమిక నిర్వహించింది. కాని అంతతో ఆమెప్రతిభ జనానికి బోధపడలేదు. క్వీన్ క్రిస్టీనా అనేఫిలింతో ఆమెఖ్యాతి ప్రపంచంలో వ్యాపించింది.

గ్రేటా అంతఅందమైంది కాదు. కాని భావప్రకటనలో మాత్రం ప్రపంచనటుల పోటీలో స్త్రీలలో మొదటిస్థానం గెల్చింది.

ఆమెకు ఖ్యాతిగణించిపెట్టిందల్లా ఆమెకన్నులే. ఇతరఅంగవిన్యాస మేమీ లేకుండా ఒక్కకన్నులతో ఆమె అనేకభావాలను -ముఖ్యంగా ప్రేమ, విచారము, సంతోషము, ముగ్ధత్వము మొదలయినవానిని-అద్భుతంగా ప్రకటింపగలదు. విచారం ఆమెకన్నుల్లో చూపట్టగానే ద్రష్టలహృదయాలు కరిగిపోతాయి. ప్రేమప్రకటిస్తోంటే ముగ్ధులౌతారు. సంతోషంలో పాల్గొంటారు.

ఆమెముగ్ధత్వం చూసి సిగ్గుపడతారు. సాధారణంగా 'గార్బో' నటించినఫిలించూసే ప్రతీవాడూ తన్నుతాను మరిచిపోతాడు. తక్కిననటులలో అంత చాకచక్యము, నేర్పు కనబడవు.

ఇన్నిటితోపాటు 'గ్రేటా' గుణాన్నిచూస్తే చాలాచిత్రంగానే వుంటుంది. గర్వంఒక్కటితప్పతక్కిన పాడుగుణాలు-ఓర్వలేనితనం, ఒంటెత్తుగుణం, పౌరుషం, ఈర్ష్య, కోపం, యిలాటివన్నీ 'గ్రేటా' లో తరుచుకనబడుతోంటాయి.

చిన్నప్పుడు పల్లెటూళ్లో పుట్టిపెరగడంచేత ఇప్పటికీ కొండల్లోనూ, గుట్టల్లోనూ, అడవుల్లోనూ తిరగడం అంటే గ్రేటాకు యిష్టం.

పసిపిల్లలంటే ఆమెకి ఒకవిధమైన అసహ్యంతో కూడుకున్న భయం. ఓసారి ఆమెతోపాటు 'అన్నా

కరేనినా' అనేఫిలింలో ఆమెకుమారుడుగా నటించిన 'ఫ్రెడ్డీ బార్తలోమ్యూ' అనేఎనిమిదేండ్లబాలుడు ఆమె వేషంతోకూర్చున్నప్పుడు వెళ్లి 'మమ్మీ' అనిపిలిచాట్ట. ఆమె అసహ్యించుకుని "మూర్ఖుడిలాప్రవర్తించకు" అందిట. తరవాత ఫిలింతీస్తుంటే "బిడ్డా, నాబిడ్డా" అని కావులించుకుందట ప్రేమపుట్టిపడేట్టు.

ఓసారి 'వాల్లెస్‌ఫోర్డు' అనేఆయన తన నాలుగేళ్లపిల్లాణ్ణి స్టూడియోకి తీసికెళ్ళాట్ట. ఆయన తనపనిలోవుండగా వాళ్ళొచ్చాయి, ఎక్కడికో వెళ్ళిపోయాట్ట. ఆదుర్దాతోఆయనవెదకగా ఆపిల్లాడు 'గ్రేటా' తొడమీద కూర్చునివున్నాట్ట. ఆమె అతనికి ఏపిల్‌పండు కోసి ఆప్యాయంగా తినిపిస్తోందిట... కొందరిఅదృష్టం.

మనిస్తుతికూడ 'గ్రేటా'కి కిట్టదు. ఓసారి 'క్వీన్ క్రిస్టినా' అనే తానునటించినఫిల్మ్ చూడ్డానికి వెళ్లింది. హాల్లో తనవెనకాల యిద్దరు ఆడపిల్లలు కూర్చుని యీమెని చూసి "యీమే గార్బో" అని గుసగుసలాడుకుంటున్నారు. 'గ్రేటా' వాళ్ల కాఫీ పూట అయినఖర్చు తానిచ్చి వాళ్ళని "మళ్ళీ రేపువచ్చి చూడండి" అనిబ్రతిమాలిపంపించిందిట- ...అదో పిచ్చి.

గోమన్ నోవారో ఓసారి ఆమెని 'మేకప్'లో వుండగా మాట్టాలని వెళ్లి కబురంపాట్ట. "యిప్పుడు కథకిసంబంధించనివాళ్ళని ఎవర్నైనా లోపలికి రానిస్తే నేను నటించను." అని డైరెక్టరుతో కచ్చితంగా చెప్పింది. నోవారో చిన్నబుచ్చుకొని వెళ్లిపోయాట్ట. ......అదో స్వభావం.

స్థిరంగా ఒకయింట్లో కాపురం ఒకనెలకిపైన హాలీవుడ్డులో 'గ్రేటా' చెయ్యలేదు....అస్వభావం అతిచంచలం.

ఆమెనిగురించి ఓఫోటోగ్రాఫరు చెప్తూ "ఫోటో తీయడానికి 'గ్రేటా'లా సరిపొయ్యేమనిషిని నే చూళ్ళేదు. ఏపోజులోనైనా, ఏ ఏంగిల్సులోనైనా రాత్రిగాని పగలుగాని, వెలుతుర్లోగాని చీకట్లోకాని గార్బోని ఫోటోతీయడానికి వీలుంది. అలాంటిమనిషి చాలాఆశ్చర్యకరమే...యింకోళ్లుండటం".

అమెరికాలో ఆమెపేరుతో 'ఫాన్'క్లబ్బులు (Fan clubs) వున్నాయి. యీమధ్యవల ఒకసభ్యుడు 'గార్బో'కి వజ్రాలు కెంపులు పొదివిన పిడిగల కైజారొకటి హాలీవుడ్డు పంపించాడు. దాన్ని చూసి హాలీవుడ్డు జనం గుసగుసలాడారు.

ఆమెని అభినందిస్తూ దేశదేశాలనుంచి ౨౬ లక్షల జాబులు సంవత్సరానికి వస్తాయి. కాని యిలాంటివంటే ఆమెకువిసుగు.

గ్రేటా యిప్పటికి ౬ మూవీల్లోనూ (Movies), ౧౦ టాకీల్లోనూ నటించింది. కాని ప్రజాభిప్రాయాన్ని పొందినవి యీమధ్యవలవెలువడ్డ 'మాతాహరి', 'అన్నాక్రిస్టి', 'గ్రేండ్ హోటల్', 'క్వీన్ క్రిస్టినా', 'అన్నాకరేనినా'లు, ప్రస్తుతం 'కామిల్లి' అనేచిత్రంలో నటిస్తోంది.

గ్రేటాకి వారానికి ౬౦,౦౦౦పౌనులు జీతం యిప్పుడు.

ఇతరనటకురాండ్రలాగా 'గ్రేటా' కామోద్రేకంగలదికాదు. చాలావఱకు యింద్రియాలను నిగ్రహించింది. నిరాడంబరజీవి. దానధర్మాలు చేస్తుంది. తల్లిదండ్రులవల్ల నిరసించబడినప్రేమజీవులకు తనగూట్లో స్థానమిస్తుంది.

# పాపఫలం

## కప్పగంతుల సత్యనారాయణ

౧

పది సంవత్సరాలకు పూర్వము భార్య చనిపోయి నప్పటినుంచీ చిదంబరశాస్త్రి తన కొడుకు శంకరయ్యని యెంతో జాగ్రత్తగా, అల్లారుముద్దుగా పెంచుతూ వచ్చాడు. శారదాబిల్లు హడావిడిలో యెనిమిదేండ్లకూన నొకదానిని చూసి, కొడుక్కి ముడిపెట్టి, తరతరాలనుంచీ సనాతన సాంప్రదాయాన్ని కాపాడుకుంటూవచ్చిన వంశప్రతిష్ఠని నిలబెట్టుకున్నానని సంతోషించాడు. ప్రపంచములో తండ్రులందరిలాగే తన కొడుకు తనకన్న గొప్పవాడు కావాలని తన చదువంతా కొడుక్కి ధారపోశాడు. కోడలు రాజమ్మ సమర్తాడిన కబురు తెలిసి తన కొడుకు వొక యింటివాడయినాడు గదా అని పొంగిపోయినాడు. గర్భాధానానికి మంచి ముహూర్తంకోసం యెదురుచూస్తూండగానే కలరావచ్చి పంథొమ్మిదేండ్ల శంకరయ్యా మట్టిపాలయిపోయాడు.

దానితో చిదంబరశాస్త్రి నిలువునా కూలిపోయాడు. నాలుగు నెలలదాకా ప్రపంచముమొహం చూడటానికి అతనికి మనస్కరించలేదు. తరువాత ప్రజలలో పడినా, కళా కాంతీ అతనికి రాలేదు. నలుగురితో కలిసి సంతోషంగా మాట్లాడటానికి అతనికి మనస్కరించలేదు. ఉబ్బెత్తుగావున్న ఎదురు రొమ్మూ, మెలికలు దిరిగిన దండలూ, నిగనిగలాడే శరీరచ్ఛాయా, అన్నీ మారిపోయిశాస్త్రి శరీరము చాలా కృశించింది. రోజులు మాత్రం గడిచిపోతున్నాయి.

చిదంబరశాస్త్రిని యిప్పుడు వేధిస్తూవున్న సమస్యయేమిటి!

తన ముప్ఫయ్యోయేటనే భార్య చనిపోగానే, రాజమ్మని తనకే యిస్తామనివచ్చారు. కాని, కుర్రవాడు పాడైపోతాడని, ఆవొక్క నలుసునూ జాగ్రత్తగా పెంచుకుంటే, తనవంశానికి అంతే చాలునని చెప్పి, తను పెళ్లిచేసుకోవడం మానివేసి, ఆరాజమ్మనే తనకొడుక్కి యిచ్చి పెళ్లిచేశాడు. కుర్రాణ్ణి వొయింటివాణ్ణి చేసేటప్పటికి వాడుకాస్తా 'హరీ' అన్నాడు. కోడలా పదిహేనేళ్లపిల్ల. ఆస్తిచూద్దామా, దమ్మిడీ సంపాదించలేని పదితరాలవాళ్లు తినతగింది. ఈఆస్తిఅంతా యేంగానూ! పైనపడుతూన్న వృద్ధాప్యములో తనను సంరక్షించే వాళ్లు ఎవరూ? ఈఆలోచనలమధ్యపడి శాస్త్రిమనసు నలిగిపోతోంది. అన్నమువండుకొని తినడము ప్రాణాంతకముగా వున్నది. జీవితానికి అవధియెప్పుడా, ఎలాగా అని ఆలోచనలోపడి మనిషి సగమైపోతూడు. విరక్తి కలిగి కొడుకు చదువుకున్న పుస్తకాలన్నీ వాళ్లకీ వీళ్లకీ పంచిపెట్టేశాడు. చచ్చిపోతే తనను దహనంచేసేవాళ్లు కూడా యెవరూ కనపడలేదు. కొడుకు పోయినప్పటి నుంచీ చిదంబరశాస్త్రికి యిదే విచారము.

శాస్త్రి సాధారణముగా యిల్లువదలి వెళ్లేవాడు కాదు. ఎప్పుడైనా వెడితే కామప్పసోమయాజులుగారి యింటికి వెళ్లేవాడు.

ఓరోజున కామప్ప సోమయాజులు అన్నాడు 'చూడు, చిదంబరం! ఆకోడలుకుర్రదాన్ని తీసుకొచ్చి, దానిపేరట యేకుర్రాణ్ణిఅయినా దత్తతచేసుకో' అని. 'ఆఁ......' అని మళ్లీ చెప్పమన్నట్టుగా దీర్ఘంతీశాడు శాస్త్రి.

'నీకూ దక్షుతయెవరూ లేరు. పరువూ, ప్రతిష్ఠా కలిగి బ్రతికినందుకు నీవంశంనిలబెట్టుకొనే వుపాయం చూడాలి. నీకోడలైనా బుద్ధిమంతురాలూ, జాగ్రతగల మనిషీ అనేవింటున్నాము కాని మరోలాగకాదుగదా! కనక, ఆపిల్లదాన్ని తీసుకొచ్చి, నువ్వు దానిపేర యెవణ్ణయినా దత్తతచేసుకో; పెద్దముండాకొడుకుని, నేను యేదిచెప్పినా, నీమేలుకోసమే చెపుతానుగాని—'

'ఏమిటిలే మామయ్యా, చెట్టులాంటికొడుకు మట్టి పాలయిపోయాడు. ఇంక యితర్ల పిల్లాడు నన్ను నిర్వాహకంచేసి కడతేరుస్తాడా? అయిపోయింది; నాజన్మ యెందుకూ పనికి రాలేదు' అని కళ్ళనీరు నించాడు చిదంబరశాస్త్రి.

'నువ్వు బాధపడనక్కరలేదు. నీతోనే, కోడలి తోటే అంతుకుపోయే పుత్రానుపౌకడు నాదృష్టిలో వున్నాడు. నా రెండో కూతురి మూడో కొడుకు మధుసూదనం—'

'వాడు తెలివిగల పుత్రాడే!'

'అఖండమైన తెలివితేటలు గలవాడు; అంతుకుపోయేవాడు కూడాను. ఎలాగైనా మా అమ్మాయి వొప్పుకోవాలి. అది నాచేతుల్లో పని. నీవు యిష్టపడితే ఎలాగో అలా దానిచేత వొప్పిస్తాను. అయితే, నువ్వే దత్తత చేసుకుంటే కోడలికి వేరే భరణముయివ్వడమూ, దానికోసము పోట్లాటలూ రావొచ్చును కనక, కోడల్ని మెల్లిగా తీసుకొచ్చి యిక్కడనే వుణ్ణిచ్చుకొని, దాని పేర దత్తతచేసుకుంటే, నీ వంశమూ నిలుస్తుంది; ఆస్తికి పోట్లాటలూ వుండవు. నీ ఆస్తి ఎలాగా నీ అనంతరము నీ కోడలిదే. దాని అన్నదమ్ములాళ్లు, దాన్ని మంచి చేసుకొని, ఆ ఆస్తికాస్తా కాజేస్తారు ఇటు వంశమూ పేరులేకుండా పోతుంది. అందుచేత ఎలాగయినా దత్తు చేసికోవడము ఉత్తమమయిన కార్యము...'

చిదంబరశాస్త్రి యింతదూరము యెప్పుడూ ఆలోచించలేదు. నిజంగా కామప్ప సోమయాజులి మన మణ్ణే దత్తుయిచ్చినట్లయితే, అది కోరతగినదే. అన్నిటి కన్నా తనకు యిష్టములేని విషయము, తన ఆస్తి కోడలి పుట్టింటివారికి చెందడము.

"అయితే కోడల్ని యిక్కడ వుంచడానికి వాళ్లు వొప్పుకుంటారుటయ్యా?"

వొప్పుకోక యేంచేస్తారయ్యా. వాళ్లకే తిండానికి లేక మాడుతూంటేనూ! ఎలా వొదుల్తుందిరా అని వాళ్లే చూస్తూ వుంటారు.'

'.....................'

'ఇంకా జుట్టు తీయించలేదుటలే. అయినా ఫరవాలేదు. చిన్నకుంక అని వుంచేశారేమో. యేరామేశ్వరయాత్రలో చేయించి, దత్తత నాటికి మనమే తీయించివేతాం'

'సరేగాని మామా, ఈవిషయం ఫైసలు చెయ్యవలసిన బాధ్యత నీదీ. ఎలాగో నువ్వే సరిపడచెయ్యాలి' అని చిదంబరశాస్త్రి కామప్ప సోమయాజులి సహాయాన్ని కోరాడు

౨

కామప్పసోమయాజులు వేసినబీజం శాస్త్రిమనసులో బాగా నాటుకుంది. తనకు వండిపెట్టేవాళ్లు యెవరూ లేకపోవడమూ, తనఆస్తిని యెవరికో చెందజేసి తనవంశము నిలబెట్టుకోవాలనే కోరికా శాస్త్రిని యీ ఆలోచనకి పూర్తిగా వశపరిచాయి. సోమయాజులు చెప్పిన ఆలోచనకూడా సమంజసముగానే తోచింది శాస్త్రికి. ఆపుత్రులనుకున్న నలుగురైదుగుర్ని సంప్రదించి చూశాడు. వాళ్లుకూడా బాగానేవున్నారు అలాఅయితే అది తప్పక చెయ్యవలసినపనే అనుకున్నాడు చిదంబరశాస్త్రి. వియ్యాలవారియింటికి సోమయాజులినే పంపించాడు. సోమయాజులు గొప్ప వ్యవహర్త కాకపోయినా లౌకికుడే. వాళ్ళకు చెప్పవలసిన రీతిగా వాళ్లకుచెప్పి, వాళ్లచేతకూడా వొప్పించాడు. తనమనమణ్ణి దత్తుచేసుకోవడానికి చిదంబరశాస్త్రి వొప్పుకున్నాడనిమాత్రం వాళ్లతో చెప్పలేదు. శాస్త్రిఆస్తిని యెలాకాజేదామాఅని ఆలోచనలోపడి కొట్టుకుంటూన్న వాళ్ళకి యిది మంచి అవకాశంగా తోచింది. రాజమ్మని పిలిచి అడిగారు. రాజమ్మ తెలివిగలది. బడిచదువు అయిదోక్లాసుదాకానే అయినా, పెద్దన్నయ్య అప్పుడప్పుడు తెచ్చేనవలలూ, పత్రికలూ చదివేది. కొంచెము పరిస్థితులు అవగాహనచేసుకోగల వ్యక్తి. ఆలోచించుకొని మామగారియింటికి వెళ్లడానికి వొప్పుకుంది.

క్రొత్తగావెళ్లి ఒక్కతేవుండలేదని రాజమ్మతోటి తల్లికూడా వెళ్లి నాలుగునెలలపాటు అక్కడ

మకాంవేసి, సంసారంయేలాదిద్దుకోవాలో, ఇరుగుపొరుగువారితో యెలామెలగాలో బోధించి వెళ్లిపోయింది.

మామగారు మాటే ఆదరణ రాజమ్మకి 'చల్లగా' వుంది. ఆయిల్లూ వాకిలీ తనదనేభావం కలిగింది. ఆభావముతోటె యింటి విషయములంటే జాగ్రతా పొందికా అమరాయి. కొన్నాళ్లు గడిచినతరువాత తనకు మామగారూ, మామగారికి తనూ దిక్కయామనుకుంది. మామగారిసుఖం చూడవలసిన బాధ్యత తనదనుకుంది.

ఆరేడునెలలు జరిగాయి. చిదంబరశాస్త్రికి చలిజ్వరమువచ్చి చచ్చేటంతచేసింది. శాస్త్రి ప్రక్కన కూర్చుంటె రాజమ్మ కన్నీరుధారగాయేడ్చింది. తనమీద ఆమెకువున్న అనురాగానికి శాస్త్రి పొంగిపోయాడు. 'ఏడవకు రాజమ్మా' అని వీపునిమిరాడు. ఆమెవొళ్లు జలదరించింది. అతడు సుహృదానందం పొందాడు. రాజమ్మ సిగ్గుతో తలవొంచుకుంది. కానేపు అక్కడే కూచుని మెల్లిగా వెళ్లిపోయింది.

చిదంబరశాస్త్రికి ఆరోగ్యముకలిగింది. రాజమ్మ చేసినపరిచర్య నిరుపమానమైనది. ముప్పయ్యేళ్లయేట యెలావున్నాడో అలాగతయారయాడు. కండలు మెలిదిరిగాయి. ఎదురురొమ్ము నునుపెక్కింది. వొళ్ళంతా కాంతిమంతమయింది.

శాస్త్రినిచూచి రాజమ్మ 'పెద్దయితే యిలాగే ఉండేవారు' అని తనభర్తను తలుచుకొనేది. ఆమెకు సాటికుటుంబాలన్నిటిలోనూవున్న జీవకళ తనయింట్లోలేదనేభావం తోచింది. అన్ని సౌఖ్యాలూ అందరియిళ్లలోలాగా సామాన్యముగానే వున్నా ఏదోలేదనుకుంటుంది. అదేమిటో ఆమెకి అవగతంకాదు. తనవిధి మేరకు తను ప్రవర్తిస్తూన్న సంగతి రాజమ్మకితెలుసును. కాని యేదో లోపము-భావాతీతమైనది, తన జీవిత సుఖసర్వస్వానికి చెందినది - యేదో ఆమె అనుభవిస్తూవుంది.

ఆరోజున ఆమె తలంటిపోసుకున్నది. విడివిడిగా గాలికి యెగురుతూ పట్టుకుచ్చులాగ ఆమె తలవెంట్రుకలు ఆమెబంగారములాటి మొహానికి శోభనిచ్చాయి. ఆమెకు ఆరోజు అర్థముకాని సంతోషమూ, ఉత్సాహమూ వచ్చాయి ఆమెకే తెలియలేదు వాటి కారణము.

పెరట్లో మంచాలువేసికొని పడుకున్నారు. మామూలుప్రకారము యిద్దరిమంచాలు నాలుగు గజాల దూరములో వేసింది రాజమ్మ. తను అన్నముదిని, ఇల్లు సర్దుకొని మంచాలదగ్గరకు వచ్చింది. చిదంబరశాస్త్రి నిద్రపోతున్నాడు. ఆకాశమూ, భూమీకూడా 'చల్లని తెలుపు'తో కప్పవేసిన చంద్రుడు చిదంబరశాస్త్రి శరీరచ్ఛాయను మనోహరంగా చేశాడు. రాజమ్మకి యేమితోచిందో-శాస్త్రివైపు అలాగే నాలుగైదు నిమిషాలు చూసింది. ఒక్కనిట్టూర్పు - నిరాశాపూరితమైన నిట్టూర్పు. ఆమె తన పక్కమీద పడుకుంది.

మళ్లీ మెలుకువ వచ్చింది ఆమెకు. కళ్లు తెరిచి చూసింది ఆమె. వెన్నెలలో రెండో చందమామలాగ కాంతిమంతంగావున్న తనమొహంకేసి చిదంబరశాస్త్రి శాంతంగా చూస్తున్నాడు. నిద్రలో చెదిరిపోయిన పైట సవరించుకుంది ఆమె. ఒకరికళ్లల్లోకి వొకరుచూసుకున్నారు. ప్రకృతి గంభీరమైన ప్రశాంతిని నెలకొల్పింది. చిదంబరశాస్త్రి ఆమెప్రక్కన కూచున్నాడు. ఆమె యేదో చెప్పబోయింది. ఆమె చెప్పదలచినమాట గొంతులోనే వుండిపోయింది.

## 3

తెల్లవారింది. రోజులు తిన్నగా గడిచిపోతున్నాయి. ఘోరమయిన పాపంచేశానని మనస్సులో కుంగిపోతూ ఉండేవాడు చిదంబరశాస్త్రిమాత్రం.

దత్తుసంగతి కామప్ప సోమయాజులు హెచ్చరించినా, చిదంబరశాస్త్రి 'కోడలికి సంసారముమీద కొంచెము శ్రద్ధకలగనీ మామా, అలాగే చేసుకుంటానూ; నీకంటె నాకు అప్తులు లేరుగదా. ఇహ నువ్వు చెప్పిన మాట తీసివేస్తానా. అందులోనూ, మీదీ మాదీ స్వచ్ఛమైన వంశాలు. కొంచెం నిభాయించుకొని అలాగే చేద్దాము.' అనేవాడు. కోడల్నికూడా రెండు మూడు

సార్లు ఆమె అభిప్రాయాన్ని గురించి అడిగాడు. 'ఇప్పుడేం తొందర లెండి; తరువాత చూసుకుందాము' అంది రాజమ్మ.

ఇప్పుడు రాజమ్మ యెంత చెపితే చిదంబరశాస్త్రి అంత. స్వతహాగా తెలివిగలది కావడముచేత రాజమ్మ సంసారపు దిద్దుబాట్లు బాగా తెలుసుకుంది. వయసులోవున్నా, అందముగావున్నా, శీలాన్ని జాగ్రత్తగా కాపాడుకుంటూనేవుంది. కేవలం మానసికో ద్రేకానికి శాస్త్రికి ఆలాలోపలపోవడం ఆమెకీ అమితమైన విచారాన్ని కలుగజేసింది. జరిగిన సంగతికి పశ్చాత్తాపపడి యిద్దరూ దూరదూరముగా వుంటున్నారు.

రాజమ్మకి రెండు నెలలు వరుసగా తప్పాయి. కొంచెం కంగారుపడింది. కడుపులో త్రిప్పడమూ, డోకులూ ఆరంభించాయి. అనుమానము స్థిరపడేటప్పటికీ, అవి నెవిళ్లని నిర్ధారణచేసుకునేటప్పటికీ మూడో నెలకూడా వెళ్లిపోయింది. ఏమిటి చెయ్యడము! ఆమెకి యేమీ తోచలేదు.

చిదంబరశాస్త్రికికూడా సంగతి బోధపడిపోయింది. అతని ప్రాణాలు నిలువునా పోయాయి. ఆ వూళ్లో యింక తన పరువు దక్కదు. 'భగవంతుడా, ఏందారి' అని ఆలోచనలో పడిపోయాడు.

రెండోకంటివాడికి తెలిసిందా, యీ భూమిమీద తలెత్తుకొని తిరగడానికి ఆస్కారములేదు. కాకులుపొడిచినట్టు పొడుస్తారు. కర్తవ్యమేమీ బోధపడలేదు అతనికి. రాబోయే అప్రతిష్ఠను పోగొట్టుకోవడమెలాగ? పరానికి చెడ్డాడు సరిగదా, ఇహంకూడా చెడిపోయేటట్టుగావుందే! పరముమాట దేవుడెరుగును, బంధువులెవరూ దగ్గరికిచేరనియ్యరు. తన బ్రాహ్మణీకమూ, ప్రతినిధిమూ తను కాపాడుకుంటూ వచ్చిన శీలమూ మంటగలిసిపోయింది.

ఇదివరకుయెప్పుడూ రాజమ్మకి యెదురుగానూర్చునేవాడు, యిప్పుడు యింట్లోనే వుండలేకపోయాడు. బయటికి పోలేకపోయాడు. అమిత మనోవేదన పడుతున్నాడు. వీథిలో నడుస్తూవుంటే దారిని పోయే ప్రతివాడూ తనను పరిహాసిస్తూవున్నట్టూ, తననుగురించి గుసగుసలాడుకుంటూన్నట్టూ కనిపించేది.

'రాజ్యం!' అన్నాడు చిదంబరశాస్త్రి.

'ఊఁ........' అని వొంచిన తలయెత్తి అతనికేసి చూసింది రాజమ్మ.

'ఏం చేద్దామిప్పుడు? నాకేమీ దారితోచడములేదు. నలుగురిలోనూ తలయెత్తుకొని తిరగలేము. ఎలాగ చెప్పు.'

'.................'

'ఈవూళ్లో గవళ్లకోటమ్మఉంది చూడూ, దాన్ని యెరుగుదువా?'

'అమ్మయ్యో—' అంది రాజమ్మ గవళ్ల కోటమ్మ పేరుచెవిని పడేటప్పటికి.

'భయపడకు. కొంచెం బాధగానే వుంటుంది కాని, అప్రతిష్ఠ రాకుండా చేసుకోడానికి అలా చెయ్యాలి.'

'నేను వొప్పుకోను సుమండీ'

'ఏం! లేకపోతే కొంప మునిగిపోతుంది.'

'ఏమయినా సరే! నేనొప్పుకోను.'

నిర్ఘాంతపోయాడు చిదంబరశాస్త్రి.

'కొంపముంచావే. ఇలా చేస్తావా చివరికి?... .........ఏంచెయ్యమంటావు చెప్పమరి. ఇది బయటపడితే మనము యీవూళ్లో-యీవూరేకాదు యీచుట్టుప్రక్కల వుండలేము.'

'పోనీ పోదాంపదండి, యెక్కడికైనా.'

'ఎక్కడికి పోతాంచెప్పు. ఇల్లూ వాకిలీ వొదిలిపెట్టి, యింకోచోటికి పోయి, యేంచేస్తాం?'

'మరి యేదోదారి చూడాలి.'

'ఏందారి, గోదారి'

'మావూళ్లో-వెనకా-'

'ఆఁ..........'

'ఓ కాపురమూఁడురు వెధవది, యిలాగే చిక్కులో పడింది. అతను పోతుబరి. అతడేంచేశాడో తెలుసునా? ఏదో జబ్బుచేసిందని పేరుపెట్టి దాన్ని చెన్నాపట్టం తీసుకుపోయాడు.'

'అబ్బా!'

'ఊఁ. అక్కడే, యే ఆసుపత్రిలోనో నీళ్లాడింది. ఆపిల్లని యెవరో కిరస్తానీమతంచెప్పే దొరలకిచ్చేసిందట. వాళ్లు పెంచుకుంటున్నారు. ఎప్పుడేనా వెళ్ళి యిప్పటికీ చూసివస్తుంది.'

'అలా చేద్దామంటావా?'

'అవును. అలాగే చేయాలి.'

ఆమెమాటమీద చిదంబరశాస్త్రికి ఆలోచనకలిగింది. అంతకన్న గత్యంతరములేదు. కాని అతని మనసులో భయంమాత్రం పోలేదు.

౮

రాజమ్మమాట రాజశాసనంగా వొప్పుకున్నాడు శాస్త్రి. కాశీరామేశ్వరాలికి యాత్రపోదా మనుకుంటున్నా నని నలుగురైదుగురితోటి చెప్పాడు. వాళ్లకి ఆ ఆచోట్లనుంచి కావలసినవస్తువులు తెచ్చిపెట్టమని అతన్నికోరారు. తప్పకుండా తెస్తానన్నాడు. కర్ర నేలనుకొట్టుకుంటూ, కామప్ప సోమయాజులు వచ్చి 'తీర్థయాత్రకి పోతున్నావా, శాస్తుర్లూ' అన్నాడు.

'అవును మామా, ఒక్కసారి అలావెళ్ళి ఆనాలుగు క్షేత్రాలూ చూచుకొని వచ్చేస్తే నాకింక తరవాయి వుండదు' అన్నాడు శాస్త్రి.

'అయితే దత్తుచేసుకొనివె'గూడదూ, వాణ్ణి కూడా వెంటబెట్టుకొనీ? ఎందుకైనా అక్కరకు వస్తాడు.'

'కాదులే మామా, యీశాదరబందీలోకుదరదు. కుర్రాడుగూడా చిన్నవాడుగదా, మరీతెలియనివాడూ కాదు, బాగాతెలిసినవాడూకాదు. దత్తుయెలాగా ఉపనయనంలో జరగవలసిందే కనుక తొందరేమిటిలే' అన్నాడు చిదంబరశాస్త్రి.

'అహాఁ. సరే. నాలుగునెలలు పడుతుందాఏమిటి?'

'ఆఁ. ఆరునెల్లు, యేడునెల్లు తిరిగివస్తాను. ఇంక నాజీవితానికి యిదే కొసనసారిగా; కోడల్నికూడా తీసికెళ్ళి నాలుగూ చూపించేస్తా. కొత్త యిల్లూ వాకిలీ కనిపెట్టి వుండండేం.'

'దానికేమిటిలే. కోడలికి జుట్టుకూడా తీయించి వేస్తావా యేమిటి?'

'అనుకుంటున్నాను.'

'ఊఁ' అంటూ తనపన్నుగడ యింకా నెరవేరకపోయినందుకు విచారిస్తూ వెళ్ళిపోయాడు కామప్ప సోమయాజులు.

చిదంబరశాస్త్రి, రాజమ్మ రెండెడ్లబండీ కట్టించుకొని, పదిమైళ్లదూరంలోవున్న రైలుస్టేషనుకి వెళ్లి, చెన్నపట్నం టిక్కెట్టుతీసుకున్నారు.

౯

శాస్త్రి అదివరకోసారి చెన్నపట్నంవెళ్లినవాడే. కనుక కొంచెం తేలికగానే ఆసుపత్రికి దారి కనుక్కొని, అక్కడికి వెళ్ళారు. వాళ్లు పరీక్షచేసి నాలుగోనెలఅనీ,తొమ్మిదోనెలలోవస్తే కాన్పుచేస్తామనీ చెప్పారు. ట్రిప్లికేనులో మారుమూల ఒకయిల్లు అద్దెకు తీసుకొని కాపురమున్నారు శాస్త్రీ రాజమ్మాను.

చిదంబరశాస్త్రి రాజమ్మని తొమ్మిదోనెల రాగానే ఆసుపత్రిలో చేర్పించాడు. హాయిగా ప్రసవించింది. ప్రక్కనున్న బిడ్డనిచూసుకొని పొంగిపోయింది. చిదంబరశాస్త్రికూడా బిడ్డనిచూసి మనసు కరిగిందికాని ప్రపంచాన్నితలచుకొని హడలిపోయాడు.

ఆపిల్లాడిని చూసి చిదంబరశాస్త్రీ, రాజమ్మా ఒకర్నివొకరు చూసుకొని తెల్లబోతూవుండేవారు.

అనలేక తెగించి, ధైర్యముతెచ్చుకొని, ఒకరోజున, 'రాజ్యం, యీబిడ్డని యేంచేస్తాం? దొరల—' అన్నాడు శాస్త్రి.

బిడ్డకేసి చూస్తూవున్న రాజమ్మ 'ఏమిటే, యీ రత్నంలాంటి బిడ్డనా, కిరస్తానీల కివ్వడమా?' అని కంట తడిపెట్టుకుంది.

'మరేలాగ?' అని దీనంగా, అడిగాడు చిదంబరశాస్త్రి.

'ఎలాగైనా సరే, ఈబిడ్డని వొదిలి నేను బ్రతక లేను. చూడండి, లక్కపిడతలాంటి నోరూ, నీలాల లాంటికళ్లూ,-అబ్బా-ఈబిడ్డని చూసిచూసి మాలవాళ్ళకి యెలా యిస్తామండీ. వొద్దు'

'ఏం చెస్తాం చెప్పు. ఈబిడ్డని తీసుకొని మన వూరు వెళ్లగలమా?'

'ఇక్కడే వుండిపోదాం, అలా అయితేనూ'

'ఇల్లూ వాకిలీ, భూములూ పుట్రా చూసుకోకుండానా?'

'మీ ఆస్తీ భూములూ యీపిల్లాడి ముందర యెందుకు పనికొస్తాయండీ. చూడండి'

పిల్లాడికేసిచూసి శాస్త్రి నిలువునా కంపించి పోయాడు.

'ఏం చెయ్యను. పిల్లాడంటె నాకు మాత్రం లేకనా?'

'మరయితే, ఎలా పారేసుకుంటామండీ, యీ పిల్లాణ్ణి?'

'ఏం చేస్తాం చెప్పు?'

'నేనోటి చెపుతాను, వొప్పుకుంటారా?'

'ఏమిటది?'

'వీడు పెద్దవాడయినదాకా యిక్కడేవుందాము, నాలుగేళ్లు అప్పుడు వీణ్ణితీసికెళ్ళి 'పెత్తుచేసికొన్నాము. కాశీలో వున్న మావాళ్లపిల్లాడు' అలాగని చెపుదాము. ఆస్తి అంతా వీడికె చెందుతుంది. అంతే కాని, యిలాంటి రత్నాన్ని యెలా పారేస్తామండి? కడుపున పుట్టినబిడ్డని యెవళ్లో మాలాళ్లకి పారేసి, యింకోళ్ల బిడ్డణ్ణి తెచ్చుకొని పెంచుదామా?'

'తెలియదులే వూరివాళ్లకి?'

'వాళ్ళ శ్రాద్ధం. మరో రెండు నెలలు యిక్కడ వుండి, తరువాత క్షేత్రాలన్నీ చూడటానికి పోదాం. ఒక్కొకచోట నాలుగేసి నెలలుంటే సరి. ప్రతి క్షేత్రంనుంచీ మనవూరి కొక ఉత్తరం రాద్దాము యే సోమయాజులి పేరనో. మీకూ నాకూ అయినవాళ్లు ఆవూళ్లో లేనే లేరు కదా. నిజంగా మనం తీర్థయాత్ర చేస్తున్నామని వాళ్లు అనుకుంటారు. నిర్భయం మనకి.'

'ఆఁ.........'

శాస్త్రి ఆశ్చర్యపోయాడు రాజమ్మ తెలివికీ, ఆలోచనకీను. తప్పనిసరికనుక వొప్పుకున్నాడు.

అనుకున్నప్రకారం వాళ్లు క్షేత్రాలన్నీ తిరిగి నాలుగు సంవత్సరాలకి యిల్లుచేరుకున్నారు.

'ఆపిల్లవాడెవరోయి' అన్నాడు కామప్పసోమయాజులు.

ముందుకీ వెనక్కీకంపించిపోయాడు చిదంబర శాస్త్రి. 'వీడా, మాఅమ్మమ్మ తమ్ముడికొడుకు, కాశీలోవున్నాడులే, వాడికొడుకు కోడలూ గనూ ఆరునెలలపాటు వాళ్ళింట్లోనేవున్నాము కాశీలోవున్నప్పుడు. వీడు దానికి అలవాటయినాడు. కోడలు వీడిమీద మోజుపడింది. నాళ్లుకూడా అయినవాళ్లు. అందుచేత విశ్వేశ్వరుడిపురంలో ఆకాస్తాదత్తస్వీకారం అనిపించేను దానిచేత.

'ఆరి, ఎంతవాడివోయ్! అయిందీ!'

'ఏంచెయ్యను మామా కోడలు ఒకటే పట్టు పట్టింది. నాకుతప్పిందికాదు'

'జుట్టు తీయించేశావుకాదేమి?'

'తీరా తిరపతికి వెళ్లేటప్పటికి దానికి జ్వరం తగిలింది. ఆవూరు వొదిలిందాకా జ్వరం తీసిందికాదు. అచ్చి రాలేదని మానేశాను'

'నిజా—అచ్చం కోడలులాగే వున్నాడు?'

'నాడి తల్లి సరిగ్గా కోడలులాగా వుంటుంది. తల్లిపోలిక వీడు.'

'వూహూఁ.........'

వూళ్లోవారంతా దత్తపుత్రుడిమీద రాజమ్మకి అమితప్రేమ అని అనుకొనేవారు.

'ఈ రత్నం నాభాగ్య' మనుకొనేది రాజమ్మ.

'నా పాపఫలము వీడు' అనుకొనేవాడు చిదంబరశాస్త్రి.

# వసంతము

## అద్దేపల్లి నాగగోపాలరావు

'రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్' —రసగంగాధరము

వసంతము శ్రీ పెమ్మరాజు లక్ష్మీపతిగారు రచించిన కావ్యము. 'లలితవసంతగీతికా సద్మృశమగు ఆత్మజీవితముచే లోకమును మాధురీభరితమొనరించు నీకవిసోదరుని రసహృదయ మీకావ్యసూనములమున ఆంధ్రలోకమున కొకింత వ్యక్తమగుగాగలదు' అను మంగిపూడి శర్మగారి మాట లెంతయు సత్యములు.

'క్రొత్తపాతల మేలుకలయిక క్రొమ్మెఱుంగులు చిమ్మఁగా' అనిత్యముతో నారంభించిన కావ్యము ఐక్యసిద్ధిగల అనంతలీలతో పరిసమాప్తి చెందుచున్నది.

దయ సేయుము మావసంతా! వినూతనపల్ల
　　వారుణంబైన దేహంబు మెఱయ
రావయ్య మాఋతురాజ! రాజితపుష్ప
　　మయకిరీటద్యుతుల్ మలసి యాడ
విచ్చేయుమయ్య వేవేగ దక్షిణమంద
　　మారుతప్రకటవిమాన మెక్కి
తరలి రావోయి నిత్యానూనయౌవన
　　శ్రీవిశేషప్రభాజృంభితాంగ
కోకిలాలాపములతోడ, కుసుమసౌర
భములతోడను, భృంగగీతములతోడ,
సుమపరాగంబుతోడ విశుద్ధకాంతు
లడర చనుదెమ్ము స్వాగతం బందుకొమ్ము.

మనోహరుఁడగు వసంతునకు రమణీయము, హృదయపూర్వకమునగు ఆహ్వాన మొసంగిన కవి:

కొనుమిదె పాద్యమల్ల చెఱి
　　కుంకుమలక్క చెలువారువారి, చే
కొనుమిదె యర్ఘ్యమ్ము మీకుసుమ
　　గుచ్ఛములందు స్రవించుతేనె, గై
కొను మధుపర్కమిద్ది నవ
　　కోమలపల్లవనిర్మితంబు, నా
సనమిదె చందనార్ద్రసుమ
　　జాలవిరాజితమిందు రమ్ముకన్.

అనుటలో మంచియౌచిత్య మున్నది. సున్నితమగు భావములకు సొగసుందనపుపలు కబ్బినది. ప్రకృతివర్ణనము పఠితల హృదయసీమలం దచ్చుపడుచున్నది. ఈఆతిథ్యమున కువ్విళులూరని తెలుగువా డుండడు. ఆ వాహనాతిథ్యములచే తనియక 'తమిశోక్కి నూతనయుగోదయగీతిక' లాలపించెద ననుచున్నాడు. అంతేకాదు, తనివిసనక మరలమరల అదేపాడుకొనును. 'వ్రాసిన వ్రాతలే తిరిగి వ్రాసినను-ఇలాతలమ్ము నయి సేయుజాలి దేని పరివార లిట్లు రససృష్టి నొనర్పు' అని మైమరచి, వసంతుని కీర్తించుచున్నాడు. అవును 'వీరి పరివార లిట్లు రససృష్టి నొనర్పు?' అంతకు గర్వించక 'గ్రహించుమోయి నాచేసిన సేవ నూతనవిశేషము లేమియు లేక పోయినన్' అని వినమ్రు డగుచున్నాడు. ఇది ఉత్తమ కవుల లక్షణము.

"లలితాపూర్వకేళీ విలాసమూర్తి" యగు వసంతు డతని ఆత్మ నన్నెత్తుకొనిపోయి 'యరయరాని యొక మహానందవార్థితీరోజ్జ్వల ప్రదేశమున' చేరపైచెను. కవి అందులకు 'ఇదేటికోయి?' అని ప్రశ్నించుచుండగనే 'సుందరమృదుదేహు డీ హృదయతస్కరు డీ మలయానిలుం డహో' పైపలుకు తోచనీయడు. చేయునది లేక 'రసరాజ్య మెల్లకడలం భాలించు' మందానిలరాజనందనుని:

అమృతానంద సముద్రవీచికలపై
　　నట్టిట్టు దోగాడు శో
నము లై యీ మృదు దక్షిణానిలతరం
　　గారూఢియుల్ పువ్వుగు.

చ్ఛము లల్లాడెడుతీవి, యీామురిపె మీా
సౌందర్యలీలావిహా
రము లీలాస్యము లీయొయ్యారములు గ
ర్వస్ఫూర్తి వీక్షించుచుఁగ్.

తదానందలీలాలగ్నమానసుడగును. అంతేకాదు 'ఈ వసంతనవ జీవనవైభవముల్ గ్రహించి, యా యాపసము విస్మరింపజన దారుణకాలము మానవాళికి' అని విభావించుచున్నాడు. ఇట్టి రసహృదయుల రచనల యందేకదా అమృత కవితాదర్శనము. 'ఈ నవవసంత శుభోదయవేళ నేనియుఁగ్, పాడుకొనంగలేని హతభాగ్యులెవో తలపోయ మానవుల్' కారు. 'ఔరా యెంతటి యైంద్రజాలికమలయ్యా యీావసంతప్రభల్' ఈరచనయు నట్టిద. వాడుకలోని శబ్దముల నుపయోగించి రసపుష్టియొనర్పుటం దీతడు గడుసరి:

జవ్వనపుంబిసాళికను సైగలతో
చిరునవ్వుమోవిపై
నివ్వటిలంగ క్రొత్తసెరనీటులు
గోటులు చిల్కరించు, నీ
నవ్వులరాణితో ప్రణయనాటకముల్
ప్రకటింపసెంచి నా
పువ్వులరంగ డీభువనమోహను
డిమ్మహి కేగుదెంచెగా.

కవికూడ ఇచ్చట 'పువ్వులరంగని' తో నైక్యమైపోవున్న నిప్పటికవిత పుట్టదు.

మంచునజీకి క్రొందళుకుమాసిన
మాసములూడ్చి పైపిరా
యించిన రంగుతో బడగలెత్తిన
యందము 'లిన్ని యుఁగ్ బనా
యించిన పోకులై బలెబలేయని
పించ ప్రమోదవార్ధి దే
లించుచునుండెలో జగములిన్నియు
బాలచిగుళ్ల తెప్పలఁగ్.

బలెబలే! ప్రమోదవార్ధి దేలించుచున్న దీ ఘట్టము. పల్లెటూరి పెండ్లిదృశ్య మీాక్రిందిగీతియందు కన్నులగట్టుచున్నది చూడుడు:

నీలనభంబుచాయ నళినీరవ
రంజితపుష్పమంజరీ
జాలములొప్ప బూచిన రసాల
మహీజమునీడ పెద్దబా
కాలదె పట్టుచుండిరి దిగంతరముల్
ప్రతిరావ మీాన, రాం
ఫోలున మూడుదెబ్బలును మ్రోగగ
సాగెను పెండ్లిసుంపులో.

ఆకలనఁగ్ వినంజెలఁగె హాయి
సనాయిరవంబు, క్రొత్త తా
టాకులకమ్మతావి నిగుడఁగ్ రచి
యించిన పెండ్లిపందిటఁగ్
చాకలివాం డ్రడే భుజముసాచిరి
పల్లకి పైకినెత్తగా
నాకసముఁగ్ దిశల్ వసులున ట్లొక
పెట్టున మ్రోగె వాద్యముల్.

పెండ్లిపందిరులలో నందరము గూరుచుందుము. అందనేకసుగంధము లాఘ్రాణించుచుందుము. కాని 'క్రొత్తతాటాకుల కమ్మతావి' కనుగొనువారు చాలతక్కువ. ఈకవిమాత్ర మది బాగుగ పసిపట్టినాడు. కనుకనే యీాపద్యము.

శుష్కవేదాంతులకు కవిప్రశ్నమును,సందేశమును ఇది: 'అసలుదీసుక శేషము నాశనేయకుము' 'వని స్వర్గముకాద నెచ్చెలీ!' అను ఉమర్ఖయ్యామును జ్ఞప్తికి దెచ్చుచున్నాడిచ్చట.

లలితకళావిలాసము లీలాతల
మెల్లనలంకరింప బు
వ్వులువికసించె జిత్రములుఁద్రోలె
శకుంతసతీవితానకో
మల కలగానమొప్ప సుకుమార
సమీరుడు లాస్యమాడు, నీ
యిలపయిగాక స్వర్గ మిక నెచ్చట
నున్నది శూన్యసీమలోఁగ్.

జగత్తే ప్రేమధామము. అదే స్వర్గము. ప్రేమ శూన్యమైన స్వర్గమునకన్న పావనప్రేమమయమైన లోకమే కాంక్షింపదగినది. ఈ దళితసత్యము రవీంద్రాదికవుల రచనలయందును ద్యోతకమగును.

ప్రేమోపాసకుఁడగు నీకవి ప్రణయదేవికి:

సురభిళదక్షిణానిలము శోభిలు
చున్న రసాలవాటికాం
తరమున నీవలన్ కుసుమతల్పమునన్
శయనించి, 'సుందరీ!
సురపతినైతి నే నెదురుమాచెద
నీకని యీవసంతబం
ధురములుపాడి చెప్పెనని...

లేఖ రచించినాఁడు. ఆలేఖకు కైకొనిన పరికరములు లలితాతిలలితములు, అమృతమధురములు, అతిస్నిగ్ధములు. అందలి భావమో అనన్యము. పరికింపుఁడు:

చిక్కని యీ సుమాసవమపీరస
మంగొని ముంచి వ్రాసినా
నిక్కమలాచ్ఛపత్రమున నీవిరి
కేసరమేకలంబుగా
నక్కరముల్ కనుల్ మెరయునట్లుగ
పుప్పొడి పైనజల్లినా
నక్కమలాక్షి యందుకొనునా? కను
మోని త్రిప్పివేయునా?

ఇంకను అనుమానమే ప్రేమతపస్వికి: అంతటి లలితవస్తువులైనను ప్రేయసి మోటని త్రిప్పివేయునేమో యని శంకించుచున్నాడు. ఎంతసహజమిది! మనోహరము, సత్యము. ఇట్టి చక్కనిభావములు, మెత్తనిరచనలు సాగించుట పెద్దకవులకుకూడ నరుదనికార్యము. ఇంత యవలీలగ నీతడు సాధించుట మిక్కిలియచ్చెరువు.

కవివంశము రాజులనుండి, రాజహంసలనుండి కోయిలకులమునకు క్రమక్రమముగా మారినది ఆయా కాలములందు. కాని, యీకవి వీనినన్నింటిని మించిన వినూత్నగౌరవబిరుద మొసగినాడు కవిజాతికి. 'త్రాగడుజాతి' రసాస్వాదనక్రియాధుర్యులరియో. రసోన్మత్త దివ్యనాట్యకళాధుళలు రనియో. ఏమొ! అంతేకాదు కులాచారమైన 'పని' కూడనిది కాదట. కనక:

త్రాగడుజాతి కీ సుమసుధారస
మానుట తప్పుగాదు నే
త్రాగద నాడెదన్ పృథివిదాటెద
మీటెద వాణి వీణపై
తీగలు త్రెస్సిపోవ రసతీవ్రత
నీ చిగురాకుతీగపై
నూగద భూమిపీడి యొకయూపున
స్వర్గము కాలదన్నుచున్.

క్రీడించెదడట. మరియు నితనికి 'వివశములై, స్తంభించిన యవయవములు నింద్రియంబు లద్భుతగతి; నీభువనం బొక చిత్రకళాభవనంబై నన్ను ముంచివైచెనయారే!' అవును త్రాగుబోతులకు కలుగులక్షణములివేకదా!

తలకెక్కినది తిక్క ఇంక!

రావలెను నాదుప్రాణంబు ప్రాణ మిపుడు
నను కటాక్షింప స్వాగ్ఛవనంబువిడిచి.

తానో—

పోవలెను నేను నాప్రేమమూర్తి గలియ
నీప్రపంచముపొలిమేర లెల్ల దాటి

అచ్చట, అప్పుడు—

కలిసికొని యొక్కరొకరిలో కరగిపోయి,
యనుభవింత మనిర్వాచ్యమైన ప్రేమ.

మరియు:

దైవమనకైన నకల చిత్తనము లేదు
దేశకాలంబులును విడదీయ లేవు.

ఆహా! ఎంతరసార్ద్రశీవి. స్వేచ్ఛావిహారి కవి.

ఈ మహానందసంరంభ మే భరింప
జాల దుర్బలంబైన నాస్వాంతమందు,
ప్రాణమా! నీవు నా దండరాకయున్న.

ఇట్టిదికదా అకలంకమైన ప్రణయము. దేవిరో దండరాకున్నచో: 'మృదుసహోదరి మదనలక్ష్మిరో

రోటుంగు'ననుచున్నాడు. విరహియును నిజమైనభక్తుడు భరింపలేడు. అయినను మృత్యువును దూషింపడు. మృదుసహోదరి యామె. ఈతడు ప్రేమకొరకు 'బలికి' సంసిద్ధుడు. కనుకనే అట్టినుడి:

ఎవడాగంగల జీవసంతమున దే
వీ! త్రాగుబోతుల్, మనో
భవపుష్పాయుధపీడితుల్ సుకవితా
వ్యామోహలోలాత్ము లీ
భువిపై నీదు విభూతులన్ గనుచు
నిన్ బూజించు నున్మత్తులం
దెవ డానిగ్రహశాలి? నీమధుర
మూర్తి న్నెను బంధించెదన్.

ఎవ డా నిగ్రహశాలి! నాస్తి. ఈపద్యమునకు భావము ఉప్పొంగనిరసికుడు: పులకరింపని యొడలు గలుగు చదువరియు నుండడనుకొందును. అనుకొనుట యేమి? ఇంతసత్యము. ఇది అక్షరమక్షర మమృతగుళిక.

కలవు నీకును నా కనేకములు కాల
దేశనిబద్ధములు రసోద్దీపనములు
నిత్యనూతనములు రమణీయములయి
వనజలోచన' సంబంధబాంధవములు.

ఇదీ వీరి సంబంధము. ఇంక యీతనిప్రశ్న—

కష్టసుఖములు పడుగుపేకలుగ, జనన
మరణములె యంచులుగ నేయు మర్త్యజీవి
తాంబరంబున నను సంవృతాత్మజేసి
నీ వమర్త్యత నిల్పుటే నియతి చెపుమ!

మానవజీవితము మనోహరముగ ప్రతిఫలించిన దిందు. ఇందలిభావములు మహోన్నతములు. మధురములు. అర్థవంతములు.

తాను స్థిరుడుగాకున్నను, 'ప్రేమ' శాశ్వత మనుచున్నాడు. ఇది యెంతయు నిక్కువము. తనకు జరుగుచున్న యన్యాయమును వివరించుకొన సెలవిమ్మనుచు, తన్నుకూడ శాశ్వతుని గావించుమని వేడుకొనుచున్నాడు. ప్రేమ భిక్షార్థి కిది యెంత యుచితము. ఆనందప్రదము.

'నీవు' అనుగ్రహింపవేని 'తెలివా! తెరువేని జగంబునం దికన్.' అగును, దేనికొరకై తాను ఆసక్తి పడుచున్నాడో అది లభింపదేని అతనిజీవితము వ్యర్థము. కాదందువా! 'తెరువేది జగంబునందికన్' చూచి పుణ్యమున బొమ్మ. 'పుష్పాంజలినట్టి, నీకొరకునై యిటు నిల్చితి పేరటామనిన్' రమ్మ.

అంతేకాదు:

నీయానందము పూవులై, చివురులై,
నిర్వేలసమ్మోహన
శ్రీయై రోలె వసంతపుష్పమయమా
సింహాసనం బిందు నీ
కై యేర్పడ్డది కొల్వుదీరు మిదె
నీ కర్పించుచున్నాడ రా
జ్ఞీ! యీనా ప్రణయైకజీవితము
న న్నెలంపగన్ నీకికన్;
పాదాక్రాంతుడనగుచు, నెండియు:

మధువుగమారె నీస్మరణమాత్రన
మామక దేహపాత్రికన్
రుధిరము, మర్త్యభావము తిరోహిత
మై యమరత్వమందె, నీ
యధరసుధారసానుభవ మబ్బిన
నాడు, జగంబులిన్నియున్
మధురమరందవారినిధి మగ్నములై
నను ముంచి తేల్చవే.
ని, ర్మలమృదుదక్షిణానిలతరంగము
లూయెలలూప బూలతె
ప్పలపయి దేలి పోదము ప్రపంచము
ముంచిన మోదవార్ధిలోన్.

అని యెలుగెత్తి పిల్చుచున్నాడు. ఇంకను—

కై, పెక్కునచిత్తవృత్తి నొరులెవ్వరి
నిన్ గయికొన తందవాల్
ద్రొక్కుచు నీ వినోదములతో నిలు
వెల్లను మున్గిపోవ...
చూచుచున్నాడు. వెండియు తుష్టిలేక—

అద్దమువోలెనైన హృదయంబున
నీరమణీయరూప మే
నద్దితి, నీకు నాకు సరిహద్దులు
లే వితరప్రపంచపుఁ
బద్దులుమాని నీప్రణయసూత్రము
లేను పఠించుచుంటి నో
ముద్దియ! నేను నీవయయిపోవుట
లేతిరి సంభవించునో!

లక్ష్యమది: తత్ప్రాప్తి మనోరథసిద్ధి కడకు:—

అలరుల జేరుగాలి నవయౌవన
మంతయు నీ పికాంగనా
కలరవ మస్మదీయమగు గానము
జేకొనుగాత, మారుతా
వలికొనుగాక కైత, రసవార్ధి
మునింగి యనంగవైఖరిన్
నిలిచెద మింక శేషమయి నీవును
నేను వసంతలీలలన్.

ఇది అట్టి పవిత్రప్రేమ జీవనులకే చెల్లినది.

గుణబహుళమగు కావ్యమునుగూర్చి యెంతయేని చెప్పవచ్చును. ఈకావ్యప్రశంసచేసిన నింకనుం గలదు. కాని కాలముచాలదు. తళుకుబెళుకురాలు తట్టెడుకంటె నిక్కంపునీల మొక్కండుచాలు. ఈ మధురకావ్యము మంచినీలము. ఈ కవిరచనలు భావబంధురములు, సరళములు. శైలి చక్కనిది. ఇట్టి రసవత్కావ్యము లింకను రచియించి ఆంధ్రులకు విందుపెట్ట నీకని నభిలషింతును. ఈమా 'వసంతసదృశజీవి'కి భగవాను డాయురారోగ్యముల బ్రసాదించు గాక!



ఈఘ్రడవ్వాడు చెట్టుమొదటనుండి కనుపడు దృశ్యము D. A. R.

# మెండలీయము—రక్తస్పర్శ

(Mendelism—Heredity)

యన్. యమ్. వేణు

ఆధునికజీవశాస్త్ర పరిశోధనలు పాశ్చాత్యదేశమున ఊహింపరాని యున్నతదశ నంది, మానవుని జ్ఞానవికాసమున కెంతయో తోడ్పడినవి. ప్రతిదినము ప్రకృతియందలి ఏదోయొక రహస్యము కనిపెట్టబడి మానవజీవితము మఱింత తేజోవంతముగ, ఉత్సాహపూరితముగ జేయబడుచుండుటను ప్రాచ్యభాషా పరిజ్ఞానము నలవరించుకొని శాస్త్రలోకమున నివసించువారెఱుంగుదురు. అట్టి ప్రకృతిశాస్త్రపరిజ్ఞానము ఆంధ్రలోకమున, ఆంధ్రభాషయందు, ప్రతి ఆంధ్రునికి అందుబాటులోనుండు భాగ్యము ఎప్పుడు సమకూరునో కదా! అత్యంతము ముఖ్యమైనవి, ప్రతియొక్కరును తెలిసికొనవలసినవి అగు జీవశాస్త్రసంబంధమైన యంశములు చాలయున్నవి. అందు ముఖ్యమైన ఒక్కయంశముమాత్ర మిందు చర్చింతము.

ఇది చాలవఱకు పామరుల కుద్దేశింపబడినది. అనగా పండితులు, శాస్త్రపరిజ్ఞానము కలవారు చదువగూడదని యాదేశముగాదు. మానవుని జీవయాత్రకివి అత్యంతావశ్యకములు గావున ప్రతియొక్కరును ఈ విషయముల నెఱింగియుండుట శ్రేయస్కరము. ఈపరిజ్ఞానము భావికాలపు ఆంధ్రసంతానోన్నతికిగూడ మూలకందము.

పుల్లయ్యకు పుట్టినప్పటినుండియు అన్నవస్త్రములకు కొఱత లేదు. తాతలనాటి మడిమాన్యములు పోరాశముగ నున్నవి. ఆతనితండ్రి మేధాశక్తిలో నసమానుడు. వ్రేలుచూపిన చేయి మ్రింగునంతటివాడు. స్వయంకృషిచేత గౌరవము నార్జించినవాడు. కాని పుల్లయ్య హృదయదద్దమ్మ. కడుపుచీల్చి కంచుకాగడాలతో కలయవెదకినను అక్షరమొక్క కనబడదు. రామయ్యశాస్త్రి గణితశాస్త్రమునం దసమానుడు. ఆయన కుమారునకో లెక్కలన్న తలనొప్పి. మడకమోటుగాడు పసలరెడ్డి; ఆతని పుత్రుడన్ననో అర్థశాస్త్రమునం దారితేరి, ఇంగ్లాండుకువెళ్లి I. C. S. నం దుత్తీర్ణుడై పేరుప్రఖ్యాతులు గడించినవాడు. జంగమనాయుడు కోళ్లగెలిచినకోడి. పదిమంది గజబలముగలవారొక్కమారే పైబడివచ్చినను వారిని డీకొని పారదోలునంతటి ధైర్యవంతుడు, సత్తువగలవాడు. అట్టివారికి "ఉఫ్" అన్న నూరికావలబడునట్టి కొడుకు. ఉల్లిపాయకు పుల్లలు చెక్కినట్లు సన్ననికాళ్లు, చేతులు. పోలిసెట్టి లక్షాధికారి. సంతానాభిలాషతో ముగ్గురను పెండ్లాడినాడు. తుదకు డబ్బు వ్యర్థమైనదేకాని యాశించితము సిద్ధింపలేదు. రామాయమ్మ అముడబిడ్డలుగన్నది. ఏమిచిత్రమో! ఇరువురుబిడ్డలు ఒక్కఅచ్చుపదీసినట్లున్నారు. వారొక్కసారి యేడ్చెదరు, ఒకేసారి జబ్బుపడుదురు, ఒకేచేతలజేతురు. బడిలో నొకేవిధముగ నుందురు, తుదకు ఒకేవయస్సునందు, ఒకేజాడ్యముతో మరణింతురు! ఈసృష్టి వ్యత్యస్తముల కర్థమేమైనగలదా? 'తల్లిచాలు బొల్లిపిల్ల' అనుసామెత ఇచ్చట నిరర్థకమే అయినదా? ఇవన్నియు వారివారి పూర్వజన్మకర్మఫలానుభవములేనా? లేక మానవదృగ్గోచరదూరమైన రహస్యము మరేదైన నున్నదా?

వీరన్న తానుత్సాహపూరితుడని, ముక్కోపియని, మాటకారియని ఎఱుంగును. సుబ్బయ్య వీరన్న స్వభావాదులను మఱింత చక్కగా నెఱుంగును. ఏయేసందర్భములం దెట్లు ప్రవర్తించగలడో సుబ్బయ్య సూటిగ చెప్పగలడు. వీరన్న పూర్తిగా తన్నుతానెఱింగియున్నప్పటికిని, ఆయాసందర్భములయందు, తానావిధముగ నేలప్రవర్తించెనో, మఱొకవిధముగా ప్రవర్తించుటకు ప్రయత్నించియు ఏల విఫలుడయ్యెనో పాపము ఎఱుగడు. ఒకానొకప్పుడు తనముత్తాత అట్టి

ప్రవర్తన గలిగియుండెనని యాతనికి తెలియదు. తెలిసి యున్నచో జాగ్రతగనే మెలంగియుండును. ఇంతియే కాదు; కొన్నికొన్ని విషమపరిస్థితులయందు తా నేత్రోవద్రొక్కవలెనో వీరన్న తనకుతానే నిర్దేశించుకొనవలసియుండును. తన 'అసెంబ్లీ' 'వోటు' ను సత్యనారాయణమూర్తికిచ్చుట సమంజసమా? లేక రామస్వామి మొదలియారున కిచ్చుట తగునా? పన్నులు విధించు 'శాసనములు', వివాహశాసనములు, వివాహవిచ్ఛేదనసూత్రములు, కుటుంబసంరక్షణశాఖలు, ప్రజారోగ్యపరిస్థితులు మొదలగువిషయములయందు తనయభిప్రాయములను వెలిపుచ్చవలసియుండును. మానవసంఘమున 'నేరస్థుల జాతి యొకటి వేరుగ నున్నదా? అన్నవస్త్రదానాదులవలన కలుగు ఫలమేమి? ఉన్నతవిద్యాశాలలవలన మానవసంఘమునకు కలుగు మంచిచెడుగులేవి? కందలకొలది బాలబాలికలకు సమానవిద్య గఱపియు అందఱు బోసులు, రామకృష్ణులు, రామన్లు, పరోజినులు ఏలకాలేదు? సుబ్బిగాడు పగలంతయు గోటిబిళ్లాటలాడి, రాత్రులలో వీథులు తిరిగి, పరీక్షలో 'ప్యాసు' మార్కులు సంపాదించును. దొరస్వామి వినయవిధేయతలతో బడిపంతులు చెప్పినపాఠములు చక్కగా వ్రాసుకొని, చేతనున్న పుస్తకము చేతికంటుకొని పోవునట్లు రాత్రిందివములు కష్టపడి చదివినను పరీక్షలో 'ఫెయిలు' మార్కులే? ఇట్టియంశములు వేనవేలు నిర్లక్ష్యభావముతో నింతవఱకు తృణీకరింప బడుచుండినవి. ప్రకృతియందలి యీ సమస్యల కుత్తరములు కని పెట్టుట దుస్సాధ్యములని తలంపబడుచుండినవి. జీవజంతువులయందలి రక్తస్పర్శ పరిజ్ఞానము (Knowledge of Heredity) ఇట్టిప్రశ్నల కుత్తరముల నొసంగ జాలియున్నది. ప్రతియొక్కరును దీనినిగూర్చి పూర్తిగ నెఱింగిననేగాని, తన్నుగూర్చిగాని తనవారినిగూర్చి కాని, ఇరుగుపొరుగువారిని గూర్చిగాని అమూలాగ్రముగ నెఱుంగజాలరు.

మానవు డసామాన్యమేధాశక్తియుతు డగుటయు, కీర్తిశంతుడగుటయు అదృష్టవశముచేత తన్ను పరివేష్టించి యున్న అనుకూలపరిస్థితుల ననుసరించియుండునా? లేక స్వయంకృషిచేతను తనతండ్రియు, తాతయు, ముత్తాతయు వారివారికాలమున కొలదిగనో, గొప్పగనో పేరుప్రతిష్ఠలు గడించి వినుతికెక్కినందుచేత తాను గూడ నట్లయినాడని తీర్మానించునా? ఎటుచెప్పుటకును కష్టముగనే యుండును. కాని సామాన్యముగ నాటికి ఎనుబదిపాళ్లు రెండును చేరియుండిననేకాని ఎట్టిపర్యవసానమును దుష్కరమేయగును. ప్రతియొక్కరును పుట్టినంతనే గొప్ప ధీమంతుడుగా నుండడు. ఒకగొప్ప గణితశాస్త్రవేత్తకు జనించిన శిశువు జన్మించినదే లెక్కలను వేయమన్న వేయలేడు. కాని మున్ముందు తాను తన తండ్రివలె గణితశాస్త్రవేత్త యగుటకు అనుకూలించు 'వైదుష్యాధ్యాపకసామర్థ్యయుతుడై' యుండును. తాను తండ్రివలె గొప్పవాడగుటయు, లేక అన్యథా గుర్వాపాదనిమగ్నుడై తనకేకాక తన్ను గన్నవారికిగూడ కళంకము నాపాదించువాడగుటయు, తనమీద గాక తన 'సహవాసదోషము'పై నాధారపడియుండును. అనుకూలపరిస్థితిపరివేష్టితుడై, చక్కని యాహారములయందు పెంచబడినచో, తనపుట్టుకతోగూడ వచ్చిన వైదుష్యాధ్యాపకసామర్థ్యాంకురము నానాట పెరిగి పెద్దదై వికసించి తనకు, తనవారికి, తనదేశమునకు గీర్తిని దెచ్చిపెట్టును. లేకపోయెనా తట్టెడు గులకరాళ్లలో కెంపువలె ప్రకాశించిన ప్రకాశించును, లేదా వానిచే మలినయుతమై కుప్పతొట్టిలో చేరిన చేరుకొనును. బండమీద చల్లిన విత్తనములవలె ఫలప్రదము కానేరదు. గోవుగర్భమునుండి కుక్కలను, పిల్లులనుండి ఎలుకలను బడయుట ఎంత యసంభవమో, ఎట్టివిద్యకును అసామర్థ్యయుతుడుగ జనించినవానిని, అసంకుచితానుభవపరివేష్టితునిగా జేసి, దేనియందేని యొకధీమంతునిగా జేయుటకు సహస్రవిధముల ప్రయత్నించినను, కుక్కతోక వంకరతీర్చినట్లు, చెవిటికి శంకూదినట్లు నిష్ఫలమే యగును. అట్టివాడు 'ఆకారపుష్టి నైవేద్యనష్టి'. 'తిండికి తిమ్మరాజు; పనికి పోతరాజు.' కావున మానవుని యున్నతదశకుగాని, అధమదశకుగాని వంశానుక్రమ రక్తస్పర్శాపరిణామమగు నిజాంతర్గతసామర్థ్యవికాసమే ముఖ్యకారణమా, లేక నిజావృత

బాహ్య ప్రపంచానుభవ ప్రభావమా? లేక రెండును గూడనా? ఈ యంశములను పరామర్శించి, దేనిదేనిని ఏయే విధముగ మనయధీనమునం దుంచుకొని యెట్లు ప్రవర్తించవలయునో ఆవిధముగ మెలగినయెడల మన యాంధ్రులలో నూటికి నూర్గురు ధైర్యసాహసయుతులు, మేధావంతులు, శాస్త్రపారంగతులు ఏలకాజాలరు?

సృష్టియందలి మానవు లెన్నడు సమానులుకారు. బలసత్వమునగాని, బుద్ధిచాతుర్యమునగాని, ఆస్తిపాస్తుల యందుగాని, నీతినియమములయందుగాని, ఏయిరువురును సరితూగరు. ఒకరికొకరికి కించిత్తైనను భేద ముండక తీరదు. ఒకేకోడిపెట్టిన గ్రుడ్లలోనుండి వచ్చుపిల్లలలో నొకదాని కొకదానికి సంబంధముండదు. ఒకేచెట్టు పండ్లు అభిన్నములుగా నుండవు. ఒకేకాయలోని గింజలసమానములు. ఒక్క స్వరూప స్వభావచేష్టాదులయందే కాక రాజకీయమునందును, సంఘమునందును, కళాగృహమునందును, విశ్వకళాపరిషత్తులయందును, కళాశాలలయందును, ఉన్నతపాఠశాలలందును, జాతిమత వర్ణములయందును ఎన్నటికిని, ఎల్లరకును సమానత్వము సమకూరుట సాధ్యము కాదు. అట్లే ఎసుదుదిగుల్లు ప్రకృతి యందు తప్పనిసరియైనచో, ప్రతివారును సమస్తవిషయములయందు సమానత్వమున కింత ప్రాకులాడుట యెందులకు? నిజముగా పిచ్చితనమే యగును. కాని మనకెల్లరకు సమత్వ మొక్క విషయమునం దావశ్యకమే యయియున్నది. సమస్తజనులకు సమాన పరిస్థితులు, సమానావకాశములు కల్పింపబడవలెను. అనగా, మానవుడు పుట్టినదే కొన్నిపరిస్థితులలో దగుల్కొనినచే కాని యాతని జీవితము దుర్భరమగును. ప్రాణము నిలుచుటకు కావలసిన యాహారము, ఉష్ణోగ్రత, గాలి, వెలుతురు మొదలైనవి మొదటిది. విజ్ఞానవికాసమునకు మనోబాహుబలముల పెంపొందించుటకు కావలసిన శిక్షణ రెండవది. తాను జన్మించిన సంఘమున కుపకరించుటకు, నీతినియమములపాటించి పదిమంది మెచ్చునట్లు ప్రవర్తించుటకు కావలసిన చక్కని సాంఘిక ఆచారవ్యవహారాదులు మూడవది. ఇట్టి అవకాశములమధ్య చిన్నవారి నెల్లరను జాతిమత విచక్షణ లేక ఈడువచ్చువఱకు ఉంచి, తరువాత వారివారి యిచ్ఛానువృత్తిని మెలంగునట్లుచేసిన నెంతబాగుండును! అట్లుగాక పొట్టకూటికి లేనికారణమున విధిలేక కొందఱును, తలిదండ్రుల తెలివిలేమిచేత కొందఱును, ఎందరో బాలురు చిన్నతనముననే ‘బీడిపనికి’ పొగచుట్టల పరిశ్రమాలయములకు తయారై, నిజాంతర్భవ వైదుష్యాధ్యాపక సామర్థ్యమును చంపుకొని, ప్రాణమున్నది గనుక జీవించియున్నారని యనిపించుకొని, మురసిపోయిన కొట్లవలె ఫలప్రదులు కాజాలకపోవుచున్నారు. అసంకుచిత ప్రపంచానుభవపరివేష్టితులుగా జేయుటకు ముఖ్యసాధనకారులగు పాఠశాలలు, ఉన్నతసంఘములు, వీనిమధ్య చిన్నవారినుంచి వారి “లోగుట్టు” కనిపెట్టుట కవకాశమే లేకున్నది. మఱియొకరాతికి గొట్టి చెకుముకిరాతిలోని నిప్పు నుపయోగించుకొనుటకుమాఱు దానిని దీసి బురదలో దుక్కినట్లైనది. నిశ్చయముగ సామర్థ్యయుతులను అసామర్థ్యయుతులను, తెలివిగలవారిని తెలివిలేనివారిని గనిపెట్టి వేరుచేసి మానవసంఘోన్నతికి మేలు చేయవలయునన్నచో, ప్రతివారికి బాహ్యప్రపంచానుభవసంపత్తిని చేకూర్చుటలో సమానత్వము సంపాదించవలయును. దీనికి ప్రభుత్వమువారే గాక తలిదండ్రులు సహితము సహాయకారులు కావలయును. ఈ కారణము చేతనే నిర్బంధప్రాథమిక విద్యావిధాన మెంత యావసరమో యోచింపుడు.

ఇదివఱకు చెప్పినరీతిని ప్రకృతియందు హెచ్చుతగ్గు లెట్లు సామాన్యముగ నున్నదో, అంతకంటె స్పష్టముగా కొన్నిటియందు పోలికలు గన్పడుచున్నవి. ఒకే కుటుంబమునందు వంశపరంపరగా క్షయవ్యాధిపొడసూపుచువచ్చి తడవతడవకు ఒక్కరిని తన పొట్టను బెట్టుకొనుచుండును. ఆరుప్రేళ్లుగలిగినవారు ఒకేకుటుంబమున గాననగుదురు. తాత, తండ్రి, కుమారులకు తమ పదియవయేటనే తెల్లవెండ్రుకలు గన్పడియుండవచ్చును. ముప్పదియవయేటనో, ఏబదియవయేటనో కుటుంబములోని ప్రతివారును, ఉన్మత్తులగుచుండుట తాతలనాటినుండి వంశపరంపరగా క్రమముదప్పకుండ ఒకేగృహమున వచ్చుచుండును. పొట్టిప్రేళ్లు, పొట్టి

చేతులు, పొట్టికాళ్లు గలవా రెవరన్న "ఫలానా" యింటివారని ఒకకుటుంబమువారికి ముఖ్యములగు ఆనవాళ్లుగా నేర్పడిపోయియుండును. ఈ విషయములలో తండ్రితనయులకుగల సమానత్వమునకు, సంతతిక వచ్చుచుండు నీవంశానుక్రమసంబంధ బాంధవ్యమునకు హెరిడిటీ (Heredity), లేక 'రక్తస్పర్శ' అందురు. బిడ్డ తలిదండ్రులలోని యొకభాగము. ఒకేతానులో చించినగుడ్డ పెద్దతానులోని పడుగు పేకల యల్లిక, మృదుత్వమో, కఠినత్వమో అన్నియు ఆతుండుగుడ్డకుగూడ నుండితీరును. ఈ తండ్రితాతల యానవాళ్లు, తండ్రియైనవాడు తన జీవాంకురోత్పాదకకణముల ద్వారా (Germ plasm) బిడ్డకు ప్రసాదించుచున్నాడు. తండ్రినుండి అంకురోత్పాదక జీవకణకోశము (Germ cell) బీజకణముల (Spermataroids) ద్వారా తల్లి గర్భము ప్రవేశించి, గర్భాశయమునందలి స్థూలబీజాశయముతో (Ovum సమ్మేళన నంది, తత్సమ్మేళన ఫలప్రదము చే, తల్లిదండ్రుల పేరు చెప్పు బిడ్డ

చిత్రము 1



వ్యత్యస్తరంగవి జీవాంకురోత్పాదక బీజకణములు

వలయములలోని తెల్ల యిండ్లు శరీరాణుకోశములను దెల్పును.

నల్లచుక్కలు జీవాంకురోత్పాదక బీజకణములను సూచించును.

♀ స్త్రీ చిహ్నము. ♂ పురుష చిహ్నము.

త. తరము.

యుత్పన్నమగుచుండును. మనమెల్లరము నిజవిధముగ సూక్ష్మమైన ఒకేఒక జీవకణకోశమునుండి మనజీవయాత్ర ప్రారంభించినవారమే యగుదుము. బిడ్డల యుత్పత్తికి ఆధారభూతమైనదియు, తలిదండ్రులనుండి ప్రసాదింపబడునట్టిదియు నగు ఈ జీవాంకురోత్పాదక కణములు జర్మనీశాస్త్రజ్ఞుడు వెయిస్మన్ (Weismann) చెప్పినట్లు చిరంజీవులే! (చూడుము చిత్రము 1.)వీని కీపనితప్ప మరేదియు లేదు. వీనిని సంరక్షించుచు శరీరములోని తక్కిన జీవకణములు వృద్ధియైతమపనిని తాము నిర్వర్తించి చిట్టచివరకు నశించుచున్నవి. కావున వంశపారంపర్యముగ వచ్చుచుండు "రక్తస్పర్శవ్యాపారము" నాశనమునెఱుంగని జీవాంకురోత్పాదకకణములద్వారా జరుగుచుండవలయును. తండ్రితాతల కెంతను పోలికలేని బిడ్డలను బడయవల

చిత్రము 2.




గర్భాంతరమున బదవేయబడిన స్థూలబీజాశయమువలన బడసిన సంతానము.

అ. స్థూలబీజాశయము గ్రహింపబడ్డ సీమపందికొక్కు (నల్లది.)

ఇ. స్థూలబీజాశయమున నుంచిన సీమపందికొక్కు (తెల్లది.)

ఉ. తెల్ల సీమపందికొక్కు (మగది.)

ఎ. ఇ, ఉ, ల సంపర్కజనిత సంతానము (అన్నియు నలుపు)

♀ స్త్రీ; ♂: పురుష చిహ్నములు.

యున్నచో, జీవాంకుర బీజకణమును మార్పజాలిననే కాని అట్టి ప్రయత్నము కొనసాగదు. కాని యిది అంత సులభమైనపనియా? తక్కిన శరీరమునందలి యే మార్పయినను వానిని చెందుటలేదు. తోకలు కోసి పెంచబడినయెలుకలు మొండితోకలుగల పిల్లలను ఈనుట లేదు. చిన్నిపాదములు అందముగా గణించు చీనావారికి ప్రయాసపడి కట్టుగట్టు నక్కఱలేకయే చిన్నపాదములు గల శిశువు లుద్భవించుటలేదు. నల్ల సీమపందికొక్కులోని స్థూలబీజాశయమును దీని తెల్లసీమ పందికొక్కు గర్భములో బడవేసి, దానిని మఱియొక మగ తెల్లదానితో జతచేర్చిన వానికి పుట్టుపిల్లలన్నియు తల్లిదండ్రుల వలె తెల్లగానుండక, స్థూలబీజ శయమును గ్రహింపబడినదానివలె నల్లగానేయుండును. (చూడుము చిత్రము 2.) కావున శరీరమునందు బీజకణకోశబాహ్య ప్రదేశములయం దెచ్చటనైనను, ఎట్టిమార్పుగలిగినను అవన్నియు బీజకణములకు చెందుటలేదు తత్ఫలితముగ ఘటనాగతిజనితశరీరాంగవికారాదులు సంతానమునకు తగులదు. అయినను సంతానమునకుగల విద్యాభిలాషయు, పనులయం దాసక్తి, సత్కార్యమున కుత్సాహము మొదలైనవి మాతాపితలనుండియే గ్రహింపబడునని కొందరూహించెదరు. కాని ప్రపంచానుభవ మిందులకు విరుద్ధముగా నున్నది.

మానవు డీభూగోళమున జీవయాత్రప్రారంభించి యెన్నియోకోట్ల సంవత్సరములు గడచిపోయినవి. ప్రకృతి నిర్మితములైన గుహాలలో ఎండవానలకు తలదాచికొనుచు, పర్ణవల్కలముల మొలకుజుట్టుకొని మానము గాపాడుకొనుచు, బాహుబలముచే వేటాడిన జంతువుల మాంసము తిని ప్రాణము నిలిపికొనుచు మెలగుచుండిన మానవుడు ఆవశ్యకతచేతను, అనుభవముచేతను, ఆలోచనాశక్తిచేతను నానాటపెరిగిన నాగరికతాపరిణామముగ నేడు ఆకాశము నంటుకొనిపోవునంతటి గృహములలో నివసించుచున్నాడు. దినమున కొకొక్కవిధముగు దుస్తులు ధరించుచున్నాడు. రుచికరములగు పిండివంటలతోగూడిన భోజన మొనర్చుచున్నాడు. ముదుపటి యడవిమనుష్యునివలె నిప్పుడు ఏకకుటుంబనివాసిగానుండుటకు మనము సాహసింపము. ఎవ్వరేని పైబడి కొట్టవచ్చినను, పొంగిపొరలివచ్చు కోపము నడంచికొని వారితో సాధువాదమునకు బ్రయత్నింతుము. కాని ఎన్నియున్నను మనపూర్వపు మానవప్రకృతి ఇంకను పూర్తిగా నశించలేదు. కొన్ని కొన్ని పరిస్థితులయందు మనలో నడవిమనుష్యు డప్పుడప్పుడు పొడసూపుచుండును. మనలో నాగరికప్రవర్తన యెట్లు వృద్ధియైనదో అట్లనే మానవ 'ప్రకృతిని' (రక్తస్పర్శను—Heredity) సంపాదించుటకు గల అవకాశములను గూర్చి యించుక యోచింతము.

ఈ రక్తస్పర్శవిషయమున కడు పరిశ్రమచేసి దాని ప్రాముఖ్యమును గనిపెట్టి శాస్త్రలోకమునకు మార్గదర్శకులైనవారిలో ఫ్రాన్సిస్ గాల్టన్ (Francis Galton), గ్రిగర్ మెండెల్ (Greger Mendel) అను వారు ముఖ్యులు. వా రిరువురును సమకాలికులు. గాల్టన్ గారు జనసామాన్యమునందు ఎత్తువిడదలగు కొలతలను దీసి కొన్ని కొన్ని కుటుంబముల కొలతలను పరిశోధించి సగటున మానవసాముదాయకమున కనువర్తించు రెండు ముఖ్యములగు సూత్రములను గనిపెట్టిరి. మెండలు మహాశయుడు ప్రత్యేకప్రత్యేకముగ ఎందును పరస్పరసంబంధములేని రెండు స్వచ్ఛందజాతులను దీసికొని, ఆరెంటికిని సంపర్కము గుదిర్చి, వానిసంతాన

చిత్రము 3

16

58 60 62 64 66 68 70 72 74 76

GALTON'S LAW OF VARIABILITY

ఈ చిత్రము జనసమ్మర్దమునందు పరిమాణమునం దస్థిరత్వమును చూపు పటము. సగటున నలుబదియెనిమిది మందిలో ఆయాపరిమాణమున ... కెందరుండునదియు చిత్రములోని గదులలోని సంఖ్య సూచించుచున్నది.

మును బరీక్షించి, అందుండి సామాన్యముగ ఏఒక్కరి కైనను ననువర్తించగల కొన్నివిషయములను గనిపెట్టిరి. గాల్టన్ సూత్రములు జనసమ్మర్దములకే చెల్లును; మెండల్ ధర్మములు ఏకజనసమ్మతములు.

## గాల్టన్ సూత్రములు. (Galton's laws)

గాల్టన్‌గారి సూత్రములలో 'పుత్రయోగ్యప్రత్యావర్తన సూత్రము' (Law of filial regression) మొట్టమొదటిది. ౫,౦౦౦ మందిజనసంఖ్యగల ఒకానొక పట్టణమును దీసికొందము. ఈ ఐదువేలమందియు ఎత్తునందు సమానముగ నుండరు. కొందరు అంగుష్ఠప్రమాణులుందురు; మఱికొందరు ఆరడుగుల యెత్తుందురు; చాలమంది మధ్యరకముగా నుందురు. ఈ పరిమాణమునందలి అస్థిరత్వమును సూచించుచు వ్రాయబడ్డ చిత్తరువును చూడుడు. (చిత్రము 3 ) వారియెత్తులు నాలుగడుగుల ఆరంగుళముల మొదలు ఆరున్నరడుగు వఱకుందుననుకొనుడు. అటులైనచో నీయైదువేలమందియు ఆయాపరిమాణమునకు ఈ క్రిందకనినరీతిగ పంచిపెట్టబడియుందురు.

| పొడుగు. | | | | జనసంఖ్య. |
|---|---|---|---|---|
| అ. అం. నుండి. | | అ. అం. వరకు. | | |
| ౧. ౪-౧౦ | ... | ౫-౦ | ... | ౧౦౪ |
| ౨. ౫-౦ | ... | ౫-౨ | ... | ౨౦౮ |
| ౩. ౫-౨ | ... | ౫-౪ | ... | ౪౧౬ |
| ౪. ౫-౪ | ... | ౫-౬ | ... | ౯౩౬ |
| ౫. ౫-౬ | ... | ౫-౮ | ... | ౧౬౬౪ |
| ౬. ౫-౮ | ... | ౫-౧౦ | ... | ౯౩౬ |
| ౭. ౫-౧౦ | ... | ౬-౦ | ... | ౪౧౬ |
| ౮. ౬-౦ | ... | ౬-౨ | ... | ౨౦౮ |
| ౯. ౬-౨ | ... | ౬-౪ | ... | ౧౦౪ |

ఈ లెక్కలనుబట్టి ప్రతినలుబదిరెనిమిది మందిని ఆయాయెత్తు ననుసరించి ౧: ౨: ౪: ౯: ౧౬: ౯: ౪: ౨: ౧ గా పంచిపెట్టవచ్చును. (చూడుము గ్రాఫ్ చిత్రము ౪) దీనివలన అట్టిపొట్టివారును, అట్టిపొడుగువారును చాలయెక్కువగాలేక మధ్యరకము మనుష్యులు విస్తారముగా నుందురని యేర్పడుచున్నది. ఇందులకు

చిత్రము 4



ఎత్తు అంగుళములలో

VARIABILITY CURVE

ముఖ్యకారణము, చాలపొడుగుపాటి తలిదండ్రులు సర్వత్ర తమయంత యున్నతకాయులగు సంతానమును బడయుటలేదు; అట్లే చాలపొట్టివారైన తలిదండ్రుల సంతానము, వారివలె గిటకబారియుండరు. ఏదో ఒకరిద్దరు తమ తలిదండ్రుల పరిమాణము ననుకరించినను చాలమంది జనబాహుళ్యము ననుసరింతురు. ప్రకృతియందు సర్వత్ర జరుగుచుండు ఈవ్యాపారమును పుత్రయోగ్యప్రత్యావర్తనమని గాల్టన్‌గారు నిర్వచించిరి. (Tall parents seldom beget children as tall

చిత్రము



తండ్రుల యెత్తు.

Correlation between fathers & sons

తండ్రితనయుల అన్యోన్యాన్వయము. నిలువుగీత ప్రక్కను, అడ్డగీతక్రిందను ఉండు అంకెలు తనయుల యొక్కయు, తండ్రులయొక్కయు ఎత్తునుజెలుపును.

as themselves. Similar is the case with short parents. Their progeny tend to drift towards the average of the population This, Galton called the law of filial regression) ఇదే పరిమాణవిషయమునందు తండ్రితనయుల అన్యోన్యాన్వయమును (Correlation between fathers and sons.) గనిపెట్టుటకు ప్రొఫెసర్ పియర్సన్ గారు (Professor Pearson) కొన్ని పరిశోధనలు సలిపిరి. (చూడుము. చిత్రము. ౫ (గ్రాఫ్) వారి లెక్కలనుబట్టి సగటున తండ్రితనయుల యెత్తులు యీ క్రింది విధముగ నుండును.

| అంగుళములలో తండ్రియెత్తు | | అంగుళములలో తనయునియెత్తు |
|---|---|---|
| ౬౧ | ... | ౬౬.౫ |
| ౬౨ | ... | ౬౪.౫ |
| ౬౩ | ... | ౬౬ |
| ౬౪ | ... | ౬౬ |
| ౬౫ | ... | ౬౬.౨ |
| ౬౭ | ... | ౬౭ |
| ౬౮ | ... | ౬౭.౧ |
| ౭౦ | ... | ౬౭.౮ |
| ౭౧ | ... | ౬౮.౫ |
| ౭౨ | ... | ౭౦ |
| ౭౨ | ... | ౭౧ |
| ౭౩ | ... | ౭౦.౫ |
| ౭౫ | ... | ౭౦.౫ |
| ౬౬ | ... | ౬౬.౫ |

ఈకొలతను ౫-వ చిత్రమున చూపినరీతిని 'గ్రాఫ్'నందు గీచినచో ఏటవాలుగనుండు క. ఖ. గీత తండ్రితనయుల అన్యోన్యాన్వయమును సూచించును. వారిలో పరస్పరసంబంధము ఎక్కువగా నుండునేని, అనగా తండ్రులెల్లరు తమకుసమానమైన యెత్తు గలిగిన వారిని గన్నచో అప్పుడాగీత క' ఖ' వలె మూలకు మూలనుండును. ఈరెండు ఏటవాలుగీతలును (క' ఖ'— క. ఖ.) చదరము మధ్యనుండు 'ఒ'. గుండా పోవుచున్నవి. క' ఒ. చ-కోణముయొక్క "ట్యాంజెంటు" (Tangent) తండ్రితనయుల యన్యోన్యాన్వయమును సూచించు సంఖ్యగా దీసికొనవచ్చును. ఇచ్చట క', ఒ. చ. కోణము ౪౫ డిగ్రీలున్నది. ౪౫ డిగ్రీల ట్యాంజెంటు. అనగా ఈ విషయమున తండ్రి తనయులకుగల Coefficient of correlation. అనగా వారిలో పరస్పరసంబంధము ఎక్కువగానున్నదని భావము. వారిలో నిట్టిసంబంధమే లేక తండ్రులయెత్తు ఎటుబోయినను, తనయులెల్లరు జనసమ్మర్దానుగుణముగ సరాసరి ఎత్తగు ౬౮ అంగుళములవారుగనే యుండుచో క. ఖ. గీత చ. జ. తో కలిసిపోయి క. ఒ. చ. కోణము అనుస్వారమై తండ్రి తనయుల పరస్పరసంబంధము (Coefficient of correlation) పూర్ణానుస్వారమగును. పియర్సన్ గారి లెక్కలనుబట్టి నాల్గవచిత్రమున వ్రాసిన చదరములోని క. ఖ. చ. కోణముయొక్క ట్యాంజెంటు ఇచ్చట నిర్దేశించిన తండ్రి తనయుల అన్యోన్యాన్వయమును సూచించును. ఈ విధముగ పియర్సన్ గారుచేసిన పరిశోధనలు వృక్షములయందు, మనుష్యులయందు, తక్కిన జంతుజాలములయందు గల పరస్పరసంబంధము (Coefficient of correlation) ౪౮ అని తేలినది. అనగా ఏబదిమంది సమాన పరిమాణముగలిగి తక్కిన ఏబదిమంది చల్లాసగటుగ పొడుగువారు, పొట్టివారుగనుందురు. ఒకనూర్గురు తండ్రులు వేయిమంది తనయుల గన్నచో, వారిలోను తమతండ్రులలో వలె ఇంచుమించుగ ౫౦౦ మంది సమానపరిమాణముగనుండి, తక్కినవారిలో నెట్టి పరస్పరసంబంధము లేనివారుగ నుందురని భావము. గాల్టన్ గారి ప్రథమధర్మమును పియర్సన్ గారి పరిశోధన యెంత రూఢిపఱచుచున్నదో పాఠకులు గమనింతురుగాక.

గాల్టన్ గారి రెండవసూత్రము పైతృకబాంధవ్యమును నిర్వచించును. (Law of ancestral inheritance) చాలయెడల తనయులు ఆకారములోను, స్వభావమునందును, శక్తిసామర్థ్యములయందును తమ తల్లిదండ్రులను సంపూర్ణముగ పోలియుండరు. ఎందైనను గొంతభేద ముండియే తీరును. జననీజనకులలో లేని

చిత్రము 6



పైతృకబాంధవ్యము
Ancestral inheritance.

చతురములు స్త్రీలను, వలయములు పురుషులను సూచించును. తన తాతముత్తాతలగుణములు రామన్న కెట్లు చెందునో యాతనిపై వంశవృక్షము తెలుపును. ఒకానొక గుణవిశేషము పిల్లలయందు పొడసూపవచ్చును; లేదా వారిలోనుండున వేపైనను పుత్రుల యందు మరుగుపడిపోవచ్చును. "అమ్మా! వీనిచేష్టలు, మాటలు అచ్చము వీనితాతను జ్ఞాపకమునకు దెచ్చుచున్నాడే" అని మనుమణ్ణి జూచి ముసలమ్మ ముక్కుమీద వ్రేలు పెట్టుకొనుచుండుటను మనము చూచియేయుందుము. దీనికి కారణము గాల్టనుగారు ఈ క్రింద విధముగ వివరించిరి.

రామన్నయందు గన్పడు కొన్ని గుణములు తన మాతాపితలవి. వీరియందు లేని మరికొన్ని రామన్నలో స్పష్టముగా కానవచ్చునవి వాని తాతముత్తాతలయందుండి యుండును. ఇదేవిధముగ రామన్న వంశవృక్షమును పరీక్షించుచుబోయినచో ఆతని కందరు పూర్వీకులుండిరో వారందరిలోని గుణములన్నియుగాని, కొన్ని గాని యాతనియందు మూర్తీభవించియుండును. (గాంచుము చిత్రము ౬) ప్రకృతియందలి యీ సంఘటనను నిర్వచించు సూత్రము పైతృక బాంధవ్యసూత్ర మనబడును.

(Law of ancestral heredity — Inheritance is a mosaic of ancestral contributions. Ancestors cannot be obliterated. Blood does tell. This is Galton's law of ancestral inheritance which is clearly bound up with the law of filial regression.)

పై చెప్పిన ధర్మద్వయమును (పుత్రయోగ్య ప్రత్యావర్తనము — పైతృక బాంధవ్యము; Law of filial regression concerned with levelling in nature and the Law of ancestral inheritance concerned with the persistance of ancestral characteristics) గాల్టనుగారి ౧౮౯౭ ఆంగ్లేయ న్యాయమూర్తులయొక్క రెండువందల సంవత్సరముల వంశచరిత్రాన్వేషణము మరింత స్పష్టపరచును. వినుతికెక్కిన యీ నూటతొమ్మండ్రు న్యాయమూర్తుల పూర్వీకులలో నూటికి ౨౬ మంది నాసికెక్కిన తండ్రులు, ౭౪ మంది వినుతికెక్కిన తాతలు, ౫ మంది (అనగా ఇరువదిమందికి ఒక్కరు) కీర్తివంతులగు ముత్తాతలు. ఈ నూటతొమ్మండ్రుగుర సంతానమునందు నూటికి ౩౬ గురు కొడుకులు, ౯ మంది మనుమలును, ౧.౫ మంది మునిమనుమలును యశోవంతులైరి (చూడుడు. చిత్రము ౭). ఇతరవంశములలో నొనర్చిన యీ పరిశోధన పర్యవసానముగ నిదేవిషయము బయల్పడెను.

ప్రకృతియందుల్లసిల్లుచుండు ఆపదలలోనుండు ప్రపంచాభివృద్ధికి భంగకరమగు ఈ రెండు ధర్మములను మనము ధిక్కరించుటకు వీలులేదా? అస్పృష్టదేశమున నేడు మన ఆంధ్రదేశమున శక్తిమంతులు, మేధావంతులు, శాస్త్రవిశారదులు మాటవరుసకు నూర్గురున్నారనుకొనుడు. వారివలెనే సర్వోత్కృష్టులుగానుండు సంతానమును వారివలన బడయుట సుసాధ్యమా? అట్లుచో అల్పకాలములోననే ఆంధ్రప్రతిభ తెలంగాణమంతయు ప్రాకరించి, ఆంధ్రులు అప్రతిహత ప్రభావులని వాసికెక్కుదురు.

చిత్రము 7



అ. గాల్టన్‌గారి ౧౮౯౭ గురు న్యాయమార్గము

**వారిసంతతిలో యశఃకాములైనవారు**

తండ్రులు—త. ౩: మూడవ తరము ౧౦౦కి ౨౬ గురు
తాతలు—త. ౨: రెండవతరము ౧౦౦ కి ౮౪ మంది
ముత్తాతలు—త. ౧: మొదటితరము ౧౦౦ కి ౪

**వారి పూర్వులలో ప్రఖ్యాతిగడించినవారు**

తనయులు—సం॥ మొదటి సంతతి ౧౦౦ కి ౩౬ గురు
మనుమలు—సం॥ ౨: రెండవసంతతి ౧౦౦ కి ౯ మంది
మునిమనుమలు—సం॥౩: ౩వ సంతతి ౧౦౦కి ౧౪ మంది

(సశేషము)

# భారతీయ చిత్రకళ

గ్రంథకర్త: తలిశెట్టి రామారావుగారు, బి, ఏ., బి. యల్.,

ప్రాచీనకాలమునుండి భారతదేశమున చిత్రకళ పొందుచువచ్చిన మార్పులు, అభివృద్ధి మొదలయిన విషయములు, హైందవ చిత్రలేఖనోదయము, బౌద్ధకాలమునాటి చిత్రకళ, అజంతవిధానము, బాఘ్‌విహారములందలి చిత్రకళ, మొగలు చిత్రకళావిధానము, రాజపుత్ర చిత్రములపై ఖరి, నేటిచిత్రములు మొదలయినవానిని గూర్చిన చరిత్రాదులు వివరముగా నీ గ్రంథమున చర్చింపబడినవి. ఆయాకాలపు చిత్రవిధానమును దెలుపునట్టి త్రివర్ణ-ఏకవర్ణచిత్రములు నలువది ఇందు గలవు. చిత్రకారులు, చిత్రకళాజిజ్ఞాసువులు, చిత్ర కళాభిమానులు నగు నాంధ్రులెల్లరు తప్పక చదువవలసిన గ్రంథము.

వెల. రు. ౧-౧-౦.

మేనేజరు, **ఆంధ్రగ్రంథమాల**, నెం. ౭, తంబుచెట్టివీధి, మదరాసు.

# సోవియటు రష్యానుగూర్చిన కొన్ని అపోహాలు

దిగవల్లి వేంకటశివరావు

సోవియటు రష్యా ప్రభుత్వమునుగూర్చి విపరీతముగా చెప్పుకొను సంగతులు యీవి: క్రైస్తవ మతమును రూపుమాపి ప్రజలను నాస్తికులుగ జేసినారని, వ్రయివేటుఆస్తిని తీసివేసి ప్రజలకు ‘నా’ అనునది లేకుండ జేసినారని, వివాహ సంబంధము త్రెంపివేసి స్త్రీ పురుషులను అవినీతిపరులుగ జేసినారని. రష్యాదేశవాసులు పూర్వము క్రైస్తవమతస్థులు. నేడు వారు సంఘసామ్యవాదులగు “సోవియటు” మతస్థులు. ఆస్తికత అనునది ప్రతిజీవికిని సహజమైన గుణము కాదనియు, అది తెచ్చిపెట్టుకొనిన నమ్మకమనియు “బోల్షివిక్కు”ల యూహ. ముఖ్యముగా క్రైస్తవమతము సాంఘికవాదమునకు బలవద్విరోధి యనియు, అది ప్రజలకు వినమ్రతను బోధించి ప్రజలు తామున్నస్థితిలో నుండునట్లు చేయుచు, అంతకన్న శ్రేష్ఠతర జీవనవిధానముకొరకు పోరాడు కాంక్షను చంపివేసినదనియు, స్వర్గలోక సౌఖ్యము లేవో కలవనుట వలన ప్రజలు ఇహలోకమున ఎన్నో బాధలను సహించుచుందురనియు, దయను వలన మనుజులను సజ్జనులుగ జేయ ప్రయత్నించునుగాని బలవంతులు బలహీనులను కొల్లగొనుటను నివారింపలేకపోయినదనియు, అది కేవలము ఊహలనే కల్పించినదిగాని సాంఘికాచరణ విధానములను గల్పింపలేకపోయినదనియు, సర్వమానవ సౌభ్రాతృత్వ సిద్ధాంతములను బోధించినదేకాని నిజముగా నవి సాంఘిక తారతమ్యములకు, జాతివిద్వేషములకును గారణభూత మైనవనియు “సోవియటు” సామ్యవాదులు చెప్పెదరు.

మానవుల నాకర్షించు సౌందర్యము, మానవుని గొప్పదనమును, ఆధిక్యమును ప్రకటించు సందర్భములు, గుంపుగా జీవించు సాంఘికగుణము, జీవితరహస్యమును, సృష్టి రహస్యమును కనిపెట్టు ప్రయత్నము మతము యొక్క ఆచార వ్యవహారములందు కనబడుచున్నందున ఇందుకు ప్రత్యామ్నాయములగు ఊహలను, ఆచారములను, సంస్థలను బోల్షివిక్కులు కల్పింప సమకట్టినారు. మతము నిలిచియుండుటకు గల హేతువులను, అది ప్రజలకు ఐహికముగగాని, పారమార్థికముగగాని, మానసికముగగాని, ఏవిధముగగాని ఉపకరించుటకు గల స్వల్పపుటవకాశములను పెల్లగించివేసి దానిని నిరుపయోగమును నిర్వీర్యమును నిస్సారమును నగు పిచ్చి నమ్మకముగను గనపడునట్లుచేయ సంకల్పించినారు. శాస్త్రవిజ్ఞానమును వ్యాపింపజేసియు, ఉపయోగించియు, కళావిలసనమును వర్ధిల్లజేసియు, నీతిని ఆచరణలో పెట్టించియు, కలిసి కట్టుతనమును పెంపొందింపజేసియు, ‘పరోపకారార్థ మిదం శరీరం’మ్మను పరమధర్మమును సంఘసేవరూపముగా ఆచరణలో పెట్టియు, మతమునందలి పరమధర్మములెల్ల మతముపేరు లేకుండా ప్రజలచే ఆచరింపజేసియు రష్యాలో మతమునకు ఊరుపేరు లేకుండ జేయదలచినారు. మతముయొక్క మాయాజాలమును ప్రకృతిశాస్త్ర విజ్ఞానముయొక్క సాహాయ్యమున ఖండించివేయ దలచినారు. బైబిలులోని దేవుని సృష్టి విధానమును, దైవారాధనను, మతమును విమర్శించి ఖండించుచున్నారు. జీవిత రహస్యమును, దాని ఉత్పత్తిక్రమమును, పరమార్థమును తెలుపగల సాధనము ప్రకృతి శాస్త్రవిజ్ఞానమే యని వారి నిశ్చితాభిప్రాయము. అందువలన సులభశైలిలో వ్రాయబడిన శాస్త్రీయకరపత్రములను అసంఖ్యాకములుగా అచ్చొత్తించి వెదజల్లుచున్నారు. అభినవ రష్యాలో శాస్త్రవిజ్ఞాన మను పదము దైవ మను పదముకన్నను, మతమను మాటకన్నను పవిత్రమైనదిగా పరిగణింపబడుచున్నది.

రష్యావారికి నీతి యొక పరమధర్మముగానున్నది. ఒక మనుష్యుడింకొకనికి అన్యాయము చేయకపోవుట

లోనే ఈనీతి యిమిడియున్నది. అందువలన ఒకవ్యాపారములో లాభముదీయుట అనునది అవినీతియనియే వారి యూహ. ఒక డింకొకనిని అన్యాయముచేయకుండ లాభము కలుగనేరదు గనుక లాభముదీయుట అవినీతికరముగ వారు తలంతురు అట్లే లాభము నార్జించుట కుపయోగించు సొంతఆస్తిని కలిగియుండుటయు అవినీతికరమే. అట్లే వడ్డీకివేసి ధనము పెంచుటయు. ఇక స్త్రీ పురుష సంబంధములందు ఇతరప్రపంచములో విధింపబడు నీతినియమములను పెక్కింటిని రష్యావారు తృణీకరింతురు గాని విచ్చలవిడియగు స్త్రీ పురుషుల సాంగత్యమును వారు నిషేధింతురు. పూర్వకాలమున రష్యాలో కొల్లలుగానుండిన వ్యభిచారగృహము లెల్ల నేడు నిషేధింపబడినవి. త్రాగుట, జూదమాడుట, పొగబీల్చుటయు అవినీతికరములగు పనులుగా వారు తలంపక పోయినను ఈదురభ్యాసములను మాన్పుటకు వారు గొప్ప ప్రయత్నములు చేయుచున్నారు. వారిలో పాశ్చాత్య నృత్యము (డాన్సు)లు కూడా నిషేధించువారు కొందరు గలరు. ఇంటిలో దేవతాప్రతిమలను అలంకరించుకొను పద్ధతిపోయి, జాతీయనాయకుల పటములను పెట్టుకొనుట వచ్చినది.

క్రయిస్తవ మతాచారములందు ప్రజల నాకర్షించు వాద్యములకును, మేళతాళములు సంగీతములు గల ఉత్సవములకును బదులుగా నేడు సోవియటు ఉత్సవములు అవతరించినవి. క్రయిస్తవ దేవాలయములందు మనోహరగానములలో వినబడు దైవభక్తిగీతములకు బదులుగా విప్లవముకొరకు శ్రమపడుటను గూర్చినట్టియు, త్యాగముచేయుటనుగూర్చినట్టియు వీరగీతములుగల మనోహరగానముల నేర్పరచినారు. క్రయిస్తవ దేవాలయములందు వైభవముగా జరుపబడు నామకరణ మహోత్సవములు, వివాహములు, అపరకర్మలు బయటనే సోవియటురయితుల ఇండ్లయందును, కార్మికుల నివాసములందును ప్రభుత్వమే జరిపించును.

గ్రామములందును, పట్టణములందును నెలకొల్పబడిన 'క్లబ్బుహౌసు' లనబడు క్రీడామందిరములు ప్రజలకు ఆనందము కలిగించుటకు తోడ్పడుచున్నవి. ప్రతిసంఘమునకు, కర్మాగారమునకు ఒక క్రీడామందిర ముండును. మనోహరములగు చిత్తరువులతోను, జెండాలతోను అలంకరింపబడును. సంగీతకచ్చేరీలు, నాటకప్రదర్శనములు జరుగుటకు విశాలవేదిక లమర్పబడియుండును. మిత్రు లచ్చటజేరి సంభాషణలు, ఉపన్యాసములు, చర్చలు జరుపుకొందురు; పుస్తకములు చదువుచుందురు; చదివి వినిపించుకొందురు.

సంఘవిప్లవమునందు వర్ధిల్లిన విశేషములలో సంఘసేవ యొకటి. వైద్యుడు, ఉపాధ్యాయుడు, ఇంజనీరు, వ్యవసాయశాస్త్రవేత్త, కమ్మరి, వంటకత్తె అందరును ప్రజాసేవయొక్క పరమార్థమును గ్రహించి పని చేయవలెను.

మానవసేవయే ఈశ్వరసేవయైనచో నది చేయుచున్న రష్యాసోవియటుప్రజలు నాస్తికు లెట్లగుదురు? భగవంతు డున్నాడా, లేడా యని బుద్ధభగవానుని ఎవ రెన్నిమారులడిగినను ఆయన ప్రత్యుత్తరము చెప్పకుండుటచూచి ఆమహామహుని కొందరు నాస్తికు డనిరట. అయితే తత్వమెఱిగిన బుద్ధిమంతులు భగవంతుడనువా డొక్కడనో లేడనియు, సర్వవ్యాపియనియు, ఏజీవికి మేలొనరించినను ఆసేవ నాతడు గ్రహించుననియే దీని పరమార్థమనియు సరిపెట్టుకొనిరి.

సామ్యవాదముయొక్క మూలసూత్రము వ్యక్తుల 'ప్రయివేటు' ఆస్తి, సొంతహక్కులయొక్క నిర్మూలనము. సొంత ఆస్తి అనగా అర్థోత్పత్తియొక్క సాధనసంపత్తి. సంఘము సంపాదించిన ఫలితము ననుభవించకుండా సామ్యవాద మెవరిని నిషేధించదు. అనగా కొన్ని విధములగు సొంతఆస్తిని వ్యక్తు లార్జించవచ్చును. ఉదాహరణమునకు, కట్టుబట్టలు, ఒకఇల్లు, ఒకతోట, ఒకచిన్నచేను, సొంతఉపయోగముకొరకు సంపాదించుకొనవచ్చును, చదువుకొనుటకు పుస్తకములుకొనియుంచుకొనవచ్చును. శీతకాలములో ఉపయోగించుకొనుటకు ఆహారసామగ్రిని నిలువజేసికొనవచ్చును; అయితే దానిని స్వయముగా ఉపయోగించుకొనవలె

యునేకాని అమ్ముకొని లాభ మార్జింపరాదు. నిజముగా లాభముకొరకు ఉపయోగించి హెచ్చుఆస్తిని సంపాదించుట కుపయోగింపబడు ఆస్తిహక్కులనే సామ్యవాదులు నిషేధించుచున్నారు. ఆస్తిని స్వయముగా అనుభవించు అనుభవదారులుగాక దానిని అరికట్టియుంచి కూడబెట్టుకొని జీవించు మధ్యరకపు 'ఆస్తిదారులు' పోవలెను. అర్థోత్పత్తి మార్గములందేకాదు, దాని విభాగమునందు, సరకులనమ్ముటలోను, చిల్లర, టోకువ్యాపారములందునుగూడ ఈ సూత్రము గమనింపబడుచున్నది. అనగా సొంతఆస్తి పెట్టుబడిదారుల మూలధనపుటాస్తిగా మారుట కెట్టి యవకాశములు నుండరాదని యభిప్రాయము.

నిజముగా మూలధనపుటాస్తియే ప్రపంచములోని తారతమ్యములకు, దారిద్ర్యములకు, అన్యాయములకు, వ్యభిచారమునకు, యుద్ధములకు కారణభూతమని వారి యభిప్రాయము. అత్యాశకు, ఓర్వలేమికి, అసహ్యమునకు, వైషమ్యములకు, అంతర్జాతీయకలహములకుగూడ నిదియే పుట్టినిల్లు.

బౌద్ధ, యూదీయ, క్రైస్తవమతములందు సొంత ఆస్తిని సంపాదించుటను వర్జించి, ఏదో యొకరకపు సామ్యవాద పద్ధతులప్రకారము సమష్టిగ జీవించు సంఘములు కొన్ని బయలుదేరినమాట నిజము. బౌద్ధయూదీయక్రైస్తవ సన్యాసుల మఠము లిట్టివే. అయితే కేవలము పరమార్థచింతతో ఏకొందఱో అట్లు జీవించిరిగాని నేటి సోవియటు రష్యాలోవలె నది జాతీయజీవిత విధానముగా ఆచరింపబడలేదు.

సొంత ఆస్తిలేని ఆదర్శస్థితి యొక్కమారుగనే రాదు గనుక, రష్యావారు 'నవీనార్థికనీతి' (న్యూఎకనామిక్ పాలసీ) నొకదాని నేర్పరచిరి. ఇది యొక మధ్యరకపు పంథా. అనగా సొంత ఆస్తిని కలిగియున్నవారిని ప్రస్తుతమునకు వా రున్నట్లుండనిత్తురుగాని అట్టివారి కిదివరకుండిన సాంఘిక గౌరవము, మర్యాదలు, రాజకీయహక్కులు మాత్ర ముండవు. బోల్షివిక్కు సామ్యవాదులు తమ యావచ్ఛక్తిని వినియోగించి, సొంతదారులకు ఒత్తిడి కలిగించి సొంత ఆస్తిని నిర్మూలించుచునే యుందురు. ఉదాహరణమునకు సాముదాయిక నిర్మాణసంస్థలపైనను, వ్యక్తిసంఘములపైనను విధింపబడు పన్నులలో చూపబడు తారతమ్య మందు చూడవచ్చును.

సాముదాయికసంస్థలకు అనేకములగు తగ్గింపు లుండును. ప్రభుత్వబ్యాంకులందు పరపతి యివ్వబడును. ముడివస్తువులు ముందుగా అందుబాటు చేయబడును. ప్రైవేటు వర్తకుని ఆదాయపుపన్ను వాని లాభములో చాలవరకు మ్రింగివేయును. కొద్ది ఆదాయముపైన చాలా తక్కువపన్నే యుండును. ఆదాయము పెరిగిన కొలదియు పన్ను పెక్కురెట్లు పెరిగిపోవును. ఉదాహరణమునకు వేయిరూబులుల *ఆదాయముపైన నూటికి మూడు వంతున పన్ను విధింపబడును. పదివేలపైన ఆదాయములో నాలుగవవంతు పన్ను విధింపబడును. ఇరువది నాలుగువేలపైన దానిలో మూడవవంతు పన్ను. అది దాటిన మొత్తముల విషయములో నూటికి ౫౮ వంతుల చొప్పున పన్ను వేయబడును!

అధికలాభములపైనపన్ను అనబడు నింకొక పన్నుకూడా ప్రైవేటువర్తకులపైన విధింపబడును. ఇది గాక అతనికి అద్దెకు ఇల్లుకూడ దొరకుట దుర్లభము. దొరకినను వాడు చాలా హెచ్చుబాడుగ నివ్వవలెను. అతనిపిల్లలు చదువుకొనుటకు పాఠశాలలందు చేర్చుకొనబడుటయు కష్టమే. చేర్చుకొనినచో హెచ్చుజీతము లివ్వవలెను. ఈవర్తకులు నియమితకాలములందే వ్యాపారము చేసికొనవలెను. నిబంధనలను మీరినవారు కఠినముగా దండింపబడుదురు. వీరు సైన్యమున చేరనందుకు కొంత పరిహార మిచ్చుకొనవలెను. ఒకవర్తకుడు చనిపోయినచో ఆస్తిపైన వారసత్వపుపన్ను విధింపబడి, దాని నింకను తగ్గించును. ఆస్తివిలువ అధికమైన కొలదియు పన్నుకూడ పెక్కురెట్లు పెరిగిపోవును. రెండువేల రూబులులపైన నూటికి రెండువంతులు. లక్షరూబులులపైన నూటికి ఏబదివంతులు. అదిదాటిన ఆస్తిలో నూటికి తొంబదివంతులు పన్ను గైకొనబడును.

* ఒక రూబులు రమారమి రు. ౧-౯-౩ అంచునును.

పైరికేటువర్తకులకు పారస్వత్వపుహక్కు లుండవు. ఇతరదేశములందువలె పరిపాలనమునందు వీరికి పలుకుబడి యుండకపోవుటతో పోవదు. అది అతనిని వెలివేసిన వానిస్థితికి దెచ్చును. పాఠశాలలందు ఖాళీయున్ననే వారిపిల్లలు చేర్చుకొనబడుదురు. చేర్చుకొనబడినను రుసుము లత్యధికముగా చెల్లించవలసియుండును. కాయకష్టముపడు కర్షకుడు, కార్మికుడు సదృష్టవంతులు. వారి కన్నియు లాభములే. తిండికి, బట్టకు లోపము లేదు. వారిపిల్లలకు విద్యయుచితము. వారికి ఆసుపత్రులలో వైద్యముచితము. వారికి అన్నిచోటులను మర్యాదయే. అన్ని సందర్భములందును అవకాశములే. ప్రతిచోటును వినోదశాలలందు, నాటకశాలలందు, క్లబ్బులందు, రేడియో శ్రవణమునందు, ఉపన్యాసములందు ప్రథమస్థానము. కర్షకులకు గ్రామసభలందు గొప్పపలుకుబడి.

పట్టణములందలి కార్మికులు సొంతఆస్తి లేనివారు, కేవలము కూలిపైన జీవించువారు. రష్యాలో గొప్ప పలుకుబడిగలవ్యక్తి కార్మిక సంఘములోని సభ్యుడు. ప్రభుత్వమునందు పలుకుబడిగలవాడు. రైతుకన్న విద్యావంతుడు. ధైర్యసాహసములు కలవాడు. అందువలన హెచ్చుసౌఖ్యములు పొందును. నిజమునకు పట్టణములందలి ఉద్యానవనములు, వినోదప్రదేశములు, నాటకశాలలు, సినీమాలుకూడా కార్మిక వ్యాపార సమితుల (Trade unions) చేతులలోనే యున్నందున కార్మికులకు ప్రత్యేకసౌకర్యము లుండును. విద్య, వైద్యము, కార్మికులకు అతిసులభము. (సోషల్ ఇన్షూరెన్సు) 'సంఘశ్రేయపు భీమా'వలన అతనికే యిబ్బంది వచ్చినను సుఖజీవనము జరుగుటకే లోపము నుండదు.

సామ్యవాది చాలా స్వార్థత్యాగిగా నుండవలెను. అతడు దేశముకొరకు, ప్రజలకొరకు సదా పాటుపడవలెను. అతడనేకకార్యముల నుచితముగా నిర్వహించుచుండవలెను. అతడు తనజీవితమున ఆడంబరముగాని, అనవసరపు ఖర్చులుగాని చేయరాదు. భోగములందు నిమగ్నుడు కాకూడదు. ఎల్లప్పుడు విప్లవరాజ్యమును సంరక్షించుటకు సిద్ధముగా నుండవలెను. సోవియటు రష్యాలో ఆర్థికముగను సాంఘికముగను స్త్రీలకు పురుషులతోపాటు సమానపుహక్కు లున్నవి. "స్త్రీలకు వేరు, పురుషులకు వేరు" అనుమాటయే లేదు. ప్రతి క్రీడాస్థలమందు క్లబ్బులోను స్త్రీ పురుషులకు సమానప్రవేశార్హత కలదు.

నేటిరష్యాలో స్త్రీపురుష సంబంధములందు సంపూర్ణమగు స్వేచ్ఛ కలదు. రష్యా ధర్మశాస్త్రములో వివాహితో రంకుతన మను నేరము లేదు. మఱియు వ్యభిచార మొకనిందగా పరిగణింపబడదు. అయితే విచ్చలవిడియగు వ్యభిచారముగాని, వ్యభిచార మందిరములుగాని ప్రభుత్వము సహింపదు. విప్లవ ప్రారంభదశలో కొన్నాళ్లు యువకులు ఒడలుతెలియక ప్రవర్తించినమాట నిజమేకాని ఇటీవల పరిస్థితులుమారి నిలుకడ యేర్పడినది. ప్రపంచము చెప్పుకొనునట్లు రష్యాలో ఉచ్చనీచములులేక వ్యభిచారము చెలరేగుచున్నదనుమాట అబద్ధము. స్త్రీపురుష సంబంధమనునది వివాహముద్వారానే యుండవలెనని రష్యావారు తలంపరు. ఇష్టమున్నచో తమపేళ్లను రిజస్టరు చేయించుకొని వివాహము చేసికొనవచ్చును; లేదా స్త్రీపురుషు లూరక కలిసి భార్యాభర్తలుగా కాపురము చేయవచ్చును. రిజస్టరువివాహము చేసుకొన్నవారు వివాహవిచ్ఛేదనము కూడా రిజస్టరు చేయించుకొనవలెను. ఊరక కాపురము చేయువారికి నియమము లేదు. ఏదియెట్లున్నను, స్త్రీపురుషులు తమబిడ్డలను నిరాధారముగా వదలివేయుటకు వీలు లేదు. స్త్రీపురుషులు ఉభయులుకూడా పిల్లలను భరించవలసినదే. ఇది యుపేక్షించినచో కోర్టువారే తగినట్లు ఏర్పాటుచేయుదురు. రష్యాలో స్త్రీపురుష సంబంధమును గూర్చియు, కామశాస్త్రమునుగూర్చియు, అందువలన సంభవించు సుఖవ్యాధులను గూర్చియు బహిరంగముగా ఉపన్యాసములు, సినీమాలు, ప్రదర్శనములు జరుగుచుండును. స్త్రీపురుషులెల్లరు వానిని చూచి విని మంచిచెడ్డలను గ్రహించుచుందురు. ఇందువలన నీతికి భంగము లేకపోగా విజ్ఞానము కలిగి బాగుపడుట తటస్థించుచున్నది.

# శాంతి సంస్థాపన

కపిల కాశీపతి

"శాంతములేక సౌఖ్యము లేదు"

మానవప్రకృతినిగురించి శ్రీత్యాగరాజస్వామి రచించిన కృతిపాదం పై వాక్యం. మానవప్రకృతివలెనే మానవనివాసమైన ప్రపంచంలోకూడా శాంతములేక సౌఖ్యము లేదు. నేటిప్రపంచంలో శాంతి లేదు. తత్కారణంగా సౌఖ్యం లేదు.

శాంతిఅనేది ఒకమానసికవైఖరి, వ్యక్తికైనాసరే, వ్యక్తులసమూహమైన సంఘానికైనా సరే. ఆమానసికవైఖరి ఇప్పుడు లేదు. కేవలం శాంతిఅనేది లేకపోతే అంత ఆలోచించవలసినపని లేదు. శాంతి లేకపోవడమేకాక అశాంతి ప్రబలివున్నది. ఈ అశాంతికి కారణం ఏమంటే శాంతి లేకపోవడమే నన్నాడొకపెద్దమనిషి. అశాంతి పోగొట్టి శాంతిస్థాపించడం నాగరికమానవులఆశయం. అన్నిదేశాలలోనూ రాజకీయవేత్తలప్రయత్నంకూడా అదే. జయాపజయాలు దైవాధీనం అంటారు. కాని ఈ విషయంలో దైవనంత ప్రమేయంలేదు. ఇవన్నీ మానవప్రేరితములైనవిషయాలు. కేవలం మానవాధీనమైన సంగతులు.

భయం! యుద్ధభయం! ఒకదేశంవచ్చి మరొకదేశంమీద పడుతుందని భయం! దేశాలమధ్య పరస్పరంఅపనమ్మకం. ఆకారణంవల్ల పరస్పరవైరం. "గాలిలో ఎగరడం నేర్చినాడు, సముద్రాలు దాటనేర్చినాడు, కాని మానవుడు మానవుడివలె నివసించడం మాత్రం నేర్చుకోలేదు" అన్నాడు రాధాకృష్ణపండితుడు.

అశాంతికీ, యుద్ధభయానికీ, ఆందోళనకీ ముఖ్యస్థానం యూరపుఖండం. యూరపు పాతప్రపంచం పెత్తందారు. పాతప్రపంచంఅంటే అమెరికాఖండాలు మినహా ఇతరదేశాలన్నమాట. ఆశియా, ఆఫ్రికాఖండాలదేశాలు తమవశంచేసుకుని, వారిపాడిపంటలు తమ సౌఖ్యంకోసం ఉపయోగించుకుంటూన్నాకూడా యూరపుదేశాల ఆకలిదప్పులు తీరలేదు.

యూరపుప్రజల మానసికవైఖరి ఈ అశాంతికి కారణం. ఆధ్యాత్మికదృష్టిలేమి, ఐహికసమస్యలు పరిష్కారంచేసుకోలేక పోతున్నారు. కానైతే అంతా క్రైస్తవులే. యూరపులో క్రైస్తవం పేరుమాత్రానికే. పందొమ్మిదివందల ముప్ఫైఆరుసంవత్సరాలక్రితం తోటిమానవుల అపరాధంకోసం శిలువమీద తనప్రాణాలు అర్పించిన ఏసుక్రీస్తుసందేశానికీ, యూరపులో వ్యావహారికంలోవున్న క్రైస్తవమతానికీ సంబంధం

లేదు. ఆధ్యాత్మికకారణాలు అటుంచి ఈ యుద్ధభయానికి ఐహికకారణాలు ఆలోచించినా చాలావున్నవి. అవేవీ మందులేని జాడ్యాలు కావు.

నూతనప్రపంచమైన అమెరికాఖండాలలో అంత అలజడి కానము. దక్షిణ అమెరికాలోవున్న రెండు చిన్నస్వతంత్ర దేశాలు, బొలీవియా, పెరుగ్వే దేశాలమధ్యతప్ప, ఈ మధ్యకాలంలో అమెరికాలో తగాదాలు లేవు. దానికి ముఖ్యకారణం ఉత్తరఅమెరికాలోవున్న సంయుక్తరాష్ట్రాలు. సంయుక్తరాష్ట్రాలు పదమూడు, ప్రత్యేకరాష్ట్రాలైనా, అవన్నీ కలిపి ఒక ఫెడరలు ప్రభుత్వంగా ఏర్పాటుచేసినారు. ఆవరకు ఆ రాష్ట్రాల నడుమకూడా తగాదాలు వుండేవి. కీర్తిశేషుడు అబ్రహాంలింకాలన్, ఫిలడల్ఫియా నగరంలో పెద్దసమావేశం ఏర్పాటుచేసి, ఆ మహాసభలో అమెరికా ఫెడరలురాజ్యాంగ విధానం నిర్ణయించినాడు. ఆ సత్కార్యం క్రొత్తప్రపంచశాంతికి ముఖ్యకారణం. ఫెడరలు రాజ్యాంగవిధానంలో రాష్ట్రాలన్నీ ప్రత్యేకమయినా, సమానహక్కులు కలవి. వాటి ఆంతరంగిక కలహాలు కేంద్రప్రభుత్వం పరిష్కరిస్తుంది.

సంయుక్తరాష్ట్రాల బలంవల్ల, ప్రోత్సాహంవల్ల, ఇతరఅమెరికారాజ్యాలకు శాంతి చేకూరింది. వెనకటికి మన్రోఅనే అధ్యక్షుడు వుండేవాడు. ఆయన అమెరికా ఖండాలలో వున్న రాజ్యప్రతినిధుల్ని అందర్నీ కూడగట్టుకుని ఒకసిద్ధాంతం ఏర్పర్చినాడు. అమెరికారాజ్యాల వ్యవహారాలతో యూరపు ప్రభుత్వాలుగాని, ఇతర ప్రభుత్వాలుగాని కలుగజేసుకోకూడదు అని నిర్ణయించినాడు. దానిపేరే మన్రోసిద్ధాంతం. అమెరికా సంయుక్తరాష్ట్రాలు బలమైనప్రభుత్వం. తక్కిన చిన్నరాజ్యాలన్నీ ఆ ప్రభుత్వం తీసినదారి తొక్కడానికి సందేహించలేదు. అల్లా చెయ్యడంవల్ల వారికి లాభమేగాని నష్టం కలుగలేదు. చాలావరకు దక్షిణఅమెరికాలో వున్న చిన్నచిన్న ప్రజానిరంకుశప్రభుత్వాలు అంతర్జాతీయ సమితిలో సభ్యరాండ్రైనా, అమెరికావ్యవహారాలలో వారికట్టుబాటు అతిక్రమించలేదు. అమెరికా మొన్న అబిసీనియా యుద్ధసమయంలో కూడా జోక్యం కలిగించుకోలేదు. ఆ వైఖరే అమెరికా ఖండాలలో శాంతికి కారణం.

ప్రాచ్యప్రపంచంలోకూడా శాంతికావాలంటే ఈమన్రోసిద్ధాంతం అక్కడ అమలు పెట్టాలని జపానువాదన. తూర్పున తాను పెద్దప్రభుత్వంకాబట్టి, అక్కడ శాంతిసంరక్షణ తనకర్తవ్యం అంటుంది జపాను. అది యూరపుప్రభుత్వాలు అంగీకరించవు. చీనాలో జపాను వైఖరిలోవున్న న్యాయాన్యాయాలు అటుంచితే, అక్కడ అశాంతికి ఈ యూరపుప్రభుత్వాల అనవసర ప్రమేయమే కారణం. అమెరికా సంయుక్తరాష్ట్రాలప్రభుత్వం తన పలుకుబడివల్ల ఉత్తర

# కంచి చిత్రములు ౭

S. S. S.



౧. వరదరాజస్వామి దేవాలయమువద్ద ౯౬ కాళ్ల మండపమునందలి
ఒకానొకస్తంభమునగల శిల్పము



౨. వరదరాజస్వామి దేవాలయము ముందు నాలుగు కాళ్ల
మండపము. ఎగువ నాలుగుమూలల రాతిగొలుసులు వ్రేలాడుచున్నవి



3. ఏకామ్రేశ్వరాలయ తీర్థము



౪. వరదరాజస్వామి దేవాలయము, తీర్థము

దక్షిణ అమెరికాఖండాలలో ఏ విధంగా శాంతి సంరక్షిస్తున్నదో ఆవిధంగానే చేస్తానంటుంది జపాను. దూరాలోచనో, దురాలోచనో కాలం నిర్ణయించాలి. ఈనాడు అమెరికాలో రూజువెల్టుఅధ్యక్షుడి అధ్వర్యాన కింద అమెరికాప్రభుత్వాల సహకారోద్యమం బలపర్చడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. ఆప్రయత్నం కొనసాగితే కొత్తప్రపంచంలో శాంతినిర్మాణానికి బలమైన కొత్తపునాది పడుతుంది.

యూరపుఖండంలో అశాంతికి కారణం ఈసహకారలోపమే. యూరపుఖండపు వైశాల్యం 3,750,000 చదరపుమైళ్లు. జనసంఖ్య 475,000,000. వైశాల్యానికి జనసమృద్ధి ఎక్కువే చీనా, ఇండియా అంత కాకపోయినా. యూరపుఅనే చిన్నభూభాగంలో ఇరవయిఆరు స్వతంత్రరాజ్యాలు వున్నవి. వీటిలోవీటికి అనేకజాతిసామంతాద విరోధాలు. వేరు భాషలు, వేరుసంప్రదాయాలు.

అమెరికాసంయుక్తరాష్ట్రాలలో భాష ఇంగ్లీషు. కొంచెం హెచ్చుతగ్గు జాతిఅంతా ఒకటే. అదివరకు కొద్దిగా వేరుజాతుల మిశ్రమం వున్నా, బ్రిటిషుప్రభుత్వానికి వ్యతిరేకంగా అమెరికా స్వాతంత్ర్యయుద్ధం చేసినప్పుడు అంతా కలిసిపోయినారు. జాతీయైక్యత దానిఫలితం.

యూరపులో అల్లా కాదు. జాతులు భేదం, భాషలుభేదం, నాగరికత భేదం. వీటికి తోడు యూరపుచరిత్ర యుద్ధచరిత్ర. అనాది నుంచీ ఒకటేయుద్ధాలు, ఒకటే కొట్లాటలు. ద్వేషక్రోధాలు, నూతనఆవేశాలు, విరుద్ధ ఆశయాలు.

వీటికితోడు యూరపుమహాయుద్ధానంతరం "స్వయంనిర్ణయసూత్రం" అని ఒకసిద్ధాంతం అమలులోకి తెచ్చినాడు అమెరికా అధ్యక్షుడు విల్సను. అమెరికా ప్రజాప్రభుత్వం. తక్కిన ప్రజాప్రభుత్వాలన్నీ విల్సను సిద్ధాంతం మంచిదేనన్నారు. ఈ సూత్రం వర్సెయిల్సు సంధిపరతులలో ఇమిడేసరికి యూరపులో ఇదివరకున్న సందొమ్మిదిరాజ్యాలల్లా ఇరవయిఆరైపోయినవి. ఈరాజ్యాల హక్కులూ, బాధ్యతలూ సరిచూడడానికి ఏర్పాటుచేసిన అంతర్జాతీయసమితి అణగారిపోయింది. యూరపులో అంతర్జాతీయసహకారం అంతరించింది. యూరపులో శాంతి కావాలంటే ఈ ౨౬ ప్రభుత్వాలూ కలిపి ఒకయూరపుసంయుక్తరాష్ట్రాల ఫెడరలుప్రభుత్వం స్థాపించాలి. జాతిసమితితోపాటు ఆ ఆశకూడా పోయింది. ఈ మధ్యకాలంలో అటువంటి శాశ్వతశాంతినిర్మాణం యూరపులో జరగబోదు. కారణం, యూరపుదేశాలు దానికి సిద్ధంగా లేకపోవటం. సున్నంలేకుండా ఇటికగోడ నిలవదు. సహకారభావం లేనిదే అంతర్జాతీయసంస్థలు నిలవవు. సహకారభావం అనే సున్నంలేని యూరపురాజ్యాల ఇటికలనిర్మాణం కూలిపోయింది.

మరి వెంటనే యుద్ధం వస్తుందా అంటే చెప్పడం కష్టం. ఈతరంలోగాని యుద్ధం ఆపాలంటే ఇంకోఉపాయం పన్నడం అవసరం. ఆ ఉపాయం పూర్వంవున్న కొన్ని ఒడంబడికలు మారిస్తేనేకాని కొనసాగదు. ప్రస్తుత ఆర్థికపరిస్థితులు మారిస్తేనేకాని లాభించదు. ఈ రెండూ మారితేనేకాని శాంతి లభించదు. అవి మార్చడానికే యుద్ధం జరిగితే జరగాలి. యుద్ధం లేకుండా ఆమార్పు కలుగజెయ్యడమే ఆ కొత్తఉపాయం.

పందొమ్మిదివందల ఇరవయ్యోసంవత్సరంమొదలు యూరపుశాంతి ఫ్రాన్సుబలం వల్లా, ఫ్రాన్సుస్నేహబృందంఅయిన పోలెండు, రుమేనియా, జెకోస్లొవేకియా, యుగోస్లేవియా రాజ్యాల సహకారబలంమీదా ఆధారపడివున్నది. వెర్సైయిల్సు సంధిషరతులు కారణంగా జర్మనీయుద్ధబలం పోయింది, కాలనీలు పోయినవి, రాజ్యభాగాలు పోయినవి. యుద్ధంవచ్చినా ఫ్రాన్సుకీ, ఫ్రాన్సుస్నేహబృందానికీ కలిసి గెలిచేంతసదుపాయం వున్నది. యుద్ధంతర్వాత ఇటలీకికూడా ఏమీ వలసరాజ్యాలు లేకుండాపోయినవి. అంతర్జాతీయసమితి స్థాపించి ఈపరిస్థితులు వున్నవి వున్నట్టుగా మారకుండా కాపాడాలని ఫ్రాన్సు ప్రయత్నించింది. బ్రిటను, బెల్జియం మొదలైన దేశాలు అంగీకరించినవి. వెర్సైయిల్సులో యూరపుపటం శాశ్వతంగా చెక్కి పారవేశాంగదా ఇక ఫరవాలేదనుకున్నారు రాజకీయవేత్తలు. మార్పు అనేది ప్రకృతినైజం. ఆ మార్పు లేకుండా యూరపు రాజ్యాల విస్తీర్ణం అరికట్టుదామని ప్రయత్నించిన ప్రభుత్వాలు ప్రకృతివిరుద్ధమైన పనులు చేసినవి. ఆఖరికి సహజంగా ప్రకృతే విజయంపొందింది. సమితిచట్రంలోనే క్రమేణా ఆమార్పుకి అవకాశం ఇస్తే సమితి చచ్చేదికాదు. ఆకలిగావున్న జంతువుకిగాని, మనిషికిగాని ఎరవెయ్యడం అవసరం. మరీ కడుపుమాడిస్తే తిరగబడడం సంభవిస్తుంది. రాజకీయవిప్లవాలకు పుట్టి ఉపన్యాసాలూ, ఉత్సాహమూ కారణంకాదు. ఆకలి విప్లవానికి కారణం. జర్మనీ, జపాను, ఇటలీదేశాల ఆకలి సమితిఆవరణంలో తీరలేదు. అందువల్లనే జర్మనీ, జపానుదేశాలు తిరగబడ్డవి ఇటలీ దొంగగడ్డి మేసింది. సమితిచట్రం మరికొంచెం వదులుచేస్తే అసలుకే మోసం వచ్చేదికాదు. ఉన్నవి వున్నట్టుగా వుండడానికి పైదేశాలు అంగీకరించేవి, కొంతవరకు కాకపోతే కొంతవరకైనా.

అంతర్జాతీయసమితిగాని, ప్రభుత్వాలుగాని కేవలం భీష్మించుకొని కూర్చోలేదు. కొంతవరకు మొగ్గినారుకాని, అందులో చాలాపిసినిగొట్టుతనం చూపించినారు. అన్యాయంగా యుద్ధంచేసింది కాబట్టి జర్మనీ ఇతరదేశాలకు అపరాధంకింద కొంతసొమ్ము కట్టాలన్నారు. అందులో కొంతసులువు చూపించినారు. అది జర్మనీమీద దయచేత కాదు, వేరేమార్గంలేక. యుద్ధఋణాలు చెల్లించడానికి వాయిదాలివ్వడం, ఇంకా

ఇతరసదుపాయాలు చెయ్యడం జరిగినవి. రైనునదీప్రాంతం ఫ్రెంచివారిఆక్రమణలోంచి తీసేసినారు. ఏంచేసినా ఇవన్నీ పైపూతలు. అసలుజాడ్యానికి సరియైనమందు వెయ్యలేదు. వెయ్యడానికి ప్రయత్నించలేదు.

సరిహద్దులు తిరిగీ నిర్ణయించడానికి ప్రయత్నించలేదు, ఆస్ట్రియాభావిపరిస్థితులు ఎల్లావుండాలో నిర్ణయించలేదు, పూర్వం జర్మనీకిందవుండి, నేడు అంతర్జాతీయసమితి పరిపాలనకిందవున్న డాంజిగ్ సమస్య పరిష్కారంచెయ్యలేదు, మెమెలు మొదలైన ఇతరసమస్యలు తర్కించలేదు, జర్మనీకి ఆయుధనిర్మాణంలో ఇతరులతోపాటు సమాసహక్కు ఇవ్వలేదు.

జర్మనీకి కలిగిన ఈ అవమానం, ఈ దౌర్జన్యం పోగొట్టి ప్రతిక్రియచెయ్యడానికే హిట్లరు నాయకత్వంకింద జర్మను జాతీయ సామ్యవాదోద్యమం స్థాపించబడినది. ఈ పార్టీ అధికారంలోకి రాగానే, జర్మనీ తన షరతులు అతిక్రమించి తనహక్కులు సంపాదించుకున్నది. వెర్సెయిల్సు సంధిషరతుల ప్రకారం జర్మనీలో నిర్బంధసైనికశిక్షణ శాసనం ఉండకూడదు. హిట్లరునియంత ఆ శాసనం అమలుపెట్టినాడు. వెర్సెయిల్సు సంధిప్రకారం జర్మనీకి వాయుబలం వుండకూడదు. హిట్లరు విపరీతమైన వాయుబలం నిర్మించినాడు. లొకార్నో ఒడంబడికప్రకారం రైనునదీతీరంఅటూఇటూకూడా సైన్యాలు వుండకూడదు. సైనికస్థానాలు వుండకూడదు. హిట్లరు ఆ షరతుకూడా అతిక్రమించినాడు.

ఈ షరతులన్నీ అతిక్రమించకుండా కట్టుబట్టంగా వుంచాలనే ప్రభుత్వాలకు చెయ్యగలిగిన ప్రతిక్రియ ఒకటే. ఫ్రెంచివారి "సంఘిజాస్యా" వృద్ధిచెయ్యడమే. ఫ్రెంచిప్రభుత్వానికి సాధులన్నా, ఒడంబడికలన్నా అతిప్రీతి. ఆకారణంవల్ల జర్మనీకి వ్యతిరేకంగా ఇరుగు పొరుగు ప్రభుత్వాలతో సంధులు చేసుకున్నది. జర్మనుసేనలు రైను ప్రాంతం ఆక్రమించడానికి ఫ్రాన్సు రష్యాతో పరస్పర సహాయంకోసం చేసుకున్న ఒడంబడికే కారణం. ఈ సంధిప్రయత్నాలవల్ల బలం వృద్ధిచేసుకోవాలన్నట్టయితే ఫ్రాన్సు ఇటలీతో సఖ్యత చేసుకోవాలి. చేసుకుని జర్మనీసరిహద్దులు అన్నివేపులా కాపలా కాయాలి. తూర్పునా ఉత్తరానా, తూర్పునా జర్మనీని అరికట్టడానికి ఫ్రాన్సుకీ, రష్యాకీ ఒడంబడిక వుండాలి. రష్యా జెకోస్లావేకియాతోకూడా ఒడంబడిక చేసుకుని ఫ్రాన్సుకి, జర్మనీకి వ్యతిరేకంగా సహాయం చెయ్యాలి.

ప్రస్తుతంవున్న సరిహద్దులు అన్యాయమనీ, అవి మార్చాలనీ పోట్లాడే దేశాలు యూరపులో మూడు. జర్మనీ, హంగేరీ, బల్గేరియా. ఈమూడుదేశాల సరిహద్దులే ఇరుకు చేసి, చాలాప్రదేశాలు అన్యాయంగా లాక్కుని ఇతరదేశాలకు ఇచ్చినారు మిత్రమండలివారు. పైన చెప్పిన విధంగా

ఫ్రాన్సు, రష్యా, జెకొస్లొవేకియా ఒక వేపునా, ఫ్రాన్సు ఇటలీ దేశాలు ఒకవేపునా మూగితే, జర్మనీ, హంగేరీ, బల్గేరియా ముఠాకు మించినబలగం సమకూరుతుంది. కాని ఆసమష్టి కార్యక్రమం చేకూరుతుందా? ఒకవేళ లభించినా యుద్ధసమయాలలో నిల్చి కడతేరుతుందా? రైను ప్రాంతం జర్మనీ ఆక్రమించినతర్వాత ఫ్రాన్సుకి యుద్ధసమయంలో తనస్నేహబృందంతో సహకారం కష్టం. అదికాక జర్మనీయుద్ధబలం సరిగా ఎంతవున్నదో ఇదమిత్థమని తెలియదు.

ఈ పరిస్థితులు ఒకటి రెండు ఇతరవిషయాలవల్ల మరీ క్లిష్టమైనవి. మొదటిది అబిస్సీనియామీద ఇటలీచేసిన అన్యాయపు యుద్ధం, దౌర్జన్యం. జాతిసమితి ప్రణాళికకూ, కెల్లాగ్ శాంతి ఒడంబడికకూ వ్యతిరేకమే కాక ఇటలీచర్య మానవధర్మానికే విరుద్ధం. ఆఫ్రికాలో ఈజిప్టుతోనూ, సూయజు కాలువతోనూ సంబంధంవున్న బ్రిటిషు ప్రభుత్వం ప్రథమంలో ఇటలీకి వ్యతిరేకంగా ఆంక్షలు అమలుపర్చాలన్నది. జాతిసమితి సంరక్షణకోసం ఎదురుచూసే చిన్నచిన్న దేశాలన్నీ బ్రిటనువాదన బలపర్చినవి. తరువాత ఇటలీ అబిస్సీనియా ఆక్రమించినతర్వాత బ్రిటిషు ప్రభుత్వం చేసేదిలేక ఆంక్షల కార్యక్రమం ఆపుచెయ్యమన్నది.

ఏమయినా, తగుదునమ్మా అని ఇటలీ జర్మనీకి వ్యతిరేకంగా ఇతరులతో కలిసి శాంతిప్రయత్నం ఎల్లాచేస్తుంది? ఒకవేళ జర్మనీ దౌర్జన్యంగా పోయిన తన రాజ్యభాగాలు ఆక్రమించడానికి ప్రయత్నిస్తే, అన్యాయంగా అబిస్సీనియా ఆక్రమించిన ఇటలీ జర్మనీచర్య ఎల్లా ఆపుజేస్తుంది?

ఇటలీ జర్మనీతోచేరి సరిహద్దులు మార్చుమనేవైఖరిలోకి దిగుతుందనే భయంవల్లనే ఫ్రాన్సు ఆంక్షల కార్యక్రమం సమితిలో చర్చించినన్నాళ్లూ కర్రావిరక్కుండా, పాముచావకుండా నాటకం ఆడింది.

రెండోవిషయం ఏమంటే సందిగ్ధావస్థలోవున్న బ్రిటిషుప్రజాభిప్రాయం. జర్మనీ అంటే ఇంగ్లాండులో అంతప్రేమ లేకపోయినా, జర్మనీని అన్యాయం చేశారన్నసంగతి బ్రిటిషుప్రజలు గుర్తించారు. జర్మను ఆశయాలంటే బ్రిటనులో సానుభూతి లేకపోలేదు. ఆ కారణంచేతనే తూర్పు యూరపులో సరిహద్దుల విషయంలో బ్రిటను కలుగజేసుకోదు. బెల్జియంమీదగాని, ఫ్రాన్సుమీదగాని జర్మనీ అనవసరంగా దండెత్తితే, లొకార్నో ఒడంబడిక ప్రకారం బ్రిటను జర్మనీకి వ్యతిరేకంగా యుద్ధంచేసి ఫ్రాన్సు, బెల్జియందేశాలకు సహాయం చెయ్యాలి. దానికి బ్రిటను సిద్ధంగానేవున్నది. కాని డాంజిగ్ ప్రజలు తమమాతృదేశమైన జర్మనీతో కలుస్తామంటే బ్రిటను అడ్డురాదు. ఆస్ట్రియా జర్మనీలో కలుస్తానంటే అడ్డురాదు.

అన్నిటికీపైన అంతర్జాతీయసమితి నీరసం, ఇటలీపట్ల ఆంక్షల ప్రయోగపు నిరుప

యోగం, వీటివల్ల కలిగే యుద్ధభయం అన్నీ ఫ్రాన్సు ప్రయత్నాలకు అడ్డేవస్తవి.

అయినా యూరపు శాంతినిర్మాణంలో రష్యా ఎంతవరకు సహకారంచేస్తుంది? రష్యా కమ్యూనిస్టుదేశం. కమ్యూనిజం ప్రపంచం అంతా వ్యాపించేటట్టు చెయ్యడం రష్యా ఆశయం. అల్లకల్లోలంగావుండి, యుద్ధంచేసే యూరపు కమ్యూనిస్టుప్రచారానికి మంచి తావు కమ్యూనిజంవల్ల యూరపులో యుద్ధం రావచ్చు యుద్ధంవల్ల కమ్యూనిజం రావచ్చు.

రష్యాసామ్రాజ్యం ఆశియాలో వ్యాపించి వున్నది. ఆప్రాంతానికి జపానువల్ల భయం లేకుండా చూసుకోవాలి రష్యా. రష్యా అటు యూరపుప్రభుత్వంకాదు, ఇటు ఆశియా ప్రభుత్వంకాదు. రెంటినీ బంధించే మధ్య ప్రభుత్వం. ఈనాడు ఆశియాలో తగాదా వస్తే యూరపు అంటుకుంటుంది. యూరపులో తగాదా వస్తే ఆశియా అంటుకుంటుంది. ఆఫ్రికా యూరపుఖండాలుకూడా అదేబంధుత్వంలో వున్నవి.

ఈఖంగారులో, జాతీయఆశయాలలో, అంతర్జాతీయభయాలలో, శాంతి శాంతి అని తహతహలాడితే అది లభిస్తుందా? కాని సూక్ష్మంగా పరిశీలిస్తే శాంతిసంస్థాపన అంత కష్టసాధ్యం కాదు. పిల్లలగన్నతల్లులికి తమ కొడుకులంతా యుద్ధంలో చావాలనివుంటుందా? భర్తలుగల స్త్రీలందరికీ తమ భర్తలు ప్రాణాలు పోగొట్టుకోవాలని వుంటుందా? చిన్నపిల్లలికి తండ్రుల్ని పోగొట్టుకోవాలనీ, అన్నల్ని పోగొట్టుకోవాలనీ వుంటుందా? జర్మనీ స్త్రీలకైన మీసాలులేవు అన్నాడు పానుగంటికవి. అల్లాగే జర్మనీతల్లైనా కడుపునగన్నపిల్లలంటే ప్రేమే. యుద్ధం ఎవరికీ అవసరంలేదు. ఏజాతికీ అవసరం లేదు. మరి ఇటలీ యుద్ధంచెయ్యలేదా అంటే, దిక్కుమాలిన అనాగరిక అబిస్సీనియామీద తెగించినట్టు ఇతరయూరపు ప్రభుత్వాల మీద ఇటలీ యుద్ధంచెయ్యగలదా? నిజానికి పెద్దయుద్ధం ఎవరికీ అక్కర్లేదు. యుద్ధంవల్ల కలిగేనష్టాలు విపరీతం, లాభాలు సందేహం.

ఆయుధాలనైశిత్యం అతిశయించిన ఆధునికప్రపంచంలో ఒకదేశం మరొకదేశంమీద అమాంతంగా దండయాత్ర బయలుదేరుతుందనే భయంకంటె ఆయుధనిర్మాణంలోవున్న పరస్పరపోటీలవల్ల ఎక్కువభయం. యూరపు దేశాలు పరస్పరంగానూ, వ్యతిరేకంగానూ ఒడంబడికలు చేసుకోవడంవల్ల, విపరీతంగా ఆయుధనిర్మాణం చెయ్యడంవల్ల విరోధకారణాలురావడం, యుద్ధవాతావరణం ఏర్పడడం తటస్థిస్తుంది. ఈ పరిస్థితులలో యుద్ధంరాక తప్పదనే దృఢనమ్మకం కలిగి, శాంతిమార్గానికీ, సాహచర్యానికీ ప్రతికూలపరిస్థితులు సంభవిస్తవి.

అంతర్జాతీయవ్యవహారాలు ఇట్లా వుండగా, ఆంతరంగికంగా వున్న ఆర్థికదుస్థితుల వల్ల ప్రజాప్రభుత్వాలు పడిపోయి నియంతృత్వాలకు తావు కలుగుతున్నది. నియం

త్వాత్వాలు నిలబడడానికి కారణం వారి విజయమే. ఎప్పటి కప్పటికి కొత్తధ్వజం ఎత్తి ప్రజల్ని ఆకర్షిస్తేగాని వీలులేదు. అటువంటి వీలులేక చేసినందునే అబిసీనియామీద ఇటలీ దాడి. ఈ విషమసందర్భాలలో ఉన్మాదంవల్ల, పొగరుమోతుతనంవల్ల, పొరబాటువల్ల, ఏవ్యక్తి ఎంతచిన్న కార్యం చేసినా అది మందుగుండుసామానులో నిప్పురవ్వల్లా అవుతుంది. అదే ఈనాటి మహా[illegible].

ఈవిధంగా చినికి చినికి గాలివాన కాకపూర్వం, మందుగుండుసామానులో నిప్పు పడకపూర్వం సంప్రదింపులలో, రాయబారాలలో మార్పులు చెయ్యవా? కొందరికు మార్పులు చేశారని వ్రాశాను. దానితో అంతా కాలేదు. మిగిలింది మోపెడుంది. పరిష్కారం కావలసిన సమస్యలు మూడు భాగాలు. సరిహద్దులలోవున్న సమస్యలు మొదటిభాగం; అవి సరిహద్దులు, ఆస్ట్రియా, డాంజిగ్, మెమెలు భాషాదిక్షేపాలు, వీటికి సంబంధించిన సమస్యలు, మైనారిటీసమస్యలు.

వీటిలో ఏదిపరిష్కారం చెయ్యడానికీ కూడా యుద్ధం అనేది అనవసరం అని అందరికీ తెలుసును. కాని వాతావరణం దట్టంగా వుండడంచేతనూ, ఆయుధ సమార్జనోద్యమం విపరీతంగా వుండడంచేతనూ, ఏసమస్య బలవంతంగా ఒకానొక దేశం పరిష్కారం చెయ్యడానికి ప్రయత్నించినా యుద్ధం వచ్చి తీరుతుంది.

రెండవభాగం వలసరాజ్యాలసమస్య. ఈ మధ్యకాలంలో ఈ సమస్య మరీ చర్చలోకి దిగింది. ప్రపంచపటంకేసి చూస్తే వలసరాజ్యాలసమస్య పెద్దదిగా కనుపిస్తుంది. కాని నిజానికి అంతతీవ్రమైందికాదు ఈనాడు ప్రపంచంలో ఏ ప్రదేశంకూడా తెల్లవారి వలసలకు అనుకూలించేదీ, వారి అదనపుజనసంఖ్యకు నివాసం ఇచ్చేదీ, వారి వర్తకవ్యాపారానికి లాభించేదీ లేదని చెప్పవచ్చు. అన్నీ ఇదివరకే అయిపోయినవి. పైగా కొన్ని స్వరాజ్యంకోసం ప్రయత్నించి, సాధించి తమతమ వ్యవహారాలు స్వయంగా చేసుకుంటున్నవి. తెల్లదేశాలకు ముందుముందు ఇవి లాభించవు. జర్మనీకి, టర్కీకి, వాటి వద్ద యుద్ధానంతరం తీసుకుని, ఇప్పుడు మాండేటరీప్రభుత్వాలుగా వుంచిన రాజ్యాలు తిరిగి ఇచ్చెయ్యడంకూడా అంతసులువైనపని కాదు. ఒకవేళ బలాత్కారంగా ఇచ్చినా శాంతి చేకూరదు.

మూడోభాగం ఆర్థికసమస్య. మూడింటిలో మూడోది ముఖ్యం.

స్థూలంగా భూగోళపు వైశాల్యం 196,950,000 చదరపుమైళ్లు. అందులో 57,510,000 మాత్రమే భూభాగం. మిగిలింది జలభాగం. ఈ భూభాగంలో నివసించే ప్రజలు దాదాపు 1,820,000,000. వీరంతా ప్రస్తుతం 70 స్వతంత్రరాజ్యాలలో విభజింపబడ్డారు. ఏరాజ్యానికారాజ్యం, విపరీతమైన ఆయుధబలంతో, ఒకరిమీద ఒకరు వేసిన

అంతులేని ఆర్థికసుంకాలతో, పన్నులతో, ఆంక్షలతో, ఒకరు కలిమిలో, మరొకరు లేమిలో, శాంతిగా జీవనంచెయ్యడం అనేది దుర్లభం. కొన్ని దేశాలలో పాడిపంటలు వుంటవి. కొన్నిటిలో వుండవు. కొందరికి కొన్ని వుంటే కొన్ని వుండవు. అమెరికా సంయుక్తరాష్ట్రాలవంటి పెద్దరాజ్యం ఇతర దేశాలతో ప్రమేయం లేకుండా తన పొట్ట తాను పోసుకోవచ్చును. ఇంగ్లాండువంటి చిన్న ద్వీపప్రదేశానికి అది వీలుగాదు. బొగ్గు, ఇనుము వుంటే మరలేగాని, వాటిలోకి ముడి సరుకులు వుండవు. ఆధునిక శాస్త్రం కాలాన్ని జయించింది, దూరాన్ని జయించింది. కొలతకి ఆశియాకు అమెరికా దూరమైనా, విమానాలవల్ల, రేడియోలవల్ల, ఇతర ఆధునికసామగ్రివల్ల ప్రపంచం అంతా ఒక కుటుంబంగా వుండవలసిన పరిస్థితులు సంభవించినవి. కాని ఆపరిస్థితులికి అనుగుణంగా మానవజీవితం పరిణామం పొందడం లేదు. జాతిలో, మతంలో, భాషలో, వేషంలో, జీవితవిధానంలో వున్న బాహ్యభేదాలు అతిశయించి సూక్ష్మదృష్టి నాశనం చేస్తున్నవి. మనుష్యులరంగు దేశ కాల పరిస్థితుల్ని బట్టి తెలుపైనా, నలుపైనా, పసుపైనా, మానవుడు ఒకటేననేభావం కలిగితేతప్ప, ఈ బాహ్యవైరాలు పోవు. ఎవరికివారే యమునా తీరే అని, గుడుగుడుగుంచంగా నివసించినన్నాళ్లు ఈ ఆర్థికమాంద్యం, ఈ అర్థం లేని జీవితం వుండవలసిందే. బలమైనవాడిదే రాజ్యం. ఏదేశాని కాదేశంలో జాతీయ జీవితం సుఖంగా చెయ్యడానికి నియంతలు ఉద్భవించి లోకానికి ముప్పు తెస్తారు. సామ్రాజ్యసంపాదనాసక్తి వృద్ధిఅవుతుంది. కరువులో జబ్బుల్లో బందిపోట్లు వుంటవి. అల్లాగే ఈ అంతర్జాతీయ ఆర్థికమాంద్యంలో అంతర్జాతీయబందిపోట్లు వృద్ధిఅవుతవి.

ప్రపంచశాంతికి మార్గం, ఈ ఆర్థిక సుంకాలు తీసెయ్యడం, స్వేచ్ఛావ్యాపారం సాగనివ్వడం. ఒక దేశంలోనుంచి ప్రజలు ఒక దేశానికి పోకుండా వున్న చట్టాలు రద్దు చెయ్యడం. నాణ్యమానాలలోవున్న హెచ్చు తగ్గులు తీసెయ్యడం. ఇవన్నీ ఒక్కసారపు చెయ్యగలదా? వీలులేదు. అమెరికా, జపానువంటి ప్రభుత్వాలు కలిస్తేగాని వీలు లేదు. ఒక దేశానికి ఒక దేశం లోకువ, తక్కువ అనేఅభిప్రాయాలు పోవాలి. ఆ పరిస్థితులు ఇప్పుడు వున్నవా అంటే నోరు వెళ్లబెట్టాలి. యూరపుఖండం ఆఖండానికే కాకుండా ప్రపంచానికే సమస్యఅవుతున్నది. కాని జర్మనీ రైను ఆక్రమణ సరియైనదృక్పథంలో ఆలోచించిచూస్తే శుభసూచకం. యుద్ధానంతరం కలిగిన అన్యాయాలలో ఆఖరు అన్యాయం దానితో తీరిపోయింది. యుద్ధానికి పూర్వం వుండే పరిస్థితులు తిరిగివచ్చినవి. రాజకీయ వేత్తలు బుద్ధిమాంద్యం లేకుండా అంతర్జాతీయ సమస్యలు పరిశీలిస్తే శాంతిసంస్థాపన సులభసాధ్యం. ఆతరుణం వచ్చింది. నీచదృష్టితో అవి పరిష్కరిస్తే యుద్ధం తప్పదు. ప్రపం

చంలో అందరికీ యుద్ధం అక్కర్లేదు. రణభేరి మోగించేవారు ఒకరిద్దరు. ప్రాణాలు అర్పించేవారు లక్షోపలక్షలు. ఈ యుద్ధదేవతలు ప్రసన్నంగావుంటే యుద్ధం ఆగిపోతుంది, లేదా మానవకుటుంబంలో ఆహార వ్యవహారాలకోసం ఈ యెడతెగని కొట్ల తప్పదు. హెకెల్ మహాశయుడు చెప్పిన గాలిలోంచి ఆహారం సృష్టించేమార్గం లభి తప్ప మానవశాంతి దుర్లభం.



వికాసము D. A R.

# కృష్ణ దేవరాయల పొలిపాడు శాసనము

డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

ఈ శాసనమున సుమారు ౧౦౪ అంగుళముల పొడవును, ౭ అంగుళముల వెడల్పును గల మూడు రేకులున్నవి. రేకుల పైభాగమును అర్ధచంద్రాకారముగ కత్తిరించి, తీర్చి, సరిగా మధ్యన రాగికడియమును దూర్చుటకు బెజ్జమువేసియున్నారు. కాన ప్రతిరేకునందును లిపియున్న భాగము సుమారు ౯ అంగుళముల పొడవును, ౭ అంగుళముల వెడల్పును మాత్రమే గలదు. రేకుల చివరల కంచు చక్కగా తీర్చియుండుటచేత అక్షరము లేమాత్రమును నలిసిపోలేదు.

లిపి, భాష :

ఈశాసనలిపి విజయనగరకాలమునందు విశేషముగ వాడుచున్న నందినాగరిలిపి. లిపికారుడీశాసనమును చాల అజాగ్రత్తగ చెక్కినట్లు తోచుచున్నది. 'శ' 'స' లకు భేద మంతగాపాటింపలేదు. రేఫ, అనుస్వార, విసర్గలు చాలచోట్ల కానరావు. శాసనభాష సంస్కృతము; గాని లిపికారునికి సంస్కృతభాషాపరిచయ మంతగా లేనందునగాబోలు, 'విప్రాయ'యనుటకు 'విప్రయ'యనియు(పం. ౬-౨), 'నూరయే' అనుటకు 'నూనవే'యనియు(పం. ౬౩), 'స్నిగ్ధై'అనుటకు 'స్నిగ్దై' అనియు ఇంకను కొన్ని ఇటువంటి తప్పులు కానవచ్చుచున్నవి.

ప్రశస్తి :

ఈశాసనమునందలి ప్రశస్తియంతయు, అనగా మొదటి ౨౫ శ్లోకములును స్వల్పభేదముతో కృష్ణరాయని హంపి మొదలగు శాసనములందు గానవగును. ఈశాసనమునందలి రెండవ శ్లోకము హంపిశాసనమునందు గానరాకున్నను, సాధారణముగ నీశ్లోకము విజయనగరశాసనములందు గాన్పించునదియే. హంపి శాసనమునందలి ౮, ౯, ౧౦, ౧౧, ౧౨ సంఖ్యలుగల శ్లోకము లిందు లేవు. ఈ శ్లోకములలో మొదటిరెండును కృష్ణరాయనితాత ఈశ్వరనాయకుని శౌర్యసామర్థ్యములనుగూర్చియు, మిగిలిన మూడు శ్లోకములును కృష్ణరాయని తండ్రి నరసానాయకుని ధైర్య శౌర్యాదిగుణములను గూర్చియు, అతని మహాకార్యములనుగూర్చియు వర్ణించుచున్నవి.

శాసనవిషయము :

కృష్ణరాయడు శకవర్షములు ౧౪౩౨ ప్రమోద సంవత్సర పుష్యబహుళత్రయోదశినాడు, జ్యేష్ఠానక్షత్రమందు, మకర సంక్రమణ పుణ్యకాలమున, తుంగభద్రా నదీతీరమునందలి శ్రీవిరూపాక్షస్వామి సన్నిధియందు, చంద్రగిరి రాజ్యమునందలి కాళహస్తి సీమ(?) నున్న పొలిపాడుగ్రామమును దక్షిణాసహితముగ గౌతమ గోత్రుడును, యజుర్వేదియు, ఎఱ్ఱమ రాజపుత్రుడును, వేదశాస్త్ర పారంగతుడును అగు చంద్రమౌళి యను భూసురునకు ధారవోసెను. ఈవిషయమును దెలుపుటకే ఈదానము పుట్టినది. వీరణాచార్యుల పుత్రుడగు మల్లణాచార్యుడే ఈశాసనమును వ్రాసెను. ఈశాసనమందలి కడపటి ౫ శ్లోకములును దానపాలనమును గూర్చి సాధారణముగ శాసనములందు గానబడు శ్లోకములే.

శాసనకాలము :

ఈశాసనమునందలి తారీఖు శా. శ. ౧౪౩౨ ప్రమోదపుష్య బహుళ ౧౩ జ్యేష్ఠా, మందవాసరము, మకరసంక్రమణము, సరిగ క్రీ. శ. ౧౫౨౦ డిశెంబరు ౨౪వ తేది శనివారమునకు సరిపోవుచున్నది. ఆదినమున సూర్యోదయానంతరము ౩ ఘడియలకు పిమ్మట త్రయోదశితిథి ప్రారంభమాయెను. జ్యేష్ఠానక్షత్ర మానా ౩౧ ఘడియలకాల మున్నందున తిథి వార నక్షత్రములు మూడును సరిపోవుచున్నవి.

శాసనమునందలి స్థలములు :

దాన మొసంగబడిన గ్రామము చంద్రగిరి రాజ్యమందలి పొలిపాడని స్పష్టముగ దెలియుచున్నది. కాని ఈగ్రామ మేసీమయందలిదో లిపికారుడు విశదముగ వ్రాయలేదు. కల్మిహస్థి అనియున్నట్లు గాన్పించుచున్నందున బహుశః కాళహస్తియేమో యని తోచుచున్నది. ఈపొలిపాడు గ్రామము వెందోడు గ్రామమునకు తూర్పునను, పోతుగుంటకు దక్షిణమునను, పఱ్రకు పశ్చిమమునను, సగుటోరునకు ఉత్తరమునను ఉన్నట్లు తెలియుచున్నది. ఈగ్రామములన్నియు ఇప్పటి నెల్లూరు జిల్లా రాపూరు, గూడూరుతాలూకాలును, వెంకటగిరి డివిజనును కలియుభాగమునం దున్నవి. ఈశాసనమునందలి పొలిపాడు వెందోడుగ్రామములు ఇప్పటి గూడూరు తాలూకాయందలి పొలిపాడు వెందోడు గ్రామములే. ఇవి రెండును గూడూరుతాలూకాయందు నైరృతి భాగమున నున్నవి. పోతుగుంట ఇప్పటి రాపూరు తాలూకాయందు ఆగ్నేయ దిగ్భాగమున నున్న పోతేగుంట, లేక పాతగుంట గావచ్చును. సగుటోరు అని మనశాసనమునన్న గ్రామమునే నేడు సగుటూరని వ్యవహరించుచున్నారు. ఇది వెంకటగిరి తాలూకా ఈశాన్యభాగమునం దున్నది. ఈగ్రామములన్నియు ఒకటికొకటి దగ్గరగ నున్నందునను మనశాసనమునందలి పేర్లకును ఇప్పటిపేర్లకును ఎక్కువవ్యత్యాసముగాన్పించనందునను, నేను గాన్పించుచున్న పైగ్రామములే శాసనమునందు జెప్పిన గ్రామములని నమ్ముటకు వీలున్నది. ఇక సందేహాస్పదముగనున్న గ్రామ మొక్కటియే. ఇది పఱ్రయని పైశాసనమున వ్రాయబడినది. కాని ఎఱ్ఱ అని వ్రాయుటకే పొరబాటున లిపికారుడు పఱ్రయని వ్రాసెననియు, గూడూరు తాలూకాయందలి యేరూరుగ్రామమే ఈఎఱ్ఱగ్రామమనియు,నా యభిప్రాయము. యేరూరు గ్రామము గూడ తక్కిన ర గ్రామములకును సమీపముననే యున్నందునను, శాసనమునందు జెప్పిన పరిహద్దుల దిక్కులపేర్లు సరిగా సరిపోవుచున్నందునను పైయూహ నిజమేయని నమ్మవచ్చును.

ఈ గ్రామములన్నియు చంద్రగిరి రాజ్యమునందే యున్నట్లు మనశాసనమునందు చెప్పియున్నందున 'చంద్రగిరిరాజ్య మప్పుడీభాగమున నెంతవరకును వ్యాపించియుండెను? దీనికిని ఉదయగిరి రాజ్యమునకును సరిహద్దు లెచ్చటనుండెను?' అను విషయమును కొంత విమర్శించవలెను. చంద్రగిరి రాజ్యము రెండవ దేవరాయని కాలమునకే నెల్లూరిజిల్లా పోలూరు తాలూకా లింగంపాడువరకును[1] వ్యాపించియుండెను. ఈభాగమునకే పోరూరుసీమయని వ్యవహరించుచున్నట్లు క్రీ. శ. ౧౫౦౩, ౧౫౨౬ సంవత్సరపు శాసనముల[2]నుండి తెలియుచున్నది. అచ్యుతరాయని రాజ్యారంభకాలమందలి క్రీ॥ శ॥ ౧౫౩౦ సంవత్సరము నాటి శాసనమున[3] నెల్లూరిజిల్లా గూడూరుతాలూకాలోని వాకాడు గ్రామముగూడ చంద్రగిరిరాజ్యమునం దుండినట్లు తెలియుచున్నది రాపూరితాలూకాయందలి ఉత్సూరుగూడ చంద్రగిరిరాజ్యములో నున్నట్లు ఒక శాసనమునుండి తెలియుచున్నది. ఈ శాసనము క్రీ. శ. ౧౫౨౬ నాటిదైనందున, కృష్ణరాయని రాజ్యారంభకాలమందలి రాజ్య విభాగముల చర్చయందిది అంత ఎక్కువ ప్రయోజనకరము గాజాలదు.

ఇక ఉదయగిరిరాజ్యము దక్షిణమున నెంతవరకును వ్యాపించియుండెనో చూతము. ఈరాజ్యము దక్షిణమున పెన్నేరువరకును వ్యాపించియుండినట్లు శాసనములనుండి విశదముగ తెలియుచున్నది. పెన్నేరునకు దక్షిణమునగూడ ఈరాజ్యము వ్యాపించినట్లు క్రీ. శ. ౧౫౦౩ నాటి ప్రభాగిరిపట్టణ శాసనమునుండి తోచుచున్నను, దొరకినంతవరకును శాసనములన్నియు ఒకటి రెండుమాత్రముతప్ప పెన్నేటికుత్తరముననున్న భూభాగమునకే ఉదయగిరి రాజ్యమని చెప్పుచున్నందున బహుశః పెన్నేరే ఈరాజ్యపు దక్షిణసరిహద్దేమోఅని తోచుచున్నది. విజయనగర సామ్రాజ్యమునందు ఉదయ

1. Nel. Ins. C. P. No. 8; V. Rangacharya; Topo. List of Inscr. Nellore 623 B.
2. Nel. Ins. C. P. No 6 and 7.
3. V. R. Topo Lists Nel. 259.

గిరి అత్యంత ప్రాముఖ్యమైన దుర్గమగుటచేత[4] నొక్కొక్కప్పుడు ఇచ్చటి ప్రతినిధికి అధికతరప్రాముఖ్యమును, రాజ్యభాగమును సమకూరి, ఉదయగిరి రాజ్యము పెన్నానదికి దక్షిణమున స్వర్ణముఖినదివరకునుకూడ వ్యాపించియుండవచ్చును. కాని పడనాడు చంద్రగిరిరాజ్యమునందే యున్నట్లు గాన్పించుచున్నందునను, పోరూరుసీమ యనబడు ఇప్పటిపోలూరు తాలూకా పడనాడునందలి యొకసీమ యగుటచేతను ఉదయగిరిరాజ్యము స్వర్ణముఖినదికి దక్షిణమున వ్యాపించి యుండుననుటకుమాత్రము వీలులేదు.

చంద్రగిరి రాజ్యమందలి తూర్పుభాగము కాళహస్తి, పోరూరు అని రెండుసీమలక్రింద విభజింపబడి యుండినట్లు శాసనములనుండి తెలియుచున్నది. ఈప్రాంతమునకొంతభాగమున కేరావూరిసీమయనియు, వెంకటగిరి సీమయనియుకూడ పేర్లుండినట్లు ఇతరశాసనములనుండి తెలియుచున్నది. కాని వెంకటగిరిసీమయను విభాగము కృష్ణరాయలనాటి కేర్పడియుండినట్లు గానరాదు. పొలిపాటి శాసనమునందు చెప్పిన గ్రామములకు రావూరు ఉత్తరమున చాలదూరమున నున్నందున రావూరుసీమయందు వానిని జేర్ప సాధ్యముకాదు. పోలూరిసీమ యనునది సముద్రమునకు సమీపముననున్న సీమకు పేరని ఇదివరకే చెప్పియుంటిమి. కావున కాళ్లేరు నదీప్రాంతమైన ఈభూభాగమంతయు కాళహస్తిసీమయందే యుండెనని చెప్పవచ్చును.

### భూమి భోగము :

దానమిచ్చిన పొలిపాడు గ్రామము ఏకభోగ్యమనియు, వివిధ ఫలయుతమనియు, వాపికూపతటాకకచ్ఛప యుతమనియు, నిధి నిక్షేపపాషాణాద్యష్టభోగములతోనేకాక ఇతర భోగములతోను కూడినదనియు తెలియుచున్నది. ప్రతిగ్రహీత దీనిని పుత్రపౌత్ర పరంపరంగా ననుభవించుటకు మాత్రమే కాక దానముచేయుటకును, తాకట్టుపెట్టుకొనుటకును, విక్రయించుటకునుగూడ హక్కు లుండునట్లు దానమొసంగబడెను. ప్రతిగ్రహీత కిన్నిహక్కులున్నట్లు విశదముగ జెప్పియున్నందున ఆకాలమున భూస్వాములకును రాజునకును గలసంబంధ మెట్టిది? అష్టభోగదానమనేమి? భూస్వాములకు వ్యవసాయఫలము ననుభవించుటకు మాత్రమే హక్కుండెనా, లేక నిజముగ వారు భూస్వాములా? అని కొన్నిసమస్యలేర్పడును. ఈవిషయమున ఇదివరకే ఎంతయో చర్చ జరిగియున్నను, భూస్వామి రాజా, లేక భూములననుభవించుచున్న ప్రజలా యనుప్రశ్నకింకను సరియైనసమాధానము కుదురలేదు. టాడ్‌హంటరు కమిటీ ( Todhunter committee)అను కరవిచారణసంఘము కొంతకాలముక్రిందట నే గొప్పగొప్పపండితులను, న్యాయవాదులను, భూస్వాములను విచారించి హిందూపద్ధతి రీతిగా భూమికి రాజే సంపూర్ణ హక్కుదారుడుగాన ప్రజలు భూమిని సాగుబడిజేసి ఫలసాయమున కొంతభాగము హక్కుదారుడగురాజున కర్పించి, మిగిలినది తాము అనుభవించుటకుమాత్రమే హక్కుగలవారనియు, అందుచేతనే రాజునకర్పించుభాగమును పన్ను అనుటకన్న "బాడుగ" అని (rent) వ్యవహరించుట సమంజసమనియు సిద్ధాంతముచేసిరి. ఈసిద్ధాంతము హిందూ ధర్మశాస్త్రములపైనను, వానివ్యాఖ్యానములపైనను ఆధారపడినంత సమగ్రముగ ప్రాచీనహిందూరాజ్యపద్ధతులను దెల్పు శాసనములపై నాధారపడలేదు. ధర్మశాస్త్రములందలి విషయముల నిదివరకే ఎందరో చర్చించియున్నారు. కాని ధర్మశాస్త్రములు పరస్పరవిరుద్ధాభిప్రాయములకు తావొసంగుచున్నవని విశదమైనందున కేవలము వానిపైననే యాధారముచేసి ఈ సమస్యను చర్చించుట నిష్ప్రయోజనము.

శాసనములందలి విషయములింకను అర్థశాస్త్రవేత్తల దృష్టి కంతఎక్కువగా గోచరింపలేదు. ఒకరిద్దరు మాత్రము శాసనములను పరిశోధించి భూమియందు రైతులకు సర్వహక్కులును గలవని వ్రాసియున్నారు. జయస్వాల్ గారుగూడ ఈయభిప్రాయమునే తెల్పుచున్నారు. కాని ఈవిషయమునుగూర్చి విజయనగర శాసనములను

4. Nel. Ins. K. R. 37.

ఎక్కువగ పరిశీలించిన డాక్టరు నేలటూరివెంకటరమణయ్యగారు మాత్రము విజయనగర సామ్రాజ్యమున భూమికి సంపూర్ణహక్కుదారుడు రాజేననియు, ప్రజలకుగాని, రాజప్రతినిధులకుగాని భూసాయము ననుభవించుటకుమాత్రమే హక్కుండెననియు, దానవిక్రయాదులందు రాజుపేరు దెల్పకున్నను అది అధ్యాహార్యమనియు వ్రాసియున్నారు. కాని వారే క్రీ. శ. ౧౫౩౮, ౧౫౮౫ నాటి శాసనములను రెంటిని దెల్పుచు ఈ రెంటియందుమాత్రము సామాన్యజనులకుకూడ సార్వభౌముని కుండవలసినటువంటి హక్కులేవో యుండినట్లు తోచుచున్నదని వ్రాసియున్నారు.

వెంకటరమణయ్యగారి వాదమునకు రెండు ముఖ్యాధారములు గలవు: (౧) విజయనగర సామ్రాజ్యమున ప్రభుత్వమువారు భూములను తరచుగా కొలిపించుచు, పన్నులను హెచ్చించుచు, తగ్గించుచు, నేటి సర్వే (Survey), సెటిల్మెంటు (Settlement) శాఖవారి కార్యముల నన్నిటిని చేయుచుండిరి. రాజు సకల భూభాగములకును హక్కుదారుడు. కాననే ఇట్లు చేయుటకు ఆస్పదమున్నది. (౨) పన్నులు చాల అధికమైనయెడల జనులు తమఇండ్లను, భూములను వదలి పాఱిపోవుచుండిరి. రైతులకు నిజముగ భూస్వామ్యపు హక్కు లుండినయెడల అట్లు భూములను వదలి వారి పోవుట తటస్థపడియుండదు. ఇంతకును ప్రజలకు భూస్వామ్యపు హక్కులే యుండినయెడల రాజు తనకు ఇష్టమువచ్చినట్లు పన్నులను హెచ్చుచేయుట శాస్త్రవిరుద్ధము (illegal). కాన రైతుల కొక్క ఫలసాయము ననుభవించు హక్కుతప్ప ఇతరహక్కులు (ముఖ్యముగాభూస్వామ్యపుహక్కు) ఉండలేదు.

ఈరెండువాదములును బలహీనములైనవని తోచుచున్నవి. భూస్వామ్యపుహక్కులు రాజునకుగాక రైతులకేయున్నవన్నను, వెంకటరమణయ్యగారనుకొన్నట్లు రైతులు పాఱిపోవడముగాని రాజుపన్నులను తరచు హెచ్చుచేయుటగాని దురవగాహముగ గన్పట్టదు. ఇంటిపన్నులను గైకొందము. ఒకడు కొన్నిఇండ్లను బాడుగ కిచ్చి దానివరుమానమువలన జీవనము చేయుచు, తనవరుమానమున కొంతభాగమును ఇంటిపన్నురూపమున ప్రభుత్వమునకు చెల్లించుచున్నాడనుకొందము. ఆఇండ్లను బాడుగకు గైకొనువారు చాల యధికమగుటచేతనో, మరియేఇతరకారణముననో, ఇండ్లనుండివచ్చు వరుమాన మధికమైనయెడల ప్రభుత్వమువారు తమపన్నునుకూడ హెచ్చుచేయుదురు. కొన్నిమారులు వరుమానము అధికముగాకున్నగూడపన్నుమాత్రము హెచ్చుచేయుటయు గలదు. కాని ఇంతమాత్రముచేతనే ఆఇండ్లయందు యజమానుని కట్టిస్వామ్యమును లేదనియు, రాజునకే ఆ హక్కుగలదనియు చెప్పనగునా? భూమిపన్నుమాత్రము దీనికంటె నేవిధముగ భిన్నము [5]

ఇక రెండవ విషయమునుగూర్చి యోచింతము. రైతులు పాఱిపోవుట కొక్కభూమిపన్నుమాత్రమే కారణముగాదు. భూమి పన్నులుగాక ఇతరపన్నులెన్నియో కలవని డాక్టరువెంకటరమణయ్యగారే చూపియున్నారు. పన్నులెక్కువై జీవితము దుర్భరమైనపుడు భూములను ఇండ్లను విడనాడి పాఱిపోవుటయే, రైతుల కర్తవ్యము భూమిని ఇండ్లను వెంటగొనిపోవ సాధ్యము గాదు. కాననే వానిని వదలిపోవలసివచ్చును. ఇంతమాత్రముననే వారి ఇండ్లయందుగాని భూములందుగాని వారికిగాక రాజునకే సర్వస్వామ్యహక్కులునుగలవనియు వారికి కేవలముఉపభోగమునకు మాత్రమే అం దధికారము గలదనియు చెప్ప సాధ్యముగాదు.

ఇక శాస్త్రవిరుద్ధ మను విషయము నిరంకుశ ప్రభువుల కనువర్తించదు. చట్టముల నేర్పరచువాడు రాజు. రాజాజ్ఞయే చట్టము. అట్టిచో రాజు వివాహపు పన్నుల నధికముచేసినను, భూమిపన్నుల నెక్కువజేసినను

౫. పన్నురూపముగవచ్చు ఆదాయము నేవిధముగ వ్యయముజేయుచున్నారనునది వేఱుప్రశ్న. పురపాలక సంఘమువారు రోడ్లువేయించుటయందును, అలవెన్సులను (allowances) స్వీకరించుట యందును వ్యయము జేసిన, రాజు దేశ సంరక్షణమునకును [illegible] వ్యయము జేయును. కాని ఇంత మాత్రముచేతనే ఇంటిపన్నులకును భూమిపన్నులకును వ్యత్యాస మున్నదని చెప్ప సాధ్యముగాదు.

రెండును, ఒక్కటే. ఏదోవిధముగ సైన్యపోషణార్థమును, ఇతరకార్యార్థమును కావలసినంతధనమును ప్రోగుచేయుటయే నాటికిని నేటికిని ప్రభుత్వ కర విధానమునందలి ముఖ్యోద్దేశ్యము.

ఈసమస్య ఇట్టిప్రాముఖ్యమును పొందుటకు ఒక చిన్నకారణము కలదు. అర్థశాస్త్రాభివృద్ధి యందలి ప్రారంభదశలందు పదార్థములను, పరిశ్రమలను (Services) ప్రత్యేకముగ విభజించి, రెంటి యందును 'ప్రయోజనములే' (utilities) ప్రధానమను విషయమును సరిగ అవగాహన చేసికొనకపోయిరి. ఏపదార్థమైనను దాని ప్రయోజనములను (utilities) బట్టి మనకు దాని యావశ్యకతయును, విలువయును ఏర్పడునే కాని దాని వస్తు స్వరూపము వలన గాదు. ఒకకుర్చీని గొనినను, ఇంటిని గొనినను, భూమిని గొనినను, ప్రధాన విషయము దానియందలి 'ప్రయోజనములే' (utilities) కాని ఎంతమాత్రమును దానిస్వరూప భావములును, ఆపదార్థములందున్న అణుసమూహమును గాజాలదు. కుర్చీయందున్నంతకలప ఒక టేకుమొద్దు రూపమున నున్నను, లేక మహారణ్యమందలి ఒకవృక్ష రూపమున నున్నను, గృహరూపముననున్న ఇటికయును సున్నమును మృత్తికా రూపమునను సుద్దరూపమునను ఉన్నను జనులు వానినుండి సద్యోలాభమును పొందుటకుగాని ప్రభుత్వమువారు వానిపైపన్నులువిధించుటకుగాని వీలుండదు. భూమి పన్నులు గూడ వానియందున్న 'ప్రయోజనముల' (utilities) పైననే యాధారపడి యున్నవి. కాననే శుష్కభూముల (dry lands) పైనున్న పన్నుకంటె, తరీభూముల (wet lands) పైనున్న పన్ను ఎక్కువ. అట్టిచో భూమియందలి ప్రయోజనముల నన్నిటిని రైతు అనుభవించుచుండగా రాజునకు భూమియం దెట్టి స్వామ్యమున్నది?

అర్థశాస్త్ర పద్ధతినిజూచినచో ఒకఇల్లన్నను, ఒకభూమియన్నను, అందలిప్రయోజనము (utilities) లకుమాత్రమే ఆపద మన్వయించునుగాని ప్రయోజన రహితమూలవస్తురూపమున కన్వయించదు. అట్టిచో ప్రయోజనములనన్నిటిని అనుభవించునట్లు అష్టభోగదానముచేసినభూమిపై రాజున కింకను ఎట్టిస్వామ్య ముండగలదు.

మనశాసనమునందలిదానముకూడ నిట్టిదే. దాన మిచ్చినగ్రామమందలి నిధి నిక్షేపాద్యష్ట రూపముననున్న ప్రయోజనములు(utilities)మాత్రమేకాక ఇతరప్రయోజనములుగూడ సంపూర్ణముగ ప్రతిగ్రహీతకే సమర్పింపబడినవి. వీనిని తాను వంశపారంపర్యము ననుభవించుటయేకాక తాకట్టు పెట్టుకొనుటకును, దానము చేయుటకును, విక్రయించుటకునుగూడ అధికారము గలదని స్పష్టముగ చెప్పియున్నది. కాన ఈవిధముగ ఈగ్రామ మందలిసర్వప్రయోజనములును ప్రతిగ్రహీతకే సమర్పింపబడినందున రాజున కెందు ఎట్టిస్వామ్యమును లేదని నిస్సందిగ్ధముగ జెప్పవచ్చును. నానావిధములగు పన్నుల వలెనే ఈగ్రామముపైనను రాజు ఒకవేళ కొన్నిపన్నులను విధించినను, హెచ్చించినను అది రాజసామాన్య ధర్మమును తెల్పునుగాని అతనికి ఈగ్రామమందున్న ప్రత్యేకభూస్వామ్యమును దెలియజేయజాలదు. అట్టి సామాన్యధర్మమును నెరవేర్చుటకే రాజునకు హక్కు గలదు కాని మరల ఆగ్రామమును గైకొని ఇంకొకనికి దానముచేయుటకుగాని, విక్రయించుటకుగాని హక్కు లేదు. అట్లొనరించినచో ఆచర్య నిరంకుశప్రవర్తనము క్రిందజేరి, ఆరాజునకు శాసనాంతమున జెప్పినట్లు నానా పాపములను గట్టుకొనును.

శాసనదాత :

శాసనదాత విజయనగరసామ్రాజ్యము నేలిన సార్వభౌములలో సుప్రసిద్ధుడగు కృష్ణదేవరాయలు. ఇతడు తన రాజ్యారంభకాలమున వ్రాయించినదానశాసనములలో నిదియు నొకటి. ఇతనిరాజ్యారంభకాలమును శా. శ. ౧౪౩౧కి సరియైనశుక్లసంవత్సరమునుండి సాధారణముగ పరిగణింతురు కాన అతడు రాజ్యమునకు వచ్చినపిమ్మట మరుసటిసంవత్సరముననే, అనగా ప్రమోద సంవత్సరముననే ఈశాసనమును వ్రాయించెనని తెలియుచున్నది. కాని ఇదేప్రమోదసంవత్సరము నందును, దీనికిపిమ్మట మూడుసంవత్సరములకు, అనగా శ్రీముఖ సంవత్సరమునందును వీరనరసింహరాయల శాసనములుగాన్పించుచున్నందునను,మనశాసనమునాటికి

కృష్ణరాయలు నిజముగ రాజ్యమునకువచ్చియుండెనా? వచ్చియుండినచో అప్పటి కెంతకాలమునకుపూర్వము సింహాసన మెక్కియుండెను? ఏల తదనంతరమునగూడ వీరనరసింహరాయల శాసనములుగాన్పించుచున్నవి యను ప్రశ్నలకు సమాధాన మీయవలయును.

హంపీవిరూపాక్షేశ్వర దేవాలయమున నున్న శాసనమునుబట్టి కృష్ణరాయలు క్రీ. శ. ౧౫౦౮-వ సంవత్సరమునం దెన్నడో రాజ్యమునకు వచ్చియుండు నని సూయల్ దొరగారు వ్రాసియున్నారు. కాని ఈ శాసనమున ఇచ్చినశకవర్షమును, సంవత్సరమును ఏకీభవించుట లేదు. ఇంతేకాక ఈశాసనమునకు పూర్వమే కృష్ణరాయడు రాజ్యపరిపాలనము చేయుచుండినట్లు కొన్నిశాసనములు తెల్పుచున్నవి. అందుచేత ఈశాసనము పట్టాభిషేకమహోత్సవకాలమందు వ్రాయించినది గాదనియు, బహుశః పట్టాభిషేకానంతర మొకసంవత్సరమునకు జరిపిన ప్రథమవర్ధంత్యుత్సవమున వ్రాయించినదనియు కొందరు వాదించుచున్నారు.

ఏది ఎట్లున్నను కృష్ణరాయని పట్టాభిషేకము క్రీ. శ. ౧౫౧౦ జనవరి ౨౩, లేక ౨౪ తారీఖులకుపూర్వమే జరిగియుండవలెను. హంపిశాసనమునం దిచ్చిన ప్రభవాది సంవత్సరము తప్పనియు, శకవర్షమే సరియనియు వాదించినను కృష్ణరాయనిపట్టాభిషేకము క్రీ. శ. ౧౫౧౦ జనవరి ౨౩, లేక ౨౪ తేదీలకు ఇంకను పూర్వమే జరిగియుండునుగాని ఆతేదీలకు పిమ్మటమాత్ర మెన్నటికిని జరిగియుండజాలదు. క్రీ. శ. ౧౫౧౦ నాటి విజయనగరశాసనముల నించుక పరీక్షించినచో కృష్ణరాయల శాసనములు మనకు పెక్కులు కానవచ్చుచున్నవి గాని వీరనరసింహరాయల శాసన మొక్కటియును సరియైనది కానరాకున్నది. సంశయజనకములగనున్న శాసనములుగూడ వీరనరసింహునివి రెండే. వీనిలో మొదటిది దక్షిణకనరాజిల్లాలోని కొండాపురంతాలూకాలోని బసూరుగ్రామములోని శాసనము. దీనితారీఖు శా. శ. ౧[౪]౦౩ ప్రమోదూత వైశాఖ శు. ౭. ఇందలిశకవర్షము ప్రమోదూత సంవత్సరమునకు సరిపడుట లేదు. ఇందలి శకవర్షమే సరియైనదనినయెడల దీనితారీఖు ప్లవసంవత్సరమునకు సరియైన క్రీ. శ. ౧౪౮౧ నేర్పడును. అప్పటి కింకను వీరనరసింహరాయలు రాజ్యమునకు రానందున ఈ శాసన మెవ్వరిదో దృఢముగ జెప్ప వీలుండదు. కాని ఇందలి శకవర్షము స్పష్టముగా గాన్పింపనందున ప్రభుత్వపు శాఖవారు రెండవయంకెను బ్రాకెట్ల (brackets) మధ్య తెల్పియున్నారు. ఒకవేళ ఇం దొసంగిన శకవర్షము తప్పనియు, ప్రమోదూతసంవత్సరమే సరియనియు నిర్ధారించినయెడల ఈశాసనము క్రీ. శ. ౧౫౧౦ ఏప్రెల్ ౧౫ తారీఖునాటి దగును.

రెండవసందిగ్ధశాసనము బెంగుళూరిజిల్లాకంచనహల్లి తాలూకా, కంకనహల్లి గ్రామములో నున్నది. కాని ఈశాసనమునందు శ్రీముఖయని సంవత్సరపుపేరొక్కటితప్ప కాలనిర్ధారణమునకు వలయుశకవర్ష, మాస, తిథి, వార, నక్షత్రముల నొసగనందున ఈశాసన మంత ఉపయోగకరమైనదని చెప్ప వీలులేదు.

రాజుమరణానంతరమున గూడ ఒకటి రెండు సంవత్సరములవరకును గతించిన రాజుపేరనే శాసనములను చెక్కించుట యపురూపము గాదు. ఏకారణము చేతనైనను ఒకరాజు చేసిన దానధర్మములను శాసనరూపముగ ప్రకటించుటకు గాని, లేక ఆదానములను జరిపించుటకు గాని ఆలస్యమై ఇంతలో ఆరాజు చనిపోయి మరొక క్రొత్తరాజు వచ్చినను ఆదానమును పూర్వరాజుపేరిటనే జరిపించి అతనిపేరిటనే శాసనము వ్రాయించుట అసమంజసము గాజాలదు. పైనుడివిన బసూరుశాసనము ఇట్టిరాజశాసనము గూడ కాదు. బసూరునందలి తిరుమలదేవుని పూజాగమై భూమిని, ధనమును ఆయూరి ప్రజ లొసంగిరని తెలియజేయుచున్న ఈ సామాన్యశాసనమున వీరనరసింహరాయలు రాజుగ చెప్పబడినంతనే దీనిని ఉత్కృష్టప్రమాణముగ గైకొన సాధ్యము గాదు. ఒకొకమారు ఏకారణముచేతనైనను సింహాసన మెక్కిన క్రొత్తరాజు సర్వజనసమ్మతిని బడయజాలకపోయినను, రాజ్యమున అంతఃకలహములు బయలుదేరినను, ఒకటేమారు ఇద్దరు రాజులు ఎవరిమట్టుకు వారే రాజులమని వ్యవహరించినను జనసామాన్యమునకు ఏమి చేయుటకును దోచక క్లేశమున మరల స్వస్థితి గలుగు

వరకును గతించిన రాజుపేరనే తమ వ్యవహారములను నడపుకొనుట వాడుకగనుండెను. కాన క్రీ. శ. ౧౫౧౩-వ సంవత్సరమునందు గాని క్రీ. శ. ౧౫౧౦-వ సంవత్సరమునందు గాని, వీరనరసింహరాయ లింకను జీవించియుండి రాజ్యము చేయుచుండెనని చెప్ప వీలుగాదు. హంపిశాసనమునందు జెప్పినట్లు అప్పటికప్పుడే కృష్ణరాయనికి పట్టాభిషేకముగూడ జరిగియుండెను.

కృష్ణరాయని పట్టాభిషేకము క్రీ. శ. ౧౫౧౦ జనవరి ౨౩ లేక ౨౪ తేదీలకు చాలపూర్వమే జరిగియుండెనని వాదించుటకు గూడ సాధ్యముగాదు. ఏలయన పైన జెప్పినట్లు శకవర్షమే సరియైనదనియు, శుక్లసంవత్సరము తప్పనియు వాదించినయెడల శా. శ. ౧౪౩౦ నాటి కింకను వీరనరసింహరాయలు జీవించినట్లును, ఆసంవత్సరమునే కాక మరుసటి సంవత్సరమున గూడ కొంతకాల మతను రాజ్యమేలినట్లును తెలియుచున్నందున, తనయన్న బ్రదికియుండి రాజ్యమేలుచుండగనే కృష్ణరాయడు సింహాసన మెక్కెనని చెప్పవలసి వచ్చును. ఇందున కట్టియాధారమును గానరాదు. హంపి శాసనము కృష్ణరాయని పట్టాభిషేక మహోత్సవమునాటిది కాదనియు, అతనిపాలనమున ప్రథమ సంవత్సరాంతమున నొసర్చిన వర్ధంతినాటిదనియు చెప్పటకుగూడ పైకారణమువలన సాధ్యముగాదు. ఏలయన అట్లు చెప్పినయెడల పట్టాభిషేకము క్రీ. శ. ౧౫౦౯ ఫిబ్రవరి ౪ తేదియందు జరిగియుండవలెను. ఆతారీఖునకు పిమ్మట కొన్నినెలలవరకును వీరనరసింహరాయల శాసనము లింకను గాన్పించుచున్నందున ఈయూహ సమంజసముగ గన్పట్టదు. ఇంతకును హంపిశాసనము స్పష్టముగ కృష్ణరాయడు తనపట్టాభిషేక మహోత్సవ పుణ్యకాలమునందు చేసిన దానములను తెలియజేయుచున్నదని ఘోషించుచుండ సందేహమున కాస్పద మెచ్చట నున్నది? హంపిశాసనపు తారీఖునాడో, అందులకు కొలదిరోజులకు పూర్వమో కృష్ణరాయని పట్టాభిషేకము జరిగియుండుట నిశ్చయము.

ఈయూహ నిజమనుటకు మన కొక చిన్నయాధారము గలదు. విజయనగరచారిత్రమును కొంతమట్టుకు తెలుపు కొన్ని రాజకాలనిర్ణయ మను ప్రాచ్యలిఖితపుస్తకమునందు విజయనగరరాజులు ఒకరొక రెన్నిసంవత్సరములు పాలించిరో చెప్పియున్నది. కృష్ణరాయలు ౨౦ సంవత్సరములు పాలించెనని ఇందుచెప్పియున్నందున కృష్ణరాయల రాజ్యారంభ, అవసానకాలముల మధ్యనుండు అంతరము ౨౦ సంవత్సరములకంటె నంతివిశేష మెక్కువగా నుండ సాధ్యముగాదు. శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు యాల్పిగ్రామశాసనముపైనను, ఇస్మైల్ ఆదిల్ షాహ్ కృష్ణరాయని మరణానంతరమున రాయచూరి ముద్గల్లు దుర్గములను వశపఱచుకొన్న కాలముపైనను, అచ్యుతరాయ పట్టాభిషేక కాలముపైనను ఆధారముచేసి కృష్ణరాయడు విరోధి సంవత్సర మాఘ బ. ౧౧ నాటికి మరణించియుండవలెనని సిద్ధాంతముచేసియున్నారు. ఇందుండి వెనుకకు ౨౦ సంవత్సరములు లెక్కించినచో సరిగ శుక్ల సంవత్సరమాఘ బ. ౧౧ వచ్చును. హంపిశాసనము సరిగ నదేసంవత్సరముమాఘ బ ౧౪ నాటిదిగాన రాజకాలనిర్ణయమున నొసంగినకృష్ణరాయల రాజ్యకాలము సరిగా సరిపోవుచున్నది. కాని హంపిశాసనము రాజ్యాభిషేకకాలమునాటిది గాదనిగాని, అందిచ్చిన శకవర్షమే సరియనిగాని వాదించి కృష్ణరాయని పట్టాభిషేకకాల మింకను వెనుకకు గొనిపోయినచో పైసమన్వయము గుదురదు.

'విజయనగరసామ్రాజ్యదవు' అనునొక ప్రాచ్యలిఖితపుస్తకమున కృష్ణరాయల పట్టాభిషేకమునుగూర్చి ఈక్రింది విధముగ నున్నది: "శా. శ. అరునేటి శుక్లసంవత్సర ఆవణిమాసం శ్రీజయంతినాడు కృష్ణదేవరాయ మహారాయలు విజయనగరమందు పట్టాభిషిక్తులై వేంచేశిరి." డాక్టరువెంకటరమణయ్యగారు చెప్పినట్లు "ఆవణిమాసం శ్రీజయంతి పట్టాభిషేకమహోత్సవము నడచినదినము కాదు. పట్టాభిషేకానంతరము కృష్ణరాయలు విజయనగరపురమునకు ప్రథమమున ప్రవేశించిన దివస మది." కనుక పట్టాభిషేకమహోత్సవ మప్పటికప్పుడే ముగిసిపోయియుండును. ఈతారీఖునకును హంపిశాసనమునందలితారీఖునకును నడుమ ౫ నెలలకు పైగా విరామ మున్నందున ఇం దేదినిజమో తెలియరాదు. కాని 'విజయనగరసామ్రాజ్యదవు' అనుపైకదితము కృష్ణరాయడు సింహాసన మెక్కినపిమ్మట సుమారు

నూరేండ్లకు (సరిగా ౯౫ సంవత్సరములకు) వ్రాసిన గ్రంథము. హంపిశాసనము పట్టాభిషేక కాలమున కించుక పిమ్మట కృష్ణరాయలే తనరాజధానియందు వ్రాయించిన దానశాసనము. కాన ఈరెంటిలో హంపిశాసనమే గురుతర ప్రమాణము.

ఐనను పైకడితమునందలి తారీఖు సరియైనది కాదని త్రోసివేయ సాధ్యముగాదు. ఒకరీతిని ఈరెంటిని సమన్వయింప వీలగును. కడితమునందలి వాక్యమునుబట్టి కృష్ణదేవరాయని పట్టాభిషేకము ప్రథమమున విజయనగరమున జరుగలేదనియు, మరెచ్చటనో పట్టాభిషేకము చేసికొనినపిమ్మటనే కృష్ణరాయడు ఒకశుభ ముహూర్తమున విజయనగరమును ప్రవేశించెననియు స్పష్టమగుచున్నది. ఇది యొకవేళ నిజమైనను గావచ్చును. అచ్యుతరాయడు తిరుపతియందును, కాళహస్తి యందును రెండుమార్లు పట్టాభిషేకము గావించుకొని తాను విజయనగరాధిపతి నని ప్రకటించుకొనిన పిమ్మటనే విజయనగరమున కరిగి మరల మూడవమారు పట్టాభిషేకమహోత్సవము జరుపుకొనెను. ఇదియే అసలు పట్టాభిషేకము. కాననే ఈఅసలు పట్టాభిషేక కాలమునకును, అతనికి కృష్ణరాయని మరణమువలన రాజ్యము సంప్రాప్తించిన కాలమునకును, కొంతకాల మంతరముగలదు. ఈవిధముగనే కృష్ణరాయల రాజ్యారంభకాలమందు గూడ జరిగియుండవచ్చును. ఈయూహ నిజమైనయెడల కృష్ణరాయలకు వీరనరసింహరాయల మరణానంతరము రాజ్యము సంప్రాప్తమైనపిమ్మట కొంతకాలమువరకును విజయనగరమందు అసలు పట్టాభిషేకము జరగలేదని వ్యక్తమగును. అసలు పట్టాభిషేక మహోత్సవము శుక్ల సంవత్సర మాఘ శు. ౧౪ నాడో, కొన్నిరోజులు పూర్వమో జరిగియున్నదని హంపి శాసనమునుండి విశదముగ తెలియుచున్నందున, ఇక అతనికి రాజ్య మెప్పుడు సంప్రాప్తమాయెను, రాజ్యప్రాప్తి అనంతరమున ఎంతకాలమునకు పట్టాభిషేకము జరిగెను అను ప్రశ్నలు బయలుదేరును ఇందులకు సమాధాన మప్పటి శాసనములే కొంతమట్టుకు తెలియజేయుచున్నవి.

ఈక్రిందిపట్టికయు జూచినయెడల వీరనరసింహుని శాసనము లెప్పటికి అంతమగుచున్నవో కృష్ణరాయల శాసనము లెప్పు డారంభ మగుచున్నవో బోధపడును:

క్రీ. శ. ౧౫౦౯ సంవత్సరపునాటి విజయనగర రాజులశాసనములు.

| | | | |
|---|---|---|---|
| (౧) జనవరి ౧౫ | చెల్లూరు, కాళహస్తితాలూకా, చిత్తూరుజిల్లా | వీరనరసింహరాయలు | 419 of 1925 |
| (౨) జనవరి ౨౬ | అరగల్, అత్తూర్ తాలూకా, సేలంజిల్లా | ,, | 408 of 1913 |
| (3) ఏప్రెల్ ౫ | తేకల్, మాలూర్ | ,, | E C X Ml 6 |
| (౪) ఏప్రెల్ ౧౭ | కంజీవరం, కంజీవరంతాలూకా, చెంగల్పట్టుజిల్లా | ,, | 601 of 1919 |
| (౫) మే ౪ | తాడిపత్రి, తాడిపత్రితాలూకా, అనంతపురంజిల్లా | ,, | 342 of 1892 & S I.I.IV p. 27 |
| (౬) మే ౪ | ద్యావసముద్రం, బెంగుళూరితాలూకా, బెంగుళూరుజిల్లా | అచ్యుతరాయలు | E C IX Bn 5 |
| (౭) జులై ౨౧ లేక ౨౨ | విక్రవండి, విల్లుపురం తాలూకా, దక్షిణ ఆర్కాడుజిల్లా | వీరనరసింహరాయలు | 289 of 1915 |
| (౮) జులై ౨౬ | గుల్య, ఆలూరుతాలూకా, బళ్లారిజిల్లా | కృష్ణదేవరాయలు | 708 of 1919 |
| (౯) సెప్టెంబరు ౨౭ | దేవికాపురం, ఆర్ణితాలూకా, ఉత్తర ఆర్కాడుజిల్లా | ,, | 372 of 1912 |
| (౧౦) డిసెంబరు ౧౭ | బెళుగుప్ప, కళ్యాణదుర్గం తాలూకా, అనంతపురంజిల్లా | ,, | 27 of 1928 |



౭. తిరువీధి



౮. ఏకామ్రేశ్వరాలయ ప్రధానద్వారము

పైపట్టికయందలి మొదటి ౫ శాసనములనుండి వీరనరసింహుడు క్రీ. శ. ౧౫౦౯ మేనెల ౪ తేదీవరకును రాజ్యము చేయుచుండినట్లు స్పష్టముగ తెలియుచున్నది. ౬, ౭ సంఖ్యలుగల అచ్యుతరాయవీరనరసింహరాయల శాసనములు సంశయాస్పదములుగ నున్నవి. ౮-వ సంఖ్యగల జులై ౨౬ నాటిశాసనమునుండి అప్పటికప్పుడే కృష్ణరాయలు రాజ్యముచేయుచుండినట్లు స్పష్టముగ తెలియుచున్నది. తరువాతిశాసనములన్నియు కృష్ణరాయలవే. దీనినిబట్టి మే ౪, జులై ౨౬ తేదీలనడుమ నెప్పుడో వీరనరసింహరాయలమరణమును, కృష్ణరాయల రాజ్యప్రాప్తియు సంభవించియుండవలెనని తెలియనగును. రాజ్యప్రాప్తి అనంతరమున నెన్నిరోజులకు సింహాసనారోహణ మహోత్సవము జరిగెను అనునది వేరుప్రశ్న. జులై ౨౬ తేదీ నాటికి కృష్ణరాయడు రాజ్యాంగవ్యవహారములను జరిపించుటకు ప్రారంభించియుండెనని మాత్రము పైసుల్యా శాసనమునుండి విశదమగుచున్నది.

పైరెండుతారీఖులకును నడుమ సుమారు ౨ నెలల ౨౦ రోజులకాలము అంతరమున్నది. ఈఅంతరమును జులై ౨౧, లేక ౨౨ నుండి జులై ౨౬ తేదీవరకునుగల ౪, లేక ౫ దినములకాలమునకు తగ్గించి ఈ నాలుగైదు రోజులలోనే వీరనరసింహరాయలు మరణించి కృష్ణరాయలకు రాజ్యము లభించియుండునని మూర్టెల్ దొరగారు తలచిరి. ఈ ఊహకు పైపట్టికయందలి విక్రవండిశాసన మొక్కటే యాధారము. కాని ఈ శాసనమునకును, వీరనరసింహుని ఇతర శాసనములకును చాల తారతమ్య మున్నది. శాసనమునందు చెప్పిన రాజుపేరు వీరనరసింహు డని సరిగనే యున్నను, ఇతని కొసగిన బిరుదము లన్నియు సాళ్వబిరుదములే. వీరనరసింహుని రాజ్యారంభకాలమునందు వేయించిన కొన్ని కొన్ని శాసనములందు తన హక్కులేమిని కప్పిపుచ్చుటకై అప్పుడప్పుడు ఇతడు సాళ్వబిరుదములను వహించినను రానురాను అపద్ధతి మారెను. కాన అతని రాజ్యావసానకాలమందు మరల అత డేల సాళ్వబిరుదములను వహింపవలసివచ్చెనో యర్థముగాదు.

ఇంకొక విషయమున గూడ ఈ శాసనమున కొంత భేదము కాన్పించుచున్నది. శాసనదాతయొక్క తండ్రిపేరు 'కట్టారి సాళువ భుజబలదేవ మహారాయ' లని యున్నది. వీరనరసింహరాయల తండ్రియగు నరసానాయకుని మరెచ్చటను ఈ విధముగ గాని, కడకు భుజబలరాయడని మాత్రముగాని చెప్పియుండలేదు. భుజబలరాయ లను బిరుదము ఇమ్మడినరసింహరాయలకును, వీరనరసింహరాయలకును మాత్రమే కానవచ్చుచున్నందున ఈ శాసనమునందు తెల్పిన రాజు వారిద్దరిలో ఒకరి కుమారుడేమో యను శంకకు తావున్నది. ఇది ఎట్లున్నను ఈ శాసనము వీరనరసింహునిది మాత్రము కాజాలదని దృఢముగ జెప్పవచ్చును.

వీరనరసింహుని మరణానంతరమున జనసామాన్యమునకు కృష్ణరాయలరాజ్యాధిపత్యమునందింకను నమ్మకము కుదురకయున్నపుడు, పొత్తియదేవమహామండలేశ్వరుడు రాజ్యమునకు హక్కుదారులైన సాళ్వుల పేరిటనే శాసనము వ్రాయించియుండవచ్చును. కాని ఇమ్మడినరసింహునికి వీరనరసింహునియొక్క పుత్రు డుండెననియు, వాడు క్రీ. శ. ౧౫౦౯ వరకును జీవించియుండె ననియు తెలియనందున, బహుశః ఈ శాసనము తుళువవీరనరసింహరాయని కొడుకునకు సంబంధించినదేమోయని తోచుచున్నది. వీరనరసింహునికి నొకకుమారు డుండెననియు, వానిని తనయనంతరమున రాజుగ జేయింపవలెనని వీరనరసింహుడు ప్రయత్నించెననియు మనకు నన్నీజువృత్తాంతమునుండి తెలిసియేయున్నది. తిమ్మరుసువలన ఆప్రయత్నము భగ్నమాయెను. కాని తిమ్మరుసు బలవంతుడైయైనను, మాండలికులలో నొకరిద్దరు వీరనరసింహునితనయుని పక్షమవలంబించి కృష్ణరాయనిరాజ్యాధిపత్యము నంగీకరింపక వీరనరసింహునికొమరుని పేరిటనే శాసనములను వేయించుట యొకవిశేషము గాదు. మహామండలేశ్వర పొత్తియదేవమహారాజు ఒకగ్రామమునే దానముచేయు శక్తిగల గొప్పమండలేశ్వరుడు అట్టివాడు కృష్ణరాయని రాజ్యారంభము. అతనికని, అతనిమిత్రుడై తిమ్మరుసునకును పరాఙ్ముఖుడై ప్రవర్తించియుండినను నుండవచ్చును.

పైయుదాహరించు బెంగుళూరుజిల్లా ద్యావనసముద్రమునందలి శాసనము (పైపట్టికలో ఆరవది) కొంత యాధారమొసగుచున్నది. కాని యీశాసనమునందు చాల భాగము శిథిలమైయున్నందున సంపాదకులు దీనిని తర్జుమా చేయకవదలియున్నారు. దీనితారీఖు శకవర్షం ౧౪౫౧ వైశాఖశుద్ధపౌర్ణమి. ప్రభవాదిసంవత్సరముపేరు నొసంగబడినది కాని స్పష్టముగ తెలియనందున గాబోలు శాసన సంపాదకులు అందుచుక్కలనుంచియున్నారు. "అచ్యుతరాయమహారాయలు ప్రిథివీరాజ్యం సేయుచుండగాను" అని స్పష్టముగ యీశాసనమునందు వ్రాసియున్నందున ఇది అచ్యుతరాయని పేరిట వ్రాయబడినశాసనమని స్పష్టమగుచున్నది. ఇందలిశకవర్షము వర్తమాన సంవత్సరముగ గణించినయెడల ఈశాసనము క్రీ. శ. ౧౫౨౯ మే ౧౪-వ తేదీనాటిదియును, గతసంవత్సరముగ గణించినయెడల క్రీ. శ. ౧౫౩౦ ఏప్రెల్ ౨౮-తేదీ నాటిదిగాను అగును. సంవత్సరపుపేరుగాని, వారనక్షత్రములుగాని యీశాసనమునందు తెలుపనందున యీరెండుతారీఖులలో నేది సరియైనదో చెప్పజాలము. కాని క్రీ. శ. ౧౫౩౦ ఏప్రెల్ ౨౮ తేదీనాటికి కృష్ణరాయలరాజ్యాధిపత్యము అప్రతిహతముగ సర్వజనాంగీకృతమై యుండినందునను, అదివరకే, అనగా క్రీ. శ. ౧౫౩౦ జనవరి ౨౩, లేక ౨౪ తేదీలకుపూర్వమే యాతడు స్వర్గస్థుడైనట్లు నన్నిజు చెప్పిన ప్రకారము వీరనరసింహునికొడుకులను, తనతమ్ములను (అచ్యుతరాయలతోసహా) కారాగారబద్ధులనుగా జేసియుండుటచేతను పైశాసనమునందలి శకవర్షము గతవర్షముగ నెంచుటకన్న వర్తమానసంవత్సరముగ పరిగణించి ఆశాసనము క్రీ. శ. ౧౫౨౯ మే ౧౪వ తేదీనాటిదనుటయే సమంజసముగ నున్నట్లు తోచుచున్నది.

పై ద్యావనసముద్ర, విక్రవండి శాసనములనుబట్టి చూచినచో కృష్ణరాయడు నిరాతంకముగ రాజ్యాధిపత్యము నొందలేదనియు, తిమ్మరుసువంటి ప్రబలుడు తనపక్షపాతియై సర్వవిషయములను కడుసామర్థ్యముతో జరిపించినను రాజ్యమునందు కొందరైనను తొలుదొల్త కృష్ణరాయలయాధిపత్యము నంగీకరింపక ప్రతిఘటించిరనియు యూహించుట కవకాశము కలుగుచున్నది.

నన్నిజువృత్తాంతమునుండి తెలియునవి విషయములుగూడ ఈయభిప్రాయమునే బలపరచుచున్నవి. వీరనరసింహునికి సంతానముండినను, అతనియనంతరమున కృష్ణరాయనికే రాజ్యమునకు వచ్చుటకు హక్కుండెననియు, ఆహక్కును సరకుగొనక వీరనరసింహుడు తనకుమారునే తనయనంతరమున సింహాసన మెక్కించగోరి ప్రయత్నములు సల్పెననియు, అందువలన అతని కోరిక నెరవేరకపోయినను కృష్ణరాయడు రాజ్యమునకు వచ్చుటకు మాత్రము కొన్ని ప్రతిబంధకము లేర్పడెననియు నన్నిజువృత్తాంతమునుండి తెలియుచున్నది. వీరనరసింహునియనంతరమున రాజ్యమునకు వచ్చుటకు కృష్ణరాయలకే హక్కుండినట్లు ఈసందర్భమున నన్నిజు రెండుమార్లు (ఒకమారు కృష్ణరాయనితో నే) తెలియజేసియున్నాడు. ఒకవేళ కృష్ణరాయనికి రాజ్యమునందట్టిహక్కు లేదనియు, వీరనరసింహుని పుత్రునకే అతనియనంతరమున అన్నిహక్కులు నుండెననియు వాదించినయెడల, వీరనరసింహుడు విశ్వాసపాత్రుడైన తనమంత్రిని విశ్వసింపక ఏల కృష్ణరాయని చక్షుర్విహీనునిగ జేయుగోరెనో యథార్థముగాను కృష్ణరాయని ద్వేషభావముతో జూచియు వీరనరసింహుడు అతనిని తుదముట్టింపక, తన జీవితమునందే యతనిని కారాబద్ధునిగా జేయక, తన యవసానకాలమువరకును వేచియుండి అప్పుడతనిని కేవలము గ్రుడ్డివానిగమాత్రము చేయగోరుటకు గూడ ఏదోయొక బలవత్తరకారణ ముండవలయును. కృష్ణరాయనికి రాజ్యమునందేదోకొంతహక్కున్నందుననే, అతనిని కడతేర్చినయెడల అట్టి నిరంకుశప్రవర్తనమువలన ముప్పువాటిల్లు ననుభయమువలననే కాబోలు, వీరనరసింహరాయలు తనతమ్ముని అంగవిహీనునిగ మాత్రము చేసి రాజ్యానర్హునిగ జేయదలంచెను. కాని రాజ్యతంత్రకోవిదుడగు తిమ్మరుసు అభిప్రాయమునందు మాత్రము రాజ్యాభివృద్ధినిమిత్తమును, దేశక్షేమ నిమిత్తమును వీరనరసింహుని బాలకుమారునికన్న ౨౦ సంవత్సరములకుమించిన వయస్సునందున్న కృష్ణరాయలే రాజ్యార్హుడని నమ్మకమున్నందున అతడు దేశక్షేమము కొరకు తనయజమానుని మోసపుచ్చి కృష్ణరాయడే సింహాసన మెక్కునట్లు చేసెను. దీనిని బట్టియు,

పై జూపిన శాసనాధారములను బట్టియు కృష్ణరాయడు నిరాటంకముగ రాజ్యమునకు రాలేదని స్పష్టమగుచున్నది.

రాజ్యాధిపత్యమునకు సంబంధించిన కలహము లన్నియు వీరనరసింహరాయల మరణానంతరము నందే సంభవించియుండవలయును గాని అంతకు పూర్వము సాధ్యముగాదు. అట్టిచో క్రీ. శ. ౧౫౦౯, మే ౨౨వ తేదీన తాడిపత్రిశాసనమునుండి వీరనరసింహరాయలు అప్పటి కింకను బ్రతికియుండెనని తెలియుచున్నప్పుడు అదే తారీఖున అచ్యుతరాయల శాసన మొకటి గాన్పించుట చిత్రము. కాని వీరనరసింహరాయల మరణమున కేదో యొక వ్యాధియే కారణమని జ్ఞాపక ముంచుకొన్న యెడల ఈవిషయము సరిగ నర్థమగును. రాజు బ్రతికి యున్నను అతడు వ్యాధిగ్రస్తుడై చాలాదినము లున్న యెడల అతని అవసానదశలో లేనిపోనిపుకారులు పుట్టుట యొకవిశేషము గాదు. అట్టిచో ఎడతెగని యుద్ధముతో అశాంతియందున్న ఆకాలమున రాజధానికి కడుదూరముననున్న ఒకప్రదేశమున వ్యాధిగ్రస్తుడైన రాజు ఇంకను కొనయూపిరితో నున్నప్పుడే మరణించెనని వార్తలు బయలుదేరుట విచిత్రము గాదు.

పై యంశములను బట్టి వీరనరసింహరాయలు క్రీ. శ. ౧౫౦౯ మే ౮ తేదీ యనంతరమున కొంత కాలమునకే చనిపోయియుండెననియు, తొలుదొల్త కొంతమంది కృష్ణరాయని రాజ్యాధిపత్యమునకు తమ యసమ్మతిని గనుపరచినను సుమారు ౨ లేక 3 నెలల లోననే, అనగా జూలై ౨౬ తేదీకి పూర్వమే కృష్ణరాయడు రాజ్యభారము వహించి రాజ్యాంగ వ్యవహారములను సరిగా నడుపుచుండెననియు, క్రీ. శ. ౧౫౧౦ జనవరి ౨౩ లేక ౨౪ తేదీలలోననే అతని అనలుపట్టాభిషేకము జరిగియుండెననియు విశదమగు చున్నది.[౧]

౧. ఈ సందర్భమున కుమారధూర్జటి ప్రణీతమైన కృష్ణరాయవిజయమునందు నరసనాయకుడు తన యవసానకాలమందే కృష్ణరాయనికి పట్టము గట్టెనని చెప్పి యున్నది. వ్యాధిగ్రస్తుడై జీవితాంతముననున్న నరసనాయకుడు తన కుమారుల తెలివితేటలను పరీక్షించుటకై వారిని పిలిపించి తన ముద్రాంగుళీయమును గైకొనుమని చెప్పెననియు, జబ్బుతో అతనివ్రేలు వాచియున్నందున ఆ యుంగరమును వ్రేలినుండి లాగుకొన లేక ఇద్దరుకుమారులు వ్యర్థప్రయత్నములు సల్పుచుండ కృష్ణరాయడు తనకత్తితో వ్రేలిని ఛేదించి తీసెనని నుదుజాడ శ్రీరామమూర్తిగారు చెప్పుచున్నారు. కృష్ణరాయవిజయమునకు ఆధారమనదగు రాయవాచకము నందును కృష్ణరాయవిజయమునందువలెనే చెప్పబడియున్న దని కృష్ణస్వామిఅయ్యంగారు, రంగస్వామి సరస్వతిగార్లు వ్రాసియున్నను అది పొరపాటని తోచుచున్నది. రాయవాచకము ప్రారంభభాగము శిథిలమై నశించిపోయియున్నందున కృష్ణరాయనికి పూర్వము ఎవరు రాజ్యము చేసిరో తెలియరాదు. కాని రాయవాచకము ౨౦వ పుటయందు కృష్ణరాయలకుపూర్వము "యీశ్వరనాయడున్ను, నరసింహ్వనాయడున్ను, వీరనృసింహరాయలవారు రాజ్యపరిపాలనగావించినారు" అని స్పష్టముగ జెప్పియున్నందున కృష్ణరాయవిజయమునందలి వృత్తాంతమునకుగాని, నుదుజాడవారికథకుగాని, కృష్ణస్వామిఅయ్యంగారు రంగస్వామిసరస్వతిగార్ల వ్రాతలకుగాని ప్రామాణికమగు ఆధారము ఇసుమంతైనను గానరాకున్నది.

## మొదటిరేకు : రెండవ ప్రక్క

శుభమస్తు[।]*నమ(ః)స్తు[ం]*గశిరశ్చు[ం]బి చంద్రచామర చారవే[।]*త్రైలోక్యన
౨ గరారంభమూల స్తంభాయశంభవే॥[౧]*హారేల్లి[౯]*ల్లా[1]వరాహస్య దంష్ట్రా దండన[2]
పాత[3]వః[।]*హేమాద్రికలశాయత్ర ధాత్రీఛత్రశ్రియందధౌ॥[,౨*]*కల్యాణాయా
౪ స్తుతద్ధామప్రత్యూ[4]హతిమిరాపహం।యద్గజోప్యగజోద్భూతంహరిణాపిచపూ
జ్యతే॥[౩]*అస్తిక్షీరమయాద్దైవైమ[౯]*థ్యమానా(ం)న్మహాంబుధేః[।]*నవనీతమివో
౬ ద్భూతమపనీతతమోమహః॥[౪]*తస్యాసీత్తనయః స్తపోభిః తుల్యైరన్వర్థ
నామాబుధ[ః]*పు(ం)త్యైనాస్యపురూరు[5]వాభుజబల్యై రాయుద్వషా[ం]*నిఘ్నతః। తస్యా
౮ యురనహుషోస్యతస్యపురుషైః[6]యుద్ధయయాతి [ః] *క్షితౌ [।] *ఖ్యాత స్తస్యతుతూ[7]
వ[౯]సూవ
సునిభ[ః]శ్రీ దేవయానీపతేః॥[౫]*తద్వంశే[8]దేవకీజానిర్దిదీపేతింమభూపతిః।
౧౦ యశస్వీ[9]తులువే[ం]* ద్రేషుయ[10]దాకృష్ణ ఇవాన్వయే। [౬] *తతోభూద్బుక్కమాజా
ని[ః]*ఈ
శ్వరక్షితిపాలకః।అత్రానమగుణాభ్రంశంమాలిరత్నంమహీభుజాం॥[౭]*
౧౨ సరసాదుదభూ[11]స్తస్మాన్నరసావని పాలకః। దేవకీనందనాత్కామోదే
వకీన[ం]దనాదివ॥[౮]*తిపా[12]ఖ్యనాగలాదేవ్యో[ః]*కౌసల్యాశ్రీసుమిత్రయో[ః।]*
౧౪ దేవ్యోరివనృసింహేంద్రాత్తస్మాత్పం క్తిరథాదివ।[౯]*వీరావిసయినౌరామల
క్ష్మణావివనందనౌ।జాతౌవీరనృసింహేంద్రకృష్ణరాయమహీపతీ।[౧౦]*వీ
౧౬ రశ్రీనారసింహఃసవిజయనగరేరత్నసింహాసనస్థఃకీర్త్యానీత్యా
నిరస్య[13]నృగనలనహుషానప్యవన్యామథాన్యాన్।ఆసేతోరాసు
౧౮ మేరోరవమి[14]సురనుతఃస్వైరమాచోదయాద్రేరాపాచ్యా[15]త్యాచలాంతాద
ఖిలహృదయమావర్జ్యరాజ్యంశశాస[15A]॥[౧౧]*నానా[16]దనాన్యకాపీ[17]కనక
౨౦ సదసియఃశ్రీవిరూపాక్షదేవస్థానేశ్రీకాలహ స్తీశితురపినగరే వేం
కటాద్రౌచకాంచ్యాం।శ్రీశైలేశోణశైలేమహతిహరిహరే[౭]*హోబలేసంగ
౨౨ మేచశ్రీరంగేకుంభగోణేహతతమసిమహానందతీర్థే[18]నివృత్తౌ[19]।[౧౨]*గోక
ర్ణేరామసేతౌ[20]జగతితదితరేష్వప్యశేషేషుపుణ్యస్థానేష్వాల[21]భనానా
౨౪ విధ హాలమహాదానవారిప్రవాహైః[।]*యస్యోదంచత్తురంగప్రకటఖురరజ

1. °లీలా° అనిచదువవలెను. 2. °దండస్స°, 3. పాతు, 4. ప్రత్యూహ°, 5. పురూరవాం°, 6. పురుషో, 7 తువలసు°, 8. తద్వంశే, 9. యశస్వీ, 10. యాదౌ, 11. దుదభూత్తస్మా, 12. తిప్పాజీ°, 13. నిరస్యన్నృగ°, 14. °మేరోరవని°, 15. °పాశ్చాత్యా°, 15 A. శశాస, 16. °దానా°, 17. °న్యకాపీల్, 18. °తీర్థే, 19. నివృత్తౌ, 20. °సేతౌ, 21. °ష్వాలభ్య°,

## రెండవ రేకు : మొదటి ప్రక్క

శు[22]ష్యదంబోధిమగ్న క్ష్మాభృత్పక్ష[23]భిదోద్ధత్తరకులిశధరోత్కంఠితా

౨౬ కుంఠితాభూత్ ॥[౧3]*బ్రహ్మాండంవిశ్వచక్రంఘటముదితమహాభూతకంరత్న ధేనుం

సప్తా[ం]*బోధిచ[24]కల్పక్షితిరు[హా]*ల[తి]*కంకాంచనంకామధేను ।స్వర్ణక్ష్మాయా[25]హి

౨౮ ర(ం)ణ్యా[26]స్వరథమపితులాపూరుషంగోసహస్రంహేమాశ్వంహేమగర్భం

కనకకరిఘటం[27]పంచలాంగల్యమేవ।[౧౪]*ప్రాజ్యంప్రసస్య[28]నిర్వి

30 ఘ్నంరాజ్యందాది[29]వశాని[30]తుం।తస్మిన్గుణేనవిఖ్యాతేక్షితేంద్

ద్రా[31]ద[32]వంగతే।[౧౫]*తత్పోష్యవాయర్వీ[33]రశ్రీకృష్ణరాయమహీపతిః।వి

3౨ భర్తిమణికేయూరనిర్విశేషంమహీ[ం]*భుజాం[34]॥[౧౬]*కీర్త్యాయస్యసమం

తతఃప్రసృతయాపిశ్వంరుచైక్య వ[35]జేదిత్యా(ర్)శంక్యపురాపురారిర

3౪ భవద్భాలేక్షణఃప్రాయసః[36]।పద్మాక్షోపిచతుర్భుజో[౭]*ఽనిచతుర్వ

క్త్రో[౭]*భవత్పద్మభూఃకాలీఖడ్గమదాద్రమాచకమల[ం]*వాణా[37]చవా

3౬ ణీకరై[ః]।*[౧౭]*శత్రూణా[ం]*వాసమేతేదదత ఇతిరుషాకింనుసప్తా[ం]*బురాశీ

న్నానాసేనాతురంగత్రుటితవసుమతీధూలికాపాలికాభిః।సం

3౮ శోష్యక్షైర్వ[38]మేతత్ప్రతినిధిజలధిశ్రేణికాయోవిధత్తేబ్రహ్మాండ

స్వర్ణమేరు(ం)ప్రముఖనిజమహాదానతోయైరమేయైః॥[౧౮]*మద్ధత్తామర్థి[ని]*సా

౪0 త్కా[39][ః]శ్రియమిహాసుతరాంభు[ం]*జతామిత్యవేత్యప్రాయఃప్రత్యూహహేతో స్త్వపన

రథగతం[40]రాలయో[41]దేవతానాం॥తత్తద్దిగ్జైత్రమృత్యా[42]పిచబిరుదప

౪౨ దైరంకితా[ం]*స్తత్రత్ర స్తంభ[43]జాత[44]ప్రతిష్ఠాన్మతనత[45]భువియోభూభృద

భ్రంకషాగ్రాన్॥[౧౯]*కా[ం]*చీశ్రీశైలే[46]శోణాచలకనకసభావం[47]కటాద్రి

౪౪ ప్రముఖ్యేష్వావర్త్యా[సు]*వర్త్య[48][సు]*సర్వేష్వకృతవిధినచ్ఛే[49]యసీభూయసేయః। దే

వస్థానేషుసర్వేష్వపికనకతులా[పూ]*రూ[50]షాదీనినానాదా[51]నోపదా[52]నో

౪౬ రపిసమమఖిలైరాగమోక్తానిదా[53]ని॥[౨౦]*రోషకృతప్రతిప[54]థి[సు]*

వదండఃశేషభుజ[ః]*క్షితిరక్షణశౌ[ం]*డః।భాషిగెతప్పువరాయరగండ[ః]

---

22, °ష్మవ్య°, దంభోధి, 23. °క్ష్మాభృత్పక్ష°, °భిదోద్యత్తర°, 24. సప్తాంబోధీంశ్చ, 25, స్వర్ణక్ష్మాంయో, 26. °హిరణ్యాశ్వ°, 27. రథ అని శాంపిళాసనపాఠము. 28. ప్రశాస్య అని చదువవలెను. 29. ద్యామిక, 30. శాసితుం, 31. క్షితీంద్రే, 32. దివం, 33. °వీరః°, 34. భుజే 35. ప్రజే° 36, ప్రాయశః, 37. వీణాం, 38. స్సైర°, °మేతత్ప్రతినిధి°, 39. °మర్థిసార్థాః, 40. °రథగతే°, 41. °రాలయం, 42. °వృత్త్యా, 43. స్తంభాన్, 44. జాతప్రతిష్ఠా°, 45. °స్వత్యనత, 46. °శ్రీశైల°, 47. °వేంకటాద్రి°, 48. °ష్వావర్త్యాగ్రవర్త్య, 49. °విధివచ్ఛ్రియసే, 50. °పూరుషాదీని, 51. ఇక్కడపొరబాటున 2 అక్షరములు (గురువులు)వ్రాయలేదు, 52. °దాసై°, 53. తాని, 54. °పార్థివ°

## రెండవ రేకు : రెండవ ప్రక్క

౪౮ స్తోమకృతథిూమ[55]మోరణచండః।[।౨౧]*రాజాధిరాజఇత్యుక్తో యో రాజప
రమేశ్వరః।మూరురాయరగండ[ం]*కఃపరరాయభయంకరః[॥౨౨]*హిందూరాయ
౫౦ సురత్రాణోదుష్టసా[56]దూూలమర్దనః।గజౌఘగండభేరుండఇత్యాది
బిరుదాన్వితః।[।౨౩]*ఆలోకయమహారాజజా[57]యజీవేతివాదితిః[58]।
౫౨ అంగవంగకలి[ం]*గాద్యైరాజభిఃపరిసేవ్యతే।[।౨౪]స్తుత్యోదాయూ[59]సుధీ
భిఃసవిజయనగరేరత్నసింహాసనస్థఃక్ష్మాపాలాన్‌కృష్ణరాయ
౫౪ క్షితిపతిరధరా[60]కృత్యనీత్త్యా[61]నృగాదీన్ । ఆపూర్వా[ద్రే]*ద్రే[62]రథాస్తక్షితి
ధరకటకాదాచహేమాచలం[63]తాదానేతోరథిసాథూ[64]శ్రియమిహ
౫౬ బహులీకృత్యకీర్తిూన్వత(ం)న్వ[న్]* [౨౫]*శాలివాహననిర్ణీతేశకాబ్దే
శచతుశ[65]తైః । ద్వాత్రింశతాచశం[66]యుక్తై[ః]*శం[67]ఖ్యాతేదశభిస[68]త్తై[ః]*॥[౨౬]*
౫౮ ప్రమోదవత్స[69]రేపుష్యమా శే[70]మకరశం[71]క్రమే।కృష్ణపక్షేత్రయోదా[72]
స్యాంజ్యేష్ఠక్షూ[73]మందవాసురే[74]।[।౨౭]*తుంగభద్రాపగాతీరేస్రీ[75]విరూపా
౬౦ క్షశం[76]నిధౌ(ః)।వరగౌతమగోత్రాయయాజుషాయయశస్వినే[77]।[।౨౮]*సూ
క్తామ్రేర మరాజస్య సూనవేశ్రుతిసో[78]భినే।విద్యావిసయచా
౬౨ రిత్రహృద్యాయగురవేధియా।[।౨౯]*సర్వశాస్త్రవిదేచంద్రమౌలివిప్రయ[79]
సూన[80]వే।చంద్రగిర్యాూఖా[81]రాజ్యస్తం[82]కల్మిహస్తి[83]సీమగం[॥౩౦]*వెం
౬౪ దోడుగ్రామతఃప్రాచ్యంపోతుగుంటాచ్చదక్షిణం।పశ్చిమంపరత
శ్చాపిసగుటోరోరథోత్తరం[॥౩౧]*అత్రభాగాప్రథంజ్ఞాతంభక్త్యా
౬౬ త్మానాన్‌మహీసురైః।కృష్ణరాయపురంచ[84]తిప్రతినామాపశో
భితం[॥౩౨]*గ్రామంమనోహారంపోలిపాటినామాన(ం)ముత్తమం[।]*సర్వమాన్య[ం]*
౬౮ చతుసీ[86]మాస[87]యుతంచసమంతతః।[।౩౩]*సర్వదానసర్వసస్యాఢ్యంసి
ద్ధసాధ్యాదిసంయుతం । నిధినిక్షేపపాషాణాద్యష్టభోగైర
౭౦ శేతరైః।[।౩౪]*వివిధైశ్చఫలైర్యుక్తంపకభోగ్యంసభూరుహం[।]*వాపీ
కూపతటాకైశ్చకచ్ఛేనాపిసమన్వితం॥[౩౫]*పుత్రపౌత్రాదిభిర్భోగ్యం
౭౨ క్రమాదాచంద్రతారకం । దానస్యాధమనస్యాపివిక్రయస్యాపిచోచితం[॥౩౬]*

---

55. °కృతథిూషు, 56. °శార్దూల°, 57. జయ, 58. వాదిభిః, 59. °దాయూస్సుధీభిః, 60. °రధరీకృత్య, 61. నీత్యా, 62. ఆపూర్వాద్రే°, 63. హేమాచలాంతా°, 64. °రథిూసాథూ°, 65. సచతుశ్శతైః, 66. సంయు క్తైః, 67. సంఖ్యాతే, 68. జలభిశ్శతైః, 69. ప్రమోదావత్సరే, 70. °మాసే, 71. సంక్రమే, 72. త్రయో దస్యాం, 73. జ్యేష్ఠక్షూ, 74. °వాసరే, 75. శ్రీ°, 76. సన్నిధౌ, 77. యశస్వినే, 78. °శోభినే, 79. °విప్రాయ, 80. సూరయే, 81. చంద్రగిర్యాఖ్య°, 82. °రాజ్యస్థం, 83. కాలహస్తి°, 84. చేతి, 85. లిపి కారుడు మొదట మనోహారం అనివ్రాసి పిమ్మట దానిని మనోజ్ఞం అని మార్చినట్లు తోచుచున్నది. ఈమార్పువలన ఛందోభంగము కలుగుచున్నది. 86. చతుస్సీమా°, 87. సంయుతం,

మూడవరేకు; మొదటిప్రక్క

పరీతప్రయతైస్సిద్ధై[88]పురోహితపు[రో]*గమైః।వివిధైర్విబుధైశ్శ్రో[89]త

౭౪ పథికైరధికైర్గిరా[ః౩౭]*కృష్ణదేవమహారాయోమానసీయోమ

నస్వినాం।దక్షిణం[90]సహితంధారాపూర్వకందత్తవాన్ముదా॥[౩౮]*తది

౭౬ దమవసీవనీపకవినుతధరాయస్యకృష్ణరాయస్య[।]*శా

సనమతివలే[91]శాసనతరుకరదానస్యసాహదానస్య॥[౩౯]*

౭౮ మల్లణాచార్యవర్య(శ్రీ)వీరణాచా

ర్యనందనః[।]*ఆకల్పమశ్నుతేతై కాంవ్యాత్తింశాసనలేఖకః॥[౪౦]*

౮౦ ఏకైవభగినీలోకేసర్వేషామేవభూభుజాం[।]*నభోజ్యానక

రగ్రాహ్యావిప్రదత్తావసుంధరా।[౪౧]*గ(ం)ణ్యాంతేపానవో[92]భూమిగ(ం)ణ్యాతే

౮౨ వృష్టిబిందవః[।]*నగణ్యాతేవిధాతాయబ్ర(ం)హ్మసంస్థా[93]పనఫలః[94]॥[౪౨]*

దానపాలనయోర్మధ్యేదానాచ్ఛ్రేయోనుపాలనం[।]*దానా[త్]*స్వర్గమవాప్నో

౮౪ తిపాలనాదచ్యు[95]తంపదం॥[౪౩]*స్వదత్తాద్విగుణంపుణ్యంపరదత్తాను

పాలనం[।]*పరదత్తాపహారేణస్వదత్తంనిష్ఫలంభవేత్॥[౪౪]*

౮౬ సామాన్యోయంధర్మసేతుర్నృ[ణ]*పాణాంకాలేకాలేపాలనీయోభవద్భిః[।]*

సర్వానేన్ద[96]భావినఃపార్థివేంద్రాన్భూయోభూయోయాచతేరామచంద్రః॥[౪౫]*

---

[88. ...]గ్గ, 89. విబుధైశ్శ్రిత°, 90. దక్షిణాసహితం, 91. °మతివలశాసన, 92. [illegible] 93. °సం[illegible], 94. °ఫలం, 95. °దచ్యుతం, 96. సర్వానేతాన్ అని చదువవలెను.




౧

ఈటాకీలు రాని క్రితంమాట. బొంబాయి లక్ష్మీపిక్చర్స్ కార్పొరేషన్ వారి స్టూడియోలో

“రెడీ” అన్నాడు డైరెక్టరు బాబూరావు. మూడు రిఫ్లెక్టర్లు (reflectors) ఫోకస్ చేశారు పార్వతివైపు. కెమేరాహాండిల్ మీద చేత్తోనుంచున్నాడు ఫొటోగ్రాఫరు. కాని డైరెక్టరువద్దనుండి మొదలుపెట్టమన్నమాట రాలేదు.

“ఏం పార్వతీ, ఈ వేళ రోజూకన్నా పాడుగా ఉందే? ఏమీ నిన్నటి రిహార్సల్లో చెప్పినవన్నీ మర్చిపోయావ్ ?”

“ఏమండీ ? ఏంలోపం వచ్చింది ?” అన్నది పార్వతి చేతులోనున్న కాగితాన్ని కొంచెం క్రిందికిదించి.

“అంతాలోపమే... నువ్వు ప్రేమించిన యువకుడు, నిన్నింతకుపూర్వం ప్రేమవాహినీతరంగాలలో తేలించి జీవితపరమావధిని చవిజూపిన ప్రియుడు, యిప్పుడు నిన్నేమాత్రమూకూడ ప్రేమించుటలేదనీ, యిదివరకటి నడతంతాకూడ నటననీ నీకొక ఉత్తరం వ్రాసేడనుకో. దానిని చూచినప్పుడు నీకే యేభావాలు కలుగుతాయో యిక్కడ కనపర్చాలి.”

“అమ్మయ్యో ! అంతవరకు ఊహించలేదండీ.ఏభావంచూపాలి చెప్పండి.కోపమా? విచారమా?...”

“చాల్చాలు. ఇక్కడ చూపవలసిన భావమొక్కటి కాదు. అనేకభావాలు వరుసగా ఒకదానితర్వాతొకటి కనపర్చవలసుంటుంది.”

“... ... ......”

“మరేమీకష్టంలేదు. చూడూ.నువ్వొక యువకుణ్ణి ప్రేమించావనుకో.”

“ఊఁ. ప్రేమించాననుకున్నా.”

“ప్రేమించానని మనస్సులో ననుకోడం కాదు. నిజంగా ప్రేమించినట్లే భావించాలి. ... ...ప్రేమించాలి.”

బాబూరావు గొప్పమేధావి. పిన్నవయసు ఫిలిండైరెక్టర్లలోకల్లా ఘనుడు. స్ఫుర

ద్రూపి. పార్వతి ఫిల్ముస్టూడియోలో చేరి కొలదికాలమే ఐంది. ఇదివరకు చిన్న చిన్న పాత్రలు ధరించేది. కాని, ఆమెసౌందర్యం చేత నాకర్షింపబడి ప్రజలందరూకూడ ఆమె నటించిన ఫిల్ముకు వస్తూండేవారు. ఇది కని పెట్టే మేనేజ రీమె నొకఫిల్ములో నాయికా పాత్ర ధరింపచేయవలసిందని డైరక్టర్ని కోరేడు. కాని డైరెక్టరామెకు నటించు శేమియూ చేతకాదనీ, భావా లేమాత్రమూ కూడ చూపలేదనీ ఎంతచెప్పినా మేనేజరు వినలేదు. ఆయనకి తెలుసు పార్వతి నాయికా పాత్ర ధరించిందంటే ఫిల్ముకి అద్దె యెక్కువ వస్తుందని.నటనాకౌశలంతో ఆయన కేమిపని? అదంతా బాబూరావుమీద వదిలేసేడు. పాపము బాబూరావు ప్రతియొక్క దృశ్యా నికీకూడ ఎంతో కష్టపడుతున్నాడు.

ఈ సమయంలో యేమీ తోచలేదు బాబూరావుకి. ఆలోచించాడు. రెప్పవాల్చ కుండా తేరిపారచూసేడు పార్వతిముఖం వైపు రెండునిముషాలు. పార్వతి తెల్లబోయిం దాతని వైఖరి చూసి. ఇంతలో అతని కేదో తోచింది. పెదవు లదిరేయి, కన్నులు కొంచెం కదిలేయి. ముఖమెర్రబారింది. పార్వతికి భయం వేసింది.

" ఈరోజుకి పనైపోయింది. మీరంతా వెళ్లిపోవచ్చు" అన్నాడు ఘట్టిగా. పనివా ళ్లంతా వెళ్లిపోతున్నారు. పార్వతిమనసు కుదుటబడింది. ఆరోజుకి తనపనైందికదా అని సంతోషించింది. స్టూడియోలోంచి యింటికి పోబోతూండగా బాబూరావు కలుసు కున్నాడు.

"పార్వతీ, నాకార్లో తీసుకువెడతాను వస్తావా!" అన్నాడతను. "నన్నా!" అంది పార్వతి తెల్లబోయి. బాబూరావుసంగతి పార్వ తికి తెలుసు. ఇదివర కెందరో స్త్రీ లీతణ్ని తమ వలలో వేసుకుందుకు ప్రయత్నించి విఫలు లయ్యేరు. ఎందరో భాగ్యవతులగుస్త్రీలు పెండ్లిచేసుకుందామని చూచేరు కాని బాబూ రావు నిరాకరించేడు. పార్వతి తాను స్టూడి యోలోకి వచ్చినక్రొత్తలో యీతనికై కొంచెం వ్యామోహపడింది గాని, తనకళ్ల యెదుట పరాభవంజరిగిన స్త్రీలని చూసి తన వ్యామోహాన్ని చంపుకుంది. "నన్నా"అన్న పార్వతి ప్రశ్నకి నవ్వుతూ అవునన్నాడు బాబూరావు.

"సరే" నన్నది పార్వతి.

ఇద్దరూ కార్లో కూర్చున్నారు.

౨

"పార్వతీ, ఈ రోజు చాలాఅలసిపోయేవు పాపం!" అన్నాడు బాబూరావు. అతని ముఖంలో యెప్పటి నిశ్చలత లేదు. మాటలో యిదివరకటి మాధుర్యం లేదు. కళ్లల్లో యిది వరకటి తేటులేదు. కాని బాబూరావు ప్రక్కను కార్లోకూర్చున్నా ననే సంతో షంలో యివేవీ గుర్తించ లేదు పార్వతి.

"శ్రమేమీ లేదు. నావృత్తే అదిగా. అప్పు డేదో కొంచెం శ్రమనిపించినా, యిప్పుడు

మాత్ర మేమీ లేదు. హాయిగాఉంది" అల్లాంది చిరునవ్వుతో అతనిముఖంవైపు చూస్తూను. ఆతనిముఖవైఖరిచూసి కాస్త చకిత ఐంది. ఇంతలోనే పార్వతింటిదగ్గర కారాగింది. కారు దిగింట్లోకి వెళ్లబోతూ బాబూరావు వైపు తిరిగి,

"తమరు శ్రమపడ్డారు నాకోసం. అనేక వందనాలు. శెలవ్రా" అని వెనుదిరిగి పోబోతోంది.

పార్వతి లోపలికి టీకోసం పిలుస్తుందను కున్నాడు బాబూరావు. కాని, అతనిచేత రాననిపించుకోడ మెందుకని కాబోలామె పిలవ లేదు.

"పార్వతీ, ఇంకా చాల ప్రొద్దుంది. కబ్బు కెప్పుడూ రారు. ఒకరగంట యిక్కడుండే వెళ తా"నన్నాడు బాబూరావు నిర్మొహమా టంగా. కార్యసాఫల్యం కోరేవానికి మోమా టంతో పనేమిటి?

పార్వతి నిర్ఘాంతపోయి, వెంటనే తెలివితెచ్చుకుని "తప్పక దయచేయండి" అంది ఆశ్చర్యసూచకమైన చూపుచూసి. పార్వతి ఆమాట అనడమే తడవుగా కార్లోంచి క్రింద కురికేడు బాబూరావు.

ఆనాటి బాబూరావు ప్రవర్తనకు కారణ మేమైఉంటుందా అని ఆలోచిస్తూ యింట్లోకి దారితీసింది. వెనుకనే బాబూరావుకూడా వెళ్లేడు. అతి నీరోజున ఆమెతో యింతచను వుగా మాట్లాడడానికి ఇంకేకారణం కన్పడ లేదామెకి ఒక్కటి తప్ప. అతడు తనని ప్రేమించియుండాలి... సావిట్లోకి వచ్చారు యిద్దరూ.

"దయచేయండి" అనొక కుర్చీచూపిం దాతనికి.

ఐతే యిదివరకులేని ప్రేమ ఇప్పుడెల్లా వచ్చిందా అని సందేహం కలిగింది. ఏమో మగవారిచేష్టలకి సబబుప్లా, సందర్భం యేమి టనుకుంది. బాబూరావులాంటి ప్రియుణ్ణి సంపాదించబోతూన్నందుకు ఆనందంతో పొంగిపోయింది.

"ఏంపార్వతీ, నిల్చునిఆలోచిస్తున్నావూ? కూర్చో" అన్నాడతడు.

"ఇదిగో వస్తున్నా" నని లోపలికి వెళ్లి దుస్తులుమార్చి రెండునిముషాల్లో మళ్లా వచ్చింది. ట్రేతో బిస్కట్లు, టీ తీసుకువచ్చి టేబిల్ మీద పెట్టిపోయేడు నౌఖరు. టీ కప్పుల్లోపోస్తూ బాబూరావువైపు చూసింది పార్వతి. అతడు తనవైపే రెప్పవాల్చకుండా చూస్తూండడం గమనించింది. తన సౌందర్యా బ్ధిని మునిగినవానినిగా తెలుసుకుంది.

"తీసుకోండి" అంది పార్వతి.

"ఆ" అన్నాడు బాబూరావులిక్కిపడి నిద్రనుండి అకస్మాత్తుగా లేపబడినవాడిలాగ.

తన ఊహాల్ని స్థిరపర్చుకుంది పార్వతి. తన అదృష్టానికి పొంగిపోయింది. ఇతరనటీ మణుల కందరికీ తలతీసేసిన ట్లుంటుందని విఱ్ఱ వీగింది.

టి పూర్తియైనతర్వాత,

"తోటలోకి వెడదాం రండి. చాలా క్రొత్తక్రొత్త మొక్కలు వేయించాను. మీరెక్కడా చూసుండరు అల్లాంటిపువ్వులు" అంటూ దారితీసింది అతని దృష్టిలోంచి తప్పించుకోడానికి.

"అవశ్యమూ చూడవలసినవే" అని వెనకనే బయల్దేరాడాతడు తన కార్యసాఫల్యానికి మొదటి మెట్టు పూర్తైంది కదా అన్న సంతోషంతో ఒక్కచిరునవ్వునవ్వి. తోటలో ఒక చిన్న చలువరాతిపై కూర్చున్నారిద్దరూను. అప్పుడే వస్తూన్న చంద్రుడు నవ్వుతున్నాడు బాబూరావు తెలివితేటలూ, పార్వతి అమాయికత్వమూ చూచికాబోలు.

" పార్వతీ ..."

అతనికంఠము అదో మోస్తరుగా ఉంది. పార్వతి మాటాడలేదు.

" పార్వతీ అనామెను దగ్గరకు తీసుకున్నాడు. ఆమె యాతనికౌగిట్లోకి ఒరిగింది.

3

బాబూరావు వెళ్లిపోగానే పార్వతి



"పార్వతీ..." అనామెను దగ్గరకు తీసుకున్నాడు. ఆమె యాతనికౌగిట్లోకి ఒరిగింది.

తనజీవితమనెడి ప్రబంధంలో రెండో ఆశ్వాసం ప్రారంభమైనట్లు తలచింది. ఊహాసౌధాలెన్నింటినో నిర్మించుకుంది. అందు బంగారు తూగుటుయ్యాలలెన్నో అమర్చుకుంది. బాబూరావుతో ఆవుయ్యాలల్లో యెన్ని

మార్లో ఊగులాడింది. నిద్రపట్టక పాప మామెకు కల: తానొక సముద్రమధ్యంలో ఒక చిన్న బల్లచెక్కపై తరంగాలతో ఊగుతూ కూర్చున్నట్లూ, ఇంతలో బాబూరావొచ్చి తననావలోనికి తీస్కున్నట్లూ, కొంతదూరంపోయేక అతడొక పైశాచిక హాసమొనర్చి నావ ముంచేసినట్లూను. కెవ్వున కేకవేసి లేచింది.

ఈస్వప్న మామెను కొంతవరకు కలత పెట్టింది. కాని బాబూరావుమాట తల్చుకుని ఇవన్నీ మరచిపోయింది. స్టూడియోలో అందరికన్న, ఇండియాలోని డైరెక్టర్లందరికన్న యెక్కువజీతము ఇస్తారతనికి అల్లాంటి బాబూరావే భర్తౌతూంటే తనకికొరతేమిటి ? సౌందర్యానికా శరీరంతోనున్న మన్మథుడు; వయస్సా పాతికేండ్లు; తనకన్నా నాలుగేండ్లేపెద్ద. అల్లాంటి బాబూరావు తన ప్రియుడౌతూంటే యింక తనకు చింతేమిటి?... ఇల్లా ఆలోచించుకుంటూ నిద్రపోయింది పార్వతి. పాపం, ఎరుగదు ముందురాబోయేది.

పార్వతిదగ్గర సెలవుపుచ్చుకుని యింటికి వెళ్లేడన్నమాటేగాని హృదయంలో శాంతి లేకపోయిం దాతనికి. తానారాత్రి చేసిన పని తల్చుకుంటే గుండె లదరసాగేయి. ఫిల్మునందలి యొకదృశ్యానికై ఒకస్త్రీ యొక్క మానమును భంగపరచిన తన మూర్ఖత్వాని కెంతో బాధపడ్డాడు మనస్సులో. రేపీసంగతి తెలిసినతర్వాత ఆమెస్థితెల్లా ఉంటుంది? తననుగురించి ఏమనుకుంటుంది? అన్నప్రశ్నలు తల్చుకుంటే అతనికి గుండె లాగిపోయేవి. తానెంతబుద్ధిహీనుడై పశువులా ప్రవర్తించాడో యిప్పటికి తెలుసుకున్నాడు బాబూరావు. ఈసమయంలో ఏమిచేయడమన్న ఆలోచనలో పడ్డా డాతడు. ఫిల్ములో దృశ్యానికేమీ లోటురాకూడదు; పార్వతికొట్టే కష్టంకలుగకూడదూ; ఆమెకు తనయందున్న గౌరవానికి లోపంరాకూడదూ.

ఇల్లాఆలోచిస్తున్న ఆతనికొక సులువైన మార్గమొకటి కన్పడింది ఈకష్టాలన్నింటినీ కూడా దాటడానికి. తా నవివాహితుడు, యౌవనుడు. ఆమెయూ సౌందర్యవతి, సుగుణవంతురాలు. తన్నే ప్రేమించి, తనప్రేమనే దొంగిలించకలిగేనని ఆరాత్రి పొంగిపోయిన పార్వతిని తానెందుకు వివాహమాడకూడదు?

౪

మర్నాడు పార్వతి స్టూడియోలోకి వెళ్లేప్పటికి పనివాళ్లంతా సిద్ధంగాఉన్నారు. మొదట నేఅడిగింది డైరక్టరుగారేరని. మేనేజరుగారితో మాట్లాడుతున్నారని సమాధానం వచ్చింది. ఊరికే అటూయిటూతిరుగుతూంది పార్వతి క్రితంరాత్రిసంగతులు తల్చుకుంటూ కాబోలు.

“పార్వతీ” అనొక కర్కశస్వరం వినపడింది వెనకనుండి. బాబూరావు కందిపోయిన ముఖంతో, ఎఱ్ఱబారిన నేత్రద్వయంతో ఆమె



యెదుట నుంచున్నాడు వెనుదిరిగేప్పటికి. ఆమెచేతులలో ఒకకాగితంపెట్టి,

"అది చదువుకో నీకేతెలుస్తుంది" అని గబగబా వెళ్లిపోయాడు — కెమేరా దృష్టిలోంచి తప్పుకున్నాడు. పార్వతి కాగితం పైకెత్తి చదువుకుంది. తాను పార్వతిని ప్రేమించుటలేదనీ, యిదివరకు జరిగినదంతా ఊరక కామేచ్ఛవల్లనేగాని ప్రేమ యేమాత్రమూ లేదనీ.

ఇంతవరకూ చదవగానే నోటినుండి "ఆ" అన్నమాట అప్రయత్నంగా వెలువడింది. శూన్యదృష్టులు చూడ్డం మొదలు పెట్టింది. అంతట్లో తన ఆశాశహార్మ్యాలన్నీ నేలమట్టమయ్యాయని విచారించింది. కళ్లవెంబడి నీరుకారుతోంది — కెమేరాలన్నీ గబగబా కనిచేస్తున్నాయి — వెంటనే కోపమొచ్చింది దానికి, బాబూరావుమీద. ఆడు పులికళ్లల్లాగ మెరసేయి ఆమెనేత్రాలు.

తన్నంత మోసగించిన వానిపై కసితీర్చుకోవాలనిపండ్లు పటపటకొరికింది. ఇంకక్కడుండలేక వెళ్లిపోయింది.

"పార్వతీ!" అని పిలిచేడు బాబూరావు. పార్వతికి వినపడలేదు.

ఇంట్లో నుంచంమీద పండుకొని వెక్కివెక్కి యేడ్చింది, యేడుస్తోంది. తలుపుతీసుకు బాబూరావు ప్రవేశించాడు.

"పార్వతీ........"

పార్వతివేడికన్నీరింకా దిండును తడుపుతూనే ఉంది.

తత్క్షణం మంచంమీద కూర్చుని ఆమె తలయెత్తి తన ఒళ్లో పెట్టుకుని, కపోలాలమీది కన్నీటిబిందువుల్ని చేరుమాలుతోతుడుస్తూ,

"నిజమనుకున్నావేమిటి పార్వతీ,ఆ ఉత్తరం? నిన్నూరికే అల్లా నటింపచేయడానికి వేసిన



పన్నుగడ అదం
తా. అంతేకాని
నా పార్వతిని
నిన్నువదుల్తానా? ఈ
రోజున మేనేజర్నడిగా.

"కళ్లవెంబడి నీరుకారు
తోంది—కెమేరాలన్నీ గబగబా
పనిచేస్తున్నాయి.—"

యీ ఫిల్ము తయారైపోవడంతోటే నిన్ను స్టూడియోనుంచి విడుదలచేయడానికి ఒప్పుకున్నాడు. మన వివాహానికి నీ అభ్యంతరమేమీ లేదుకదూ."

"ఏమిటీ?" అంది పార్వతి తలెత్తి ఆతని ముఖంవైపు చూస్తూను.

౫

ఐదార్నెల్లుపోయేక లక్ష్మీథియేటరులో బాక్సుసీటులో కూర్చుని, ఫిల్ములోని ఆ దృశ్యం సర్వజనశ్లాఘనీయమవడానికి కారణం నీవంటే నీ నేనని వాదులాడుకుంటున్నారు పార్వతీ, బాబూరావులు!



జీవనోపాయము D. A. R.

# 'వడ్డవారము'

మల్లంపల్లి సోమశేఖరశర్మ

గంభీర దేవుని ఓరుగల్లు శాసనమును గురించి డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు వ్రాసినదానిని ౧౯౩౫–వ జూన్ నెల సంచికలో (యువసంవత్సర జ్యేష్ఠము) విమర్శించుచు శ్రీ గొడవర్తి రామదాసుగారు ఆ శాసనమున తిథితరువాతియక్షరమును వెంకటరమణయ్యగారు "వ" అనగా "వడ్డవారము"గ కూడ సంశయించుట కవకాశము కలదని చెప్పిన సందర్భమును పురస్కరించుకొని యిట్లు వ్రాసియున్నారు:

"వడ్డవారము అంటే శనివారమవుతుందని దిగువ Foot note లో (వెంకటరమణయ్యగారు) చెప్పియున్నారు. వడ్డవారమని శనివారమున కేభాషలో వాడెదరో చెప్పలేదు. సంస్కృతాంధ్రోత్కళతంబళి[1] బంగాళ భాషలలో వాడరని నేను నిశ్చయముగా జెప్పగలను. ఈ భాషల నిఘంటువులను జూచితిని. నాకు కనిపించిన వారినెల్ల నడిగితిని."

రామదాసుగారు తెల్లముగ వ్రాసినవిషయమిది. దక్షిణహిందూదేశశాసనసంపుటములను జాగ్రతగ పరిశీలించియుండినచో వారిట్లు వ్రాసియుండరు. ప్రాచీన శాసనములయందు వచ్చుపదములను దెలిసికొనుట కిప్పటి నిఘంటువులు మన కంతగ తోడ్పడవు; ఏలన, ప్రాచీన శాసనములయందు వచ్చుపదములు కొన్ని వ్యవహారమున నిపుడంతరించినవి; మరికొన్ని రూపాంతరమును, అర్థాంతరమును పొందినవి. ఇటువంటి పదములు కొన్ని యున్నవనువిషయముకూడ మన మిప్పుడు వాడుకచేయుచున్న నిఘంటువులను రచియించినవారికి తెలియదు. ప్రకృతము వాడుకయందున్న నిఘంటువులందు లేని శాసనస్థపదముల నెన్నిటినైన నుదాహరింపవచ్చును. ఇంతకు, నిప్పటికికూడ మనకు సమగ్రమయిన నిఘంటువే రాలేదు. అట్టిచో నిక 'కనబడినవారెల్ల' ఎట్లు తెలుపగలరు ఇట్టిపదముల యర్థము?

ఒక్కటిమాత్రము నిశ్చయము. వడ్డవారము కేవలము ప్రాకృతరూపముగనో, దేశీయపదముగనో కన్పించుటవలన దీని యర్థమును దెలిసికొనుటకు సంస్కృత శబ్దకోశ మనుపయుక్తమని వేఱె చెప్పనక్కఱలేదు. వారమన్నదికూడ చేరియుండుటవలన నిది 'తంబళ'పదముకూడ కాదనుట నిశ్చయము. ఓఢ్ర, బంగాళ భాషలసంగతి నాకు తెలియదు.

మన యాంధ్రమున ఈపదము పదునొకండవ, పండ్రెండవ, పదుమూడవశతాబ్దుల యందు వ్యవహారమున నుండెననుటకు శాసనప్రమాణము కలదు. చూడుడు:

(౧) శకవర్షములు ౧౦౮౪ వు నేంటి చిత్రభానుసంవత్సర మాఘ శు ౧౩ వడ్డవారమునాండు......

1. తమిళమునకే రామదాసుగారు 'తంబళి'యని వాడినట్లు ఊహించుచున్నాను.

(౨) స్వస్తి శ్రీ శకవరుషంబులు ౧౧౨౬ గునేంట్టి పౌష్యశుద్ధ ద్వితీయ్యాయు వ[డ్డ] వారము నాంట్టి యుత్తరాయణసంక్రాంతి నిమిత్తమున...

(౩) స్వస్తి శ్రీ శకవర్షంబులు ౧౧౩ [౨] గునే......యు వడ్డవారము.......

(౪) స్వస్తి శ్రీ శకవర్షంబులు ౧౧౪౩ గునేంటి జేష్ట బహుళ సప్తమియు వడ్డవారమున......

(౫) శకవర్షంబులు ౧౧౫౦ గునేంటి మాఘ శు ౧౦ వడ్డవారమునాండు......

(౬) శకవర్షములు ౧౧౯౨ నేంటి జేష్ట శుద్ధదశమి వడవారమునాండు......

(౭) స్వస్తి శ్రీ శాకవర్షంబులు ౧౧౯౩ నేంటి ప్రజా[ప]తి స[ం*]వ[త్స]ర భద్రపద బహు ౧౫ వడ్డవరాన సూర్యయ[గ*]గ్రహణమునందు......

(౮) స్వస్తి శ్రీ శకవర్షంబులు ౧౨౧౫ గునేంట్టి మార్గసిరరాత్రి యమావాస్యయు వడ్డవరన......

ఈ విధమున ఈ వారము పేరువచ్చు తెలుగుశాసనముల నింకను ఎన్నిటినైన నుదాహరింపవచ్చును. ఇది యొక్క తెలుగు శాసనములయందేకాక కన్నడశాసనములు పెక్కింటగూడ గనబడుచున్నది. చూడుడు:

(౧) స్వస్తి శ్రీమచ్చాళుక్యవిక్రమకాలద ౧౨నెయ ప్రభవసంవత్సరద పౌషకృష్ణ చతుర్దశీవడ్డవార దుత్తరాయణసంక్రాన్తి యందు......

(౨) శకవర్ష ౧౦౮౪ నెయ చిత్రభానుసంవత్సరద వైశాఖ శుద ౧౦ వడ్డవారదందు...

(౩) వడ్డవారదొ శభ్యంగ సోమవార దల్ ౩౦ మనుష్యబ్రాహ్మణం రుగురం కళవనావిదన జీవితం గర......

ఈరీతిని వడ్డవారము నుదాహరించు కన్నడశాసనములు పశ్చిమచాళుక్య, హొయిసల, యాదవవంశములవారి వెన్నియైన గలవు. వడ్డవారము కన్నడమునను, తెలుగునను వ్యవహారమునం దుండెననుటకు మనకు కావలసినది ప్రమాణమేకాని అది యేయేశాసనములయందు వచ్చునో యాశాసనముల పట్టిక కాదుగనుక పైని చూపిన యుదాహరణము లిప్పటికి జాలును.

ఇది పైనిచెప్పినరీతిని శాసనముల యందేకాక కర్ణాటవాఙ్మయమునను వచ్చును. వేంగిమండలము నెంతో గొప్పగ వర్ణించుటవలన వేగినాటివాడని చెప్పదగిన రన్నకవి గదాయుద్ధమనునామాంతరము గల తన సాహసభీమవిజయమునందు

కళశజన నింతు కొలిసిద
ఖళనెగడం ధర్మనందనం క్రూరదినం॥
గళపెసఱం మఱియిసి మం
గళవారం వడ్డవారమెంబంతె వలం॥

అని వడ్డవారమును వాడినాడు. ఇతడు పదవ శతాబ్ది కడపటివాడు. వీటి నన్నిటినిబట్టిచూడగా వడ్డవారము తెలుగునకుగాని, కన్నడమునకుగాని నూతనము కాదనియు, అది తెలుగున ప్రాయికముగ కర్ణాటకమునగూడ

నేమో) ఇటీవల వ్యవహారమున నంతరించి పోయిన దనియు నిశ్చయింపవచ్చును.

ఏ వారమునకు వడ్డవార మన్న పేరు చెల్లుచుండెనన్న విషయమునుగురించిన చర్చ ముప్పదినలువది సంవత్సరములకు పూర్వమే ప్రారంభమైనది. ఈ విషయమును గురించి ఫ్లీటు, కీల్‌హార్న్, రైస్ ప్రభృతులు చాల చర్చించియున్నారు. అప్పటికి బయలుపడిన శాసనముల ననుసరించి యిది నిశ్చయముగ తేల్చుట కవకాశము లేకపోయినందున కీల్‌హార్న్ పండితుడు వడ్డవారము నుదాహరించు శాసనములయందలి తిథివారాదికములకు సరియైన ఇంగ్లీషు తేదులను గుణించి యీ రూపమున దానికి సరియైన వారమును నిర్ణయింపజూచెను. ఆతని యుద్దేశము ప్రకారమది శనివారముకాని, ఆదివారము కాని యగునని. ఈ నిశ్చయమునకువచ్చి, అన్మకొండ రుద్రదేవునిశాసనమును (కాలము-శకము ౧౦౮౪ చిత్రభాను సంవత్సర మాఘ శు ౧౩ వడ్డవారము) ప్రకటించు సందర్భమున వడ్డవారము బుధవారమో, గురువారమో యగునని తేల్చిన డాక్టరు భావుదాజీ పండితుని నిర్ణయమును నిరాకరించెను. "వడ్డవారదో ళభ్యంగ. ." అన్నదానిని పురస్కరించుకొని ఫ్లీటుపండితుడు ఈవార మేది యైనది నిశ్చయింపజూచెను. అభ్యంగమునకు, అనగా తైలాభ్యంగమునకు యుక్తవార మేదియని విచారింపగా అతనికి శ్రీపతివిరచితమైన రత్నమాలయందలి వార ప్రకరణమున ఈదిగువశ్లోకముకాన్పించినదట.

రవి స్తాపం కాంతిం
వితరతి శశీ భూమితనయో
మృతిం లక్ష్మీం చాంద్రిః
సురపతిగురు ర్విత్తహరణం
విపత్తిం దైత్యానాం
గురు రఖిలభోగానుభవనం
నృణాం తైలాభ్యంగాత్
సపది కురుతే సూర్యతనయః॥

ఈశ్లోకము ననుసరించి చూచినచో ఆదివార, మంగళవార, గురువార, శుక్ర వారములు మంచివికావు. మిగిలినవారములలో శనివార ముత్తమమయినది. ధర్మసింధుసారము, మూడవపరిచ్ఛేదము, ౧౩౪-వ పేరాయం దుదాహృతమయిన ముహూర్తమార్తాండమునందలి 'భద్రసంక్రమపాత. .' యన్నశ్లోకము ననుసరించికూడ తగినంత కారణమున్ననే తక్క ఆది, మంగళ, గురు, శుక్రవారములందు తైలాభ్యంగముచేయరాదనియే తేలుచున్నది. కావున పైని శాసనమునం దుదాహరించిన వడ్డవారము ఆది, మంగళ, గురు, శుక్రవారములలో నేదియు కాదనుట స్పష్టము. మిగిలినమూడువారములలో సోమవారము శాసనమున ఉదాహృతమయియుండుటచేత నిక నది బుధ, శని వారములలో నేదోయొకటి కావలెను. శాసనములందలి తిథివారాదికములనుబట్టి చూచినచో నది శనివారమేయగునని నిశ్చయింపవలసియున్నదని ఫ్లీటుదొరగారు వ్రాసియున్నారు. అయినను అప్పటికి ఫ్లీటుదొరగారి నిర్ణయమును ఎల్లరు నంగీకరించినను నిస్సంశయముగ వడ్డవారము శనివారమే యనుటకు ప్రత్యక్ష ప్రమాణము మాత్రము కాన్పించలేదు. ఈ చర్చలు జరగి ముప్పదియేండ్లకుపైనయినది. ఈలోపున నెన్నియో శాసనములు

బయలుపడినవి. దక్షిణ హిందూదేశశాసనములు — తెలుగుశాసనము లనేకములుగ నున్నవి — నాలుగవ, అయిదవ, ఆఱవనంపుటములు ప్రకటితములయినవి. ఫ్లీటుదొరగారి నిర్ణయము సరియైనదని రుజువుచేయగల శాసనము లందు దొరకినవి.

దక్షిణహిందూదేశశాసనము లాఱవ సంపుటమునందుగల శకవర్షము ౧౧౯ నాటి యొక శాసనము సంస్కృతమునను, తెలుగుననుగూడ గలదు. సంస్కృతభాగమున ఈ క్రిందిశ్లోకము కలదు.

అంకేందు రుద్రప్రమితే శకాబ్దే
మాసాశ్వినే సూర్యసుతస్యవారే,
రాకాతిథౌ పూష్ణి తులా ముపేతే
ప్రాదుః సుదీపా నమరేశ్వరాయ.

దీనికి తెలుగు ఈవిధమున గలదు:

"………శకవర్షములు ౧౧౧౯గునేంటి ఆశ్వయుజ శు ౧౫ వడ్డవారమునాండు దులాసంక్రాంతినిమిత్తమున శ్రీమదమరేశ్వరమహాదేవర కాచంద్రార్కముగా నిచ్చిన అఖండవర్తిదీపము లైదు……"

వడ్డవారము శనివారమని మఱియొక శాసనమువలనకూడ రుజువగుచున్నది. నర్సారావుపేటతాలూకా నాదిండ్లయందలి యొక శాసనమున

"అమరశకాబ్దముల్ హిమకరాంగ్గవియత్ శశిసంఖ్యగాను బావ్యమున సితేతరార్కతిథి
శౌ(సౌ)రిదినంబునభక్తియేర్పడం
గమలదలాక్షి వెన్నమ ప్ర
కాశముగాంగ్గ నఖండదీపర
త్నము రచియించె నారవిసుధా
కరతారకమై వెలుంగంగాగ్."

అనియున్న పద్యమునకు దరువాతగల గద్యమిది.

"స్వస్తి శ్రీశకవర్షంబులు ౧౦౬౧ యగునేంటి పౌష్యబహుళసప్తమి వడ్డవారమున వెన్నమ శ్రీ నాదండ్లమూలస్థానమహాదేవరకు నఖండవర్తిదీపమునకుం బెట్టిన గొఱియలు ౫౦…"

పైనుదాహరించిన శాసనభాగముల ననుసరించి సూర్యసుతుని (శని)వారమునకు, లేక సౌరి(శని)దినమునకు తెలుగున వడ్డవారమని ప్రాచీనకాలమున వ్యవహారముండినట్లు రూఢమగుచున్నది[2].

ఇట్లు రూఢమయినను దాని కానామాంతర మెట్లుకలిగెనో తెలియదు. వర్ధమానపురము - వడ్డమాను, వర్ధకి-వడ్డకి, వర్ధకుడు-వడ్డకుడు,అర్ధ-అనడ్డ, అర్ధ - అడ్డ అయినట్లె 'వృద్ధ - వర్ధ' అనునదియే వడ్డ అయియుండవలెనని తోచుచున్నది. అప్పటికిని వద్ధవారమన్నను, వర్ధవారమన్నను ద్వాని పరమార్థ మెఱుకపడుటలేదు. ఈవిషయము మింకను విచారణీయము. [illegible]

---

2. రాజరాజనరేంద్ర సంచికయందు (౧౯-౨౧) ప్రాచీనాంధ్రభాషాస్వరూపమను వ్యాసమునందు వడ్డవారమనగా శుక్రవారమనివ్రాసితిని. అది పొరపాటు.



శివభక్త మాహాత్మ్యమున శివధర్మ బ్రాహ్మణ నవమల్లాఖ్యానమున నౌకరంగము

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

# విజయోత్సవము

## శ్రీ తత్త్వానందస్వామి

[ఏకాంకనాటకము]

ప్ర థ మ ర ం గ ము

అమరావతీ నగరోపాంతమున విశాలప్రదేశము చిత్రచిత్రాలంకృతమైయున్నది. ఇంద్రుడు, యముడు, అగ్ని, వాయువు మున్నగు దిక్పాలురు, సకలదేవతలును ఉచితాసనములపైని ఆసీనులై ఉందురు.)

ఇంద్రుడు—మన విజయోత్సవమునకు నిర్ణయించుకొనిన వేళయైనది. ఏలొకో సురగురుండు రాడయ్యె. ఈతడవునకు గతం బేమైయుండును ?

(బృహస్పతి ప్రవేశించును)

బృహస్పతి—"పాదోఽస్య విశ్వాభూతాని, త్రిపాదస్యామృతమ్ దివి, త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః, పాదోస్యేహాభవాత్పునః" (అని పఠించును.)

(ఇంద్రాది దేవతలందఱును పీఠములదిగి బృహస్పతికి నమస్కరించి ఉన్నతాసనమును జూపుదురు.)

బృహస్పతి—శ్రేయోభవతు! నిత్యానందావాప్తిరస్తు!

(కూర్చుండును)

ఇంద్రుడు—గురుదేవా!

గీ. తావకాశీస్సుచే దుష్టదానవులను
పోరనిల్గించి, కంటి మిఖ్యాతపూర్వ
జయము లోకములెల్ల నిష్కంటకముగ
నతులితానందసౌఖ్యము లందు నింక.

బృహ—మీరెల్లరు చూపిన పరాక్రమములు అసమానములు. మీశక్తి అగణితము.

యముడు—చిత్రము! మొదట కొంత కాలము విజయప్రాప్తి సూచనయేని గోచరింపదయ్యె. అంతట ఈ దేవతాప్రవరులెల్లరు విజృంభించి......

(వాక్యము ముగింపకయె అబ్బురపాటుతో) అల్లదేమి? ఎదుట కాన్పించు ఆ బృహత్తేజమేమి?

(అందఱును వెఱగుపడి చూచుచుందురు.)

అగ్ని—ఓహో ! సంశయమేల ? సూర్యుడు అత్యుత్సాహముతో తేజరిల్లుచు, మన విజయోత్సవమును తిలకింప వచ్చుచున్నాడు.

ఇంద్రుడు—ఆజ్ఞలేక సూర్యుడిట్లు తన సంచారక్రమమును వీడిరానేల?

బృహ—ఓహో! సూర్యునకింతటి కాంతి యెక్కడిది?

గీ. కోటిసూర్యుల కాంతిని గూడ మించు
ఈమహాతేజముం గాంచ నేడొ భీతి
కలుగుచున్న దహో! ఇది కనగ కనగ
తేజరిల్లు ముజ్జగమ్ము లతిక్రమించి.

వాయువు—చిత్రము ! ఆ ప్రకాశము అపూర్వము. ఏమైయుండునో, తత్క్షణము విచారింపదగును.

బృహస్పతి—అవును.

ఇంద్రుడు—ఎవరు పోయివత్తురు?

యముడు—అతిరయమున పోయిరా గలవాడు వాయుదేవు డుండ శంకయేల?

ఇంద్రు—జగత్ ప్రాణా! పోయివత్తువా?

వాయువు.—సెలవైన నింక తడయు దునా?

బృహస్పతి—సత్వరము మఱలిరమ్ము!

వాయువు—మహాప్రసాదము.

(నిష్క్రమించును.)

(తెర వ్రాలును.)

ద్వితీయరంగము

(బహిఃప్రదేశము. ఒకమహాతేజము గోచరించును. వాయువు ఎదుట నిలుచును.)

వాయువు—(స్వగతము) సకలరాక్షస సంహార మొనర్చి, విజృంభించు ఈసమయ మున నా కీజంకేల ? మనస్సా! ధీరత వహిం పుము! (ప్రకాశముగా) ఓ తేజోరాశీ! నీ వెవ్వరవు ?

తేజస్సు—నీ వెవ్వండవో ముందుగ తెల్పుకొనుము !

వాయువు—(స్వ) ఏమి ఈగంభీరధ్వని! ధైర్యమువహింతునుగాక! (ప్ర) నాకు జగ త్ప్రాణుడనియు, మరుత్తనియు, ప్రభంజను డనియు అనేకనామములు గలవు.

తేజస్సు—ఇవన్నియు పౌరుషసూచక నామములే! నీప్రతాప మెట్టిదో తెల్పుము.

వాయువు—(స్వ) హేళన ధ్వనించు చున్నదే! కానిమ్ము! (ప్ర.)

సీ. జగములఁగల ప్రాణిసంతతి కే జీవ
మగుట జగత్ప్రాణుఁ డండ్రు నన్ను;
కుపితుండనైననే కూలుచుండు జగాలు
నన్ను మరుత్తని యెన్ను చంద్రు;
కుజముల, గిరుల నుగ్గుగఁ జేయుటం జేసి
బఱగుచుండుదను ప్రభంజనాఖ్య;
అఖిలంబు పూతమౌనట్లు చేసెడుశక్తిఁ
బవమానుఁడనుపేరఁ బ్రబలుచుందు;

గీ. మాట లేఁక వేయునేటికీమాడ్కి వలుక?
నే విజృంభించి ఘనశక్తి నెఱపుదేని
కొండలకు మేటియౌ మేరుకుధరమేని
ఎండిపోయిన తృణమట్లు లెగురఁగలదు !

తేజస్సు—ఓహో ! అటులనా! ఆ కనఁబడున దేమిటో చూడుము. (చూపును.)

వాయువు—అదియా? గడ్డిపోచ.

తేజస్సు—ప్రభంజనా! దానిని ఇటు గొనిగమ్ము.

వాయువు—(స్వ) ఏమి? న న్నిట్టి అత్యల్పకార్యమునకు నియోగించునే ఈ తేజస్వి! (ప్ర) ఎందులకు? దానితోడ మీకుఁగల ప్రయోజన మేమి ?

తేజస్సు—ప్రయోజనమా? చాలగల దు. దాని నిటు తెమ్ము. సర్వమును నీకే తెలి యును.

వాయువు—(స్వ)

ఆ. కొండ యద్దమంగఁ గొంచెమై తోఁచిన
లోటుగలదె దాని మేటిపసకు ?
చిన్నపనియటంచు సిగ్గొందఁగానేల ?
అదియుఁగాక చూడ రమ్యలిచట.

(ప్ర) నిజముగా నన్నీపనికి నియోగించుచుంటివా?

తేజస్సు—నా ఉద్దేశ్యము అట్టిదియే. సంకోచము విడువుము.

వాయువు—నీ వెవ్వరవో తెలుపుటలేదే.

తేజస్సు—నా కోరిక చెల్లించుము, నీ కోరికయు చెల్లగలదు.

వాయువు — అటులనే అగుఁగాక ! (వాయువు ఆగడ్డిపోచను సమీపించి దానిని ఎత్తఁబోవును. అది కదలదు.)

(స్వ) (ఆశ్చర్యముతో)

గీ. అరిది బలసంపద న్మహాతరులనేని
నేలఁ గూల్చెదు నాకు, హిమాలయమ్ము
దూదిగా నింగిపైఁ దేలనూఁదు నాకు
పరిభవము కల్గుఁబో తృణాంకురమువలన.

ఆఁ ! ఆఁ ! అటులేల కావలయును ? ప్రళయానిలమనై విజృంభించినైనను దీనిని ఎగురఁగొట్టితీరెదను. ఆపూన్కిచే ప్రపంచము తల్లడిల్లిన తల్లడిల్లుఁగాక. ఈ సమీరణుఁడు పరిభవముపాలగునా ? కాదు కాదు. (తన బలమునంతను ప్రయోగించి వీచును. భీకరాకృతిదాల్చి దానితో తలబడును. అది కదలదు. తేజస్సు నవ్వును.(ప్ర.) (కోపముతో)నీవు జాలికవై యుండనోపుదువు. నీకు తగిన...

తేజస్సు — మారుతా ! నీమారణ ప్రయోగములు సాగవుసూ ! తొందర చేటు దెచ్చును.

వాయువు—(పశ్చాత్తాపముతో నెమ్మదిగా వెడలిపోవును.)

(తెరవ్రాలును)

తృతీయరంగము

(ఇంద్రుని ప్రత్యేకకుటీరము. ఇంద్రుఁడు కూర్చుండియుండును. దాపున వాయువు తలవంచుకొని నిల్చుండును.)

ఇంద్రుఁడు—జరిగినదేమో జరిగినది. దీనిని ప్రకటింపకుము.

వాయువు—నేను దూతనై పోయియుంటిని. స్వతంత్రించుట పాడిగాదయ్యె. లేకున్న......

ఇంద్రుఁడు—అది పోనిమ్ము. అగ్నిదేవుఁడు వచ్చుచున్నాఁడు. వానికేమియు తెలియరాదు. నీవు వెడలుము.

(వాయువు వెడలును.)

ద్వారికుఁడు—(ప్రవేశించి)శచీనాయకా! ప్రభూ! దాసుఁడు దండమిడుచున్నాఁడు.

ఇంద్రుఁడు — అగ్నిదేవుఁడు వచ్చెనా ?

ద్వారికుఁడు—చిత్తము,మహాప్రభూ!

ఇంద్రుఁడు —లోనికి రమ్మనుము.

(దౌవారికుఁడు వెడలును. అగ్ని దేవుఁడు ప్రవేశించును.)

అగ్ని దేవుఁడు—మహేంద్రా! వందనములు. ఏమికతమున ఇట్టితొందరపిలుపు? మనవాయు దేవుని విజృంభణమువలన లోకములకు అలజడి కలిగెఁగాఁబోలును!

ఇంద్రుఁడు—మతే మంత తల్లడమంద పనిలేదు. నీవుపోయి ఆతేజస్వి ఎవ్వరో తెలిసికొనిరావలయును.

అగ్ని—వాయుదేవుని పంపితిమిగదా? ఏమయ్యెను?

ఇంద్రుఁడు—వారిప్రసంగములు సరళముగ జరిగియుండలేవు. నీవు పోయి రావలయును. ఆతేజస్వి ఒక్కింత పరీక్షింప నుంకించినను జంకవలదు.

అగ్ని—చిత్తము! అఖిలదైత్యానీకములను మలమలమాడ్చి ప్రేల్చి దగ్ధముకావించియున్న నే నేల జంకవలయును? సంశయింపకుఁడు. పోయివచ్చెదను.

(వెడలును.)

ఇంద్రుఁడు—ఎవ రక్కడ?

దౌవారికుఁడు—(ప్రవేశించి) ప్రభూ! ఏమియాజ్ఞ?

ఇంద్రుఁడు—అగ్ని దేవుఁడు వెడలెనా? పిలువుము.

దౌవారి—దేవా! పరుగులిడుచున్నాఁడు. పిలిచివత్తును.

ఇంద్రుఁడు—అవసరములేదు. నీవుపోయి విజయోత్సవశాలకు కొంచెము ఆఁగి వత్తునని తెలుపుము.

దౌవారి—చిత్తము, మహాప్రభూ!

(వెడలును.)

(తెరప్రాలును.)

చతుర్థరంగము

(బహిఃప్రదేశము. తేజస్సును, దాపున అగ్నియు నుందురు.)

తేజస్సు—నీ వెవ్వఁడవు?

అగ్ని—నాపేరు అగ్ని. ఆగ్నేయదిశ నాపేరఁబఱఁగుచున్నది. నే నద్దానిపాలకుఁడను!

తేజస్సు—అటులనా? ఇంతకుముందు వచ్చిపోయినవాఁడు నీఅన్నయా? తమ్ముఁడా?

అగ్ని—ఆయన మాయన్నయే. అయిన నేమి?

తేజస్సు—ఏమియు లేదు. నీప్రతాప మెట్టిది?

అగ్ని—నేనున్ననే జగమున ఏదేని గోచరించుట. సకలభూతములకు నేనేనేత్రమను. అఖిలవర్ణములు, ఆకృతులు నావలననే ప్రకాశించుట.

తేజస్సు—అగుఁగాక! నీ కేవేనిబిరుదములు కలవా?

అగ్ని—కలవు. వానికేమిగాని నీ వృత్తాంతము తెల్పుము.

తేజస్సు—ముందుగ నీవృత్తాంతము నెఱిఁగి సంతసింపఁగోరెదను. నీబిరుదములఁ గొన్నింటిం దెల్పుము.

అగ్ని—అవి బహుళములు కొన్నింటి నుగ్గడించెద. నన్ను వీతిహోత్రుఁ డందురు. జాతవేదుఁడనియు పిలుతురు. కృశానుఁ డన నొప్పుదును......

తేజస్సు—ఓహో! చాలును. ఈబిరుదములు సార్థకములై యుండును. ఒకింత విశదము చేసెదవా? వినవలతును.

అగ్ని—

వీతి యన్నంబు; హవిస్సు హోత్రం బది
ఓదనంబై వీతిహోత్రుఁ జేయు;
తత వేదరాసు లుద్భవమంద నాయందు
జాతవేదాఖ్య విఖ్యాతిఁ గందు;
స్పృశియించునవి యెల్లఁ గృశియించుటంజేసి
అలరుచుందుఁ గృశానుఁడనెడిపేర;
ఎల్లవేళలఁ దేజరిల్లుచుండుటచేత
జ్వలనాహ్వాయమునవర్తిలుచునుందు
సార్థకమ్ము లీపేరులు చాలఁగలవు
నాప్రభావము చిత్ర మనంత మేను
పూనుదునయేని పదునాల్గుభువనములును
భస్మమైపోవు నిఁకఁ బెరవాక్కు లేల?

తేజస్సు—అటులనా? మహాఘనుఁడవే. అల్లదే చూడుము. దాని నించుక కృశింపఁ జేయుము.

అగ్ని—నీవంటి వరేణ్యులు ఇటులు అలసనంభాషణములఁ గావింపఁదగునా? న న్నీగడ్డిపోచనా కాల్పుమనుట? నిండుగ కను దెఱచిన సర్వమును మండిపోవును.

తేజస్సు—కాఁబోలును. దీనిని గాల్చి చూపరాదా?

అగ్ని—గర్వాతిను పాటింపక నన్నిట్టి యల్పకార్యము చేయుమందువనియే నాసంకోచము. మాయన్ననుగూడ నిట్టి క్షుద్ర కార్యమునకై నియోగించియుందువు. కాననే ఆమహానీయుఁడు విజృంభణము చూపి యుండును. ఒక్కక్షణముక్రిందట ముల్లోకములు కంపించియుండును. ఏలొకో ఆయన క్షమపూనియున్నాఁడు.

తేజస్సు—అన్నా! ఇంత చదువేటికి? ఆగడ్డిపోచం దహింపఁజాలుదువా? లేదా? నీయన్నయు నిటులనే బీరములు పలికి దానిని కదల్పలేకపోయినాఁడు!

అగ్ని—కటకటా! నేను నమ్మఁజాల. మాయన్న 'ఉఫ్' అనునెడల మేరుపర్వత మేని తూలమువలె ఉప్పరమున తేలియాడదే? అల్పకార్యముగా నెంచి, మాయన్న నీకోర్కి తీర్ప నిరాకరించియుండును. నీ వట్టిభ్రాంతి వీడుము.

తేజస్సు—నీవు వట్టిభ్రాంతియే పడుచుంటివవి నిమేషములో తెలియఁగలవు. నా కోరుకార్యముం జేయుదువా? లేక మఱలుదువా?

అగ్ని—ఏమంటివి? ఇఁకచూడుము!

(గడ్డిపోచవంక చూచి దానిని తగులఁ బెట్ట యత్నించినాఁడు. అది తగులఁబడ లేదు. మహారౌద్రాకారముదాల్చి యావచ్ఛక్తితో దానిం గాల్చయత్నించియు,విఫలుఁడైనాఁడు)

తేజస్సు — నీవు సరిగా ఆయన్న తమ్ముఁడవే. మాటలప్రోవులు!

అగ్ని —(స్వ) తగినశాస్తిచేయుదునా? దూతనై అట్టుల చేయుటతగదు.

తేజస్సు— ఓహో! ఏటిసంకల్పములవి?

అగ్ని — (స్వ) ఈజాలరహస్యము దుర్భేద్యముగనున్న దే! ఎంతటిపరిభవము?

(నెమ్మదిగ వెడలిపోవును.)

(తెరపడును)

పంచమరంగము

(విజయోత్సవస్థలప్రాంతవీథి. హాహా,హూహూ అను గంధర్వులు ప్రవేశింతురు)

హాహా—హూహూ! ఇంతవఱకు నెక్కడనుంటివోయి?

హూహూ—హాహా! ఏమిటుల నీవు నానామస్మరణ చేయుచుంటివి?

హాహా—నీవేల నానామస్మరణచేసితివి?

హూహూ—ఓహోహో! మనమిరుపురమును ఆశ్చర్యాఖ్యచే నొప్పువారమే. సరే! ఏమంటివి? పనులు లేకుండునా?

హాహా—విజయోత్సవములు బాగుగనే నిర్వహింపఁబడినవే!

హూహూ—అదేమి? రంభ, మేనక, తిలోత్తమ, వీరలందఱు అతిరభసముతో సభాస్థలికై బయలుదేటిరే?

హాహా—త్రోవలోనే వెనుకకు మఱలింపఁబడినారు!

హూహూ—ఏలా? వారలపై నెవరేని నేరములు చెప్పిరా?

హాహా—కారణము ఎవరికిని పూర్తిగ తెలిసినట్లు లేదు. ఎల్లెడల గుసగుసలు సాగినవి.

హూహూ— నీకేమియు వాసనతగుల లేదా? గాలిబాస నీకు హితుఁడేగదా?

హాహా—మున్ముందు ఆయనయే తల వంచియున్నాఁడు.

హూహూ—అదేల? ఆ తేజముకడకేఁగి హోరెత్తించివచ్చెనుగా?

హాహా—అక్కడ త్రోవలో గడ్డి యున్నదఁట. ఆతేజస్వి వీనినిచూచి దానిని తొలగించుమన్నదఁట.

హూహూ—హాహా! వీనికి ఎక్కడకు పోయినా ఊడ్పుచాకిరి తప్పదు కాఁబోలును. రావణాసురునగరున కసవులూడ్చి యూడ్చియే యున్నాఁడుగా?

హాహా—ఏమిజరిగినదో సరిగా తెలియుట లేదు. చేతగాకవచ్చెనని కొందఱును, తిరస్కరించివచ్చెనని కొందఱును చెప్పుకొనుచున్నారు.

హూహూ — పిచ్చిమాట. గాలిబావ తలఁచుకొన్నచో మహారణ్యము లెగిరిపోవా? పర్వతా లెగిరిపోవా ? మొత్తముమీఁద ఏదో విచిత్రము జరిగియుండును. మఱి అగ్గి బావ వెళ్లెనఁటగా ?

హాహా — గోడలకు చెవులుండునుగాన మన మేమి అనుకొనిన ఏమితంటావచ్చునో. అతఁడు భువనాలను భువనాలనే నిమిషములో బుగ్గిచేయువాఁడే ! ఒకగడ్డిపోచను గాల్చలేక పోయెనఁట ! చిత్రము చూడు !

హూహూ — నెమ్మదిగా మాట్లాడు. నీ వన్నట్లు గోడలకేగాదు, చెట్లకును చెవులుండును. వానికి నోళ్లును ఉండును. మనగుసగుసలు బైటపడునేమో ?

హాహా — అట కాన్పించు తేజస్సు ఎటువంటిదో, ఎవరిదో, ఎవరికిని తెలియరాలేదఁట. అందఱికిని పరిభవము కూర్చుటకే వచ్చియుండెనఁట. దానివృత్తాంతము నెఱింగి రాఁగడంగినవారికెల్ల అవమానమే వాటిల్లుట తథ్యమని చెప్పకొనుచున్నారు. గాలిబావకును, అగ్గిబావకును గర్వభంగమైనందువలన తక్కుంగల దేవతలలో ఎవరును ఆ పనికి పూనుట లేదు.

హూహూ — మహామహులకే అటులగుచుండ మనబోంట్లగతియేమి ? తుదకు ఏమిచేయనుండిరి?

హాహా — దేవగురువులవారు ఇంద్ర మహారాజునే వెళ్లిరమ్మనిరఁట.

హూహూ — వా రొప్పుకొనిరా?

హాహా — దేవతలందఱును ఆమాటే చెప్పసాగిరి. ఇఁక ఒప్పుకొనక చేయునదేమి?

హూహూ — వీరికిని పరిభవమే జరుగుచో?

హాహా — దుశ్శకునపుపక్షివలె నీవటుల పలుకఁదగునా?

హూహూ — క్షమింపుము. నోరుజారి నాశంకను వెలుపరించితిని.

హాహా — అదుగో ప్రభువువారు వెడలుచున్నారు. మనమనపనులను మనము చక్కబెట్టుకొందము పద !

(నిష్క్రమింతురు.)

(తెరవ్రాలును.)

సప్తరంగము

(బహిఃప్రదేశము. మహాతేజమున కెదురుగ చేతులుజోడించుకొని దేవేంద్రుఁడు నిలుచుండును.)

ఇంద్రుఁడు — అఖిల తేజోమయమూర్తీ! నీదివ్యప్రభల నెన్నికఁడుమన్నను లక్షింపఁజాలకున్నాను. నీప్రభావ మదెట్టిదో నాకు దురూహముగ నున్నది. కరుణించి నీవెవ్వరవో, నిన్ను మే మెటుల ధ్యానింపనగునో, నీకు వేఁ మెట్టిసేవల నర్పింపఁగావలయునో, సెలవిమ్మని వేఁడుచున్నాను.

తేజస్సు — నాస్వరూపరహస్యము అనిర్వాచ్యము. అతినిగూఢము. చెప్పుటకు అలవికానిది. వినుటకు సాధ్యముకానిది.

గ్రహించుటకు దురూహమైనది. నేను నిర్వి కార, నిరాకార, నిరంజనమూర్తినైనను, నా అత్యల్పాంశ మొంచు సాకారమై, సగుణమై, సర్వారాధ్యమై ఒప్పను. అయ్యదియే ఈ అఖిలాండకోటిబ్రహ్మాండములకును ఉపాదానకారణము; అందు నిగూఢమైయుండి జీవరూపమున సకలము నాడించుశక్తియు నాయదియే. కానతద్జ్ఞులు నన్ను పరాశక్తి యందురు. ఇట్లు నాయల్పాంశముచేత ఈయన్నింటి సృష్టిస్థితిలయము లు సాగుచుండును. అట్లగుటచేత నన్నే సృష్టిస్థితిలయకారణాంబగా వాకొందురు. సకలంబును నాయందుండ నేను వానియందులేను. ఎందేం దేవి భూతి గోచరించినను, అయ్యది నాయదిగ గ్రహింపుము.

ఏన నిమిత్తహేతువు, సు
రేశ్వర మీవిజయోపలబ్ధికై;
యేన సమస్తకర్మలు ఫ
లింపఁగ మూలము; నెట్టివారలుం
దీనత శక్తిహీనులయి
తీసదు రప్పదు పేక్షు; గంటె? వై
శ్వానరమారుతార్భకుల
పాటు; దమంతటదామె వర్తిలం
బూనెడు నెవ్వరైనఁ జెడి
పోదురు, నాదగునండ వీడినన్.

ఇంద్రుఁడు——తథ్యము! తథ్యము! నీవు సంకల్పించినసృష్టి, నీవు పోషించిన స్థితి, నీవు ఉపేక్షించిన లయము జరుగుచుండునని గ్రహింపఁగల్గితిని. తల్లీ! పరాశక్తీ! నీవిభూతులను ఇంక కొన్నింటిం దెల్పుము, జగజ్జననీ!

తేజస్సు——అవి అనంతములు. ఈజగద్వ్యాపార మంతయు విశ్వయజ్ఞముచేత జరుగుచుండునని తెలియునుగదా? ఆయజ్ఞసంకల్పమును, యజ్ఞమును, యజ్ఞసామగ్రియు, ఆహుతులును, హోతలును, అగ్నియు, సర్వమును నేనయని తెలియుము. నీవు గావించిన శతయజ్ఞములకును నేన ఆధారమునైతిని. మీ ఈవిజయమునకు మూలము నేన. ఇంతేల? ఈసకలజీవులును, దేవతలును, నీవును నయితము నాస్వరూపాంశములేయని తెలియుము! బృహస్పతియు నాయంశ సంభూతుఁడే.

ఇంద్రుఁడు——సత్యము! సత్యము! నీవను గ్రహించిన రక్షు, నీవు కినిసిన శిక్ష. మా మోహాంధతను క్షమించి, మేము సుజ్ఞానము మెయి కృతజ్ఞతను జూపి అర్పించు పూజలఁ గైకొనుము తల్లీ!

తేజస్సు——ఆహాహా! ఏ మనుచుంటివి?

విశ్వమంతయు నిండి వెలుగు నన్నెచ్చటి
కావాహనమొనర్తు వమరరాజ?
అఖిలలోకాధార నౌ నాకు నెద్ది ది
వ్యాసనంబౌను స్వర్గాధినేత?
నిత్యపవిత్రనై నెగడు నా కెట్లర్ఘ్య
పాద్యాదు లిత్తువో పాకదమన?
బ్రహ్మాండముల కుక్షిభరియించు నా కేమి
యుపవీతమును, వస్త్రముంతువయ్య?
గంధపుష్పాక్షతాద్యలంకార మేది?

ఏమి నైవేద్య మిడుదునో? ఇంద్ర! నిత్య
తృప్తనౌ నాకు; నెట్లు స్తుతింపనేర్తు?
వాఙ్మనోఽగోచరాఖండ వస్తు నన్ను.

ఇంద్రుఁడు — నీప్రశ్నములకు మాఱు పలుకుటకు సర్వజ్ఞుఁడును విమూఢుఁడే యగుచుండె! నేనేమిచెప్పఁగలను? నా ఆశయమును వెలువరించితిని.

తేజస్సు—ఇంద్రా! మఱచితివా? నా మాయాప్రకృతిబలముచేత ఒకింత దృశ్యమాననై మెలఁగుదునని చెప్పియుంటినిగదా! ఆనాయంశము నే నీ వర్చింతునని యనలేవా?

ఇంద్రుఁడు—క్షమింపుము జననీ! విమోహాత్ముఁడనై యుంటిని. నీబోధచే తెలివి గలిగె. ధన్యుఁడనైతిని.

(శంఖమును పూరించును.)

(సకలదేవతలును పర్విడివత్తురు.)

ఇంద్రు—బృందారకులారా! ఈమహాతేజస్వి ఎవరనుకొంటిరి?

త్రైలోకముల
నేలెడుతల్లి, ప్రపంచ మీమెయం
దే యుదయించు, నిల్చు నశి
యించెడు; నీయమపేర్మియుంట నేఁ
డాయతమైన దైత్యజయ
మందితి ముత్సవ మీపెఁగూర్చియే
చేయుట లెస్స; లెండు! సుర
సింహులు తల్లికిఁ బూజ సల్పఁగన్.

అందఱును—తథాస్తు! తథాస్తు!! తథాస్తు!!!

(హారతులు వెలిఁగించిదండకముంజదువుదురు)

దండకము—శ్రీమన్మహాలోకమాతా! భవాంభోధిపోతా! వశీభూత భూతేశకంజాత జాతా! కృపాపూర్ణమూర్తీ! జగద్గీతకీర్తీ! భవద్దివ్యదేహంబు నందెల్ల బ్రహ్మాండములుప్పుట్టి పెంపొంది, యందే యడంగున్; ప్రపంచంబు నీయందవర్తిల్లు; నీవందునుండంగఁబోలే! త్వదీయోరుకారుణ్యలబ్ధిన్ జగంబుల్ స్వకార్యమ్ములం బూర్ణకామమ్ములై వర్తిలు; నీకళోరాజ్ఞచే సర్యుఁ డుదయించు, వాతంబు వీచుం, గృశానుండు నల్గున్, మహేశీ! యిఁకం బెక్కుభూతంబులంయూహనుల్సేయు, నీశక్తియే యన్నిటన్ భిన్నభిన్నంబులై తోఁచు, నజ్ఞానసేలోకము జీవవంతమ్ములై గ్రాలు, నిద్దానిచేత న్మహాదుష్టదైత్యసంఘంబులం జీల్చి చెండాడఁగాఁ గల్గినా మమ్మరో! ఈజయం బంత నీసత్కృపాదృష్టిఁ గల్గెన్; భవత్సేవకానీకమే మేము; మోహాంధతన్ గర్వముం జెంది యిద్దాని కస్మత్ప్రభావంబె మూలంబటంచు న్మహాహంకృతింబూని యున్నట్టి మా కీపరిత్యాగ్రకియల్ యుక్తము ల్గావె! తల్లీ! తదజ్ఞానపుంబొంపుచే మాయహంకారముం గూర్చి మున్నుత్సవా ల్సేయఁగా బూనినా; మిప్డు సుజ్ఞానముం జేసి యాయుత్సనా లీనికై గావింతుమీ; దాసవర్గంబు పూజ ల్దయంగొమ్ము! మాతప్పుల న్వేగ మన్నించికాపాడుమమ్మా! పరాశక్తివమ్మా! భవత్సేవనిమ్మా!! నినుంగొల్తుమమ్మా!!! నమస్తే, నమస్తే, నమస్తే, నమః.

[ఇందలి పద్యములు కొండూరు రాఘవాచార్యులుగారు రచియించిరి.—తత్త్వానందస్వామి.]




పెరిన్ యస్. ఆలీకన్య, బి.ఏ., యల్. టి.




మదరాసు విశ్వవిద్యాలయము. ఈమె ఇంగ్లండులో ఉన్నతవిద్యను సంపాదించుటకయి పోయినది పోస్టల్ మెయిలుసర్వీసు సూపరింటెండెంటు యస్. సుజాయిత్ అలీగారి కూతురు



# ఆంధ్రాభ్యుదయము

వి. ఆర్. చిత్ర



జపాను చిత్రలేఖనము నభ్యసించుటకు జపానుకు పోయిన ఆంధ్రచిత్రకారులు. వీరిచిత్రములు భారతియం దప్పుడప్పుడు ప్రకటితము లయినవి.

# కలగూరగంప

కీ. శే. మ్యాక్సింగోర్కి



మ్యాక్సింగోర్కి గారు చనిపోయిరి. మ్యాక్సింగోర్కి గారికి ౬౮ సంవత్సరములు. రష్యాదేశపు గ్రంథకర్త: తన నవలలందు మానవజీవితమును కండ్లకగుపడుచున్నట్లుగా చిత్రించగల్గిన నేర్పరి. ౧౯౦౫ రాజకీయ నేరముల కై శిక్షింపబడెను. "౧౮౭౮ లో జోళ్లుకుట్టుపనివాని వద్ద సేవచేసితిని. ౧౮౭౯ లో ప్లానులు వ్రాసేవానివద్ద నుంటిని. ౧౮౮౦ లో రొట్టెలు చేయుచుంటిని. ౧౮౮౪ లో సామానులుమోయు కూలివాడుగా పనిచేసితిని. ౧౮౮౬ లో నాటకశాల వాద్యములందు పాటకాడుగ ప్రవేశించితిని. ౧౮౮౭ లో వీధులందు పండ్లమ్మకొంటిని. ౧౮౮౮ లో ఆత్మహత్య జేసికొన యత్నించితిని. ౧౮౯౦ లాయరు గుమాస్తాగానుంటిని. ౧౮౯౧లో రష్యా అంతయు కాలినడకను తిరిగితిని. ౧౮౯౨లో రైల్వేలందు కూలివాడుగ పనిచేసితిని. ఆయేడే నా ప్రథమకథ ప్రకటించితిని." అని గోర్కిగారు తనను గురించి వ్రాసియుండెను.

కీ. శే. జొన్నపత్తుల శేషగిరిరావు



శేషగిరిరావు నటకుడు; మంచిగాయకుడు. చిన్నవయస్సులోనే చనిపోయినాడు పాపము.

---

## కీ. శే. కీర్తనాచార్య
## సి.ఆర్. శ్రీనివాసయ్యంగారు, బి.ఏ.,ఎల్.టి.



సి. ఆర్. శ్రీనివాసయ్యంగారు ౧౮౮౮ లో తంజావూరు జిల్లాలో జన్మించిరి. వీరు నలువదియేళ్ల పాటు మదరాసు రాజధానిలో చాల హైస్కూళ్లలో ఫస్టు అసిస్టెంటు టీచరుగాను, హెడ్‌మాస్టరుగాను పనిచేసిరి.

వీరు విజయనగరములో నున్నపుడు, శ్రీ ఆనంద గజపతిమహారాజులుంగారి ఆస్థానపండితులును, సుప్రసిద్ధ వైణికులును అగు వీణ వెంకటరమణదాసుగారివద్ద వీణవాయించుట నేర్చుకొనిరి.

విఖ్యాతగాయకులగు గోపాలయ్యంగారివద్దను, శరభశాస్త్రి, కృష్ణ భాగవతారుగారివద్దను, మైలాపురం భాగవతారులవద్దను సంగీతశాస్త్రము నభ్యసించిరి.

సంగీతశాస్త్రమునందు వీ రపరిమితమగు కృషి సలిపిరి. స్కూలుఫైనలుపరీక్షకు సంగీతముకూడ పఠనీయవిషయముగా విద్యాశాఖవా రంగీకరించుటకు వీరు పట్టుపట్టి కృషిచేసి సఫలులైరి.

మదరాసు విశ్వవిద్యాలయము, మద్రాసు సంగీత పరిషత్తు, అణ్ణామలై విశ్వవిద్యాలయము-ఈమూడు సంస్థలలోను సంగీతమున పఠనీయగ్రంథనిర్ణయసంఘ సభ్యులుగా నుండిరి.

వీరికి హరికథలను చేయుటలోకూడ గొప్ప ప్రజ్ఞ కలదు గాన వీరికి 'కీర్తనాచార్య' అను బిరుద మొసంగబడినది. వీరు విమర్శన లొనరించుటలో నిరుపమానులగుటచే 'సంగీత విమర్శకాచార్య' యను బిరుదము కూడ వీరికియ్యబడెను. శ్రీ త్యాగరాజకృతులను వీరు స్వరసహితముగా, వివరణాదులతో ప్రకటింపించి ఆంధ్ర గేయవాఙ్మయమునకు మహోపకారము కావించినారు. ఈ కారణమున వీరికి 'అభినవ త్యాగబ్రహ్మము' అను బిరుదమును లభించినది.

వీరికి హిందూస్థానీ సంగీతమున కూడ విశేష ప్రజ్ఞకలదు. సంగీతమునుగూర్చి వీరు పెక్కు వ్యాసములను వ్రాసి తమిళ, ఆంగ్లపత్రికలయందు ప్రచురింపించిరి.

వీరు ౫౦ గ్రంథములను ఇంగ్లీషు, తమిళ, సంస్కృత భాషలయందు ప్రకటించిరి.

ఆదర్శప్రాయమగు జీవితమును గడపి శ్రీనివాసయ్యంగారు ౨౫ జూన్ ౧౯౩౬ నాడు పరమపదించిరి.

---

## గురునానకు జీవితమునందలి కొన్ని ముఖ్యాంశములు

గురునానకు సంచారమున నతనితో హిందువులలో 'జాట్' అను తెగకు జెందిన బలుడును, మహమ్మదీయ గాయకుడగు మర్దనుడును అనుగమించిరి. "దుమ్మ-వేడిమి ఫకీరులు-గోరీలు" అను వీటి సముదాయము అనుపేరుగల ముల్తాన్ నగరమునకు ఈ ముగ్గురును వెళ్లిరి. వీరు నగర ద్వారమునుచేరి నిలుచుండగా, ఒకడు పాలతోనిండిన కడవను నానకుముం దుంచెను. దానిభావము 'మాపట్టణము ఇప్పటికే ఫకీరులతో నిండినది. ఇంకనెక్కువ

మందిని భరింపజాలదు' అని. అదిచూచి గురునానకు నవ్వుచు "ఇప్పుడు మీనగరములో నున్న ఫకీరులలో నేను పుష్పమువలె శోభిల్లుదును" అనియు, తన స్వభావమును దాని సుగంధమువలె వ్యాపింపజేయుదుననియు నర్థమిచ్చునట్లు ఒకమల్లెపువ్వును ఆపాలకడవయందు బడనైచెను. ఎట్టి మహత్తరమగు ఆదర్శము! గురునానకు దౌలత్ ఖాన్‌లోధీకి కోశాధికారిగా (Store-keeper) పనిచేసినప్పుడు ఒకసారి ధాన్యమును కొలుచుచుండెను. పన్నెండుసార్లు కొలచినతరువాత 'తేరా' అను పదమూడవసంఖ్యను తెలుపు హిందూస్థానీసంఖ్యను పలికెను. 'నేను నీవాడను' అనుఅర్థాంతరముగల ఆమాటను ఉచ్చరించుచు సరియగుగణనను మరచిపోయి సమాధిలో పడిపోయెను.

హరిద్వారములోనుండగా, గంగానదిలో స్నానము చేయుచు పూర్వదిశాభిముఖులై అర్ఘ్యప్రదానము చేయు జనులను నానకు చూచెను. వెంటనే తాను నీళ్ళలోదిగి, దోసిళ్ళతో నీరుదీసికొని పశ్చిమాభిముఖుడయి చల్ల నారంభించెను. చుట్టుప్రక్కలనున్న జనులు ఆశ్చర్యముతో "ఈ పిచ్చియే"మని ఆయన నడిగిరి. "మీరుచేయునదే"మని ఆయన వారి నడిగెను. వారు తమ పితృదేవతలకు గంగాజలములను తర్పణములిచ్చుచున్నామని బదులిడిరి. అప్పుడు గురునానకు తాను తనయింటికిదగ్గరనున్న పొలములకు నీరు చల్లుచుంటినని చెప్పెను. జనులందరు చాల ఆశ్చర్యపడిరి. "ఇంటివద్దనున్న నీపొలములకు ఇంతదూరమునుండి నీవుచల్లిన నీరు పోవునా?" అని యడిగిరి. "పరలోకమునన్న మీ పితృదేవతలు మీ తర్పణోదకములను గ్రహించుచుండ, నేను విడిచెడి నీరు నా పొలములకుమాత్ర మేల చేరదు?" అని మందహాసముతో నానకు బదులు చెప్పెను.

మంచిచెడుగుల భేదములేక అమిత ధనమును కూడబెట్టిన కోటీశ్వరు డొకడుండెను. ధనమును కూడబెట్టుటయే వాని పరమావధియై యుండెను. గురునానకు వానియొద్దకుబోయి ఒక సూది వానికిచ్చి "ఇదిగో దీనిని జాగ్రత్తగా నీయొద్దనుంచి పరలోకమునకు నీవుపోవునపుడు నీవెంటదీసికొనిపొమ్ము. నేనువచ్చి దానిని నీవద్ద నుండి తీసుకొందును." అనిచెప్పెను. "అదెట్లు వీలగును?" అనికోటీశ్వరు డడిగెను. "నీవు కూడబెట్టిన యింతధనమును నీవెంటదీసికొనిపోవా? ఈసూది బరువగునా?" అని నానకు చెప్పెను. అది విని కోటీశ్వరుడు తన లక్షలాది ద్రవ్యమును నిస్సహాయులకొఱకు ఖర్చుపెట్టెనని జనులు చెప్పుదురు.

మక్కాలో నున్నప్పుడు కొందరు 'హాజీలు' "హిందువులు గొప్పవారా, మహమ్మదీయులు గొప్పవారా" యని నానకు నడిగిరి. "మంచిపనులుచేయక ఉభయులును వుత్తవారే" నని గురునానకు చెప్పెను.

మక్కాలోనే 'కాబా' (దేవునిమందిరము) వైపు కాళ్ళుపెట్టుకొని నానకు పరుండుటనుజూచి 'ముజావరులు' మిక్కిలికోపముచెంది దేవమందిరము వైపు కాళ్లుపెట్టి పరున్నందుకు ఆయనను చీవాట్లుపెట్టసాగిరి. చిరునగవుతో నానకు "అయిన నాకాళ్లు దేవుడులేనివైపు పెట్టుడు. దైవము సర్వాంతర్యామి యని నేననుకొంటిని!" అని బదులుచెప్పెను.

ఒకయోగి గృహమేధులను నిందించి ప్రపంచ సుఖత్యాగమునందలి సౌఖ్యమునుగురించి గురునానకువద్ద పొగడ నారంభించెను. అతనితో "నీవు ప్రపంచసుఖములను త్యజించి, సంసారులను నిందించుచున్నావు కాని నీప్రతిదినభోజనమునకై వారినే యాచించుచున్నావు" అని నానకు చెప్పెను.

గురునానకును ఎవడో 'మంచిమనుష్యునిమార్గములను'గురించి ప్రశ్నించెను. "మంచివాడు ఇతరులు సౌఖ్యముగానున్నప్పుడు, అభివృద్ధి నొందుచున్నప్పుడు సంతోషించును. అతడు ప్రతివానికిని సహాయభూతుడగును. ఎవరితోడను కలహింపడు. అతడెప్పుడును సంతోషముతోను, వినమ్రుడుగాను ఉండును. మనుష్యుని, దేవునిగూడ సమానముగా ప్రేమించును." అని గురునానకు చెప్పెను.

గురునానకు తన మహమ్మదీయానుచరుడగు మర్దనునితో, అతడు ఆకలిదప్పులతోను, నొప్పులతోను బాధపడి విసువొంది నిరుత్సాహమునుబొందినపుడు "మర్దనా!

ఓరిమితో వేచియుండి భగవంతుని ఆశ్చర్యకరములగు మార్గములను కనుగొనుము. నిరుత్సాహమును పొందకుము. అత డేమిచేసినను మన మేలుకొరకే" అనుచుండెడివాడు.

ఒకయూరిప్రజలు నానకును సరిగా నాహ్వానించకపోయిరి. ఆయూరు వదలిపోవుచు గురు నానకు 'ఈప్రజలు సర్వదా వీరి స్వస్థానముకు ఈయూరిలోనే యుందురుగాక' అనెను.

గురునానకు మరియొక యూరికి పోయెను. ఆ యూరివారు మంచివారని ఆయనకు తోచెను. అప్పు డాయన "ఈ యూరివారు ఈ యూరిని పాడుపెట్టి నాలుగు దిక్కులకు పోయి కాపురముండిన సెంత బాగుండెడిది" అనిపలికెను. మర్దనుడు "అయ్యా, మనలను సరిగాచూడని ఆ దుష్టగ్రామవాసులను వారి గ్రామములోనె శాశ్వతముగానుండిన మంచిదంటిరి. మనలను మర్యాదగాజూచు ఈ యూరిప్రజలను ఊరు పాడుపెట్టిపోయిన బాగుండునంటిరేమి ?" అని యడిగెను.

"అవును! దుర్జనులు వారున్నచోటనేయున్నచో వారు ఇతరులను పాడుచేయరు. మంచివారు దేశమెల్లెడల పోయినచో వారి మంచితనము ప్రతిచోట వ్యాపింపజేయుదురు" అని గురునానకు చెప్పెను.

(బలవంతసింగ్ ఎమ్. ఏ., బి. టి. గారు మాడర్న్ రివ్యూలో వ్రాసిన వ్యాసమునకు అనువాదము.)

'చక్రవర్తి'

## జర్మనీ నౌకావిమానము



దీనిపేరు 'హిండెన్‌బర్గు'. ఇది యూరపునుండి అమెరికాకు ౬౧ గం. ౪౫ ని. లో ప్రయాణము చేసెను. ఇది రేడియోసాధనముతో తీయబడినఛాయాచిత్రము.

## తుపాకీ కెమేరా



దీనితో విమానములను ఫోటోతీయవచ్చును. ఇంగ్లాండులో వైమానిక సేనలకు దీనితో విమానములను ఫోటోతీయుటకు నేర్పుదురు.

# నక్షత్రమండలము

(ధాతృ సంవత్సర ఆషాఢ, శ్రావణమాసములు)

గోబ్బూరు వేంకటానంద రాఘవరావు

ఉత్తరము




దక్షిణము

[నక్షత్రవేధచేయువారు ఈపటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు చూచి పట్టుకొని పరిశీలింపవలెను.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1936 జూలైనెల | 8 | తేదీని రాత్రి | 8-55 | గంటలకును, | జూలైనెల | 29 | తేదీని రాత్రి | 7-32 | గంటలకును |
| ,, | 15 | ,, ,, | 8-27 | ,, | ఆగస్టు | 1 | ,, ,, | 7-20 | ,, |
| ,, | 22 | ,, ,, | 8-0 | ,, | ,, | 7 | ,, ,, | 6.58 | ,, |

నక్షత్రాదులు కనబడును.]

"Look how the floor of heaven,
Is thick inlaid with Gold with patines
of bright gold !
There is not the smallest orb which
thou beholdest,
But in his motion like an angel sings,
Still quiring to the young eyed cherubin
Such harmony is in immortal souls.
But whilst this muddy vesture of decay
Doth grossly close it in, we cannot
hear it."

Shakespeare —
'Merchant of Venice'
(V-1-65)

నాయనా! చూచితివా? ఆకాశరంగము బంగారముతో దట్టముగా తాపింపబడినట్లు ఎంత మనోహరముగా తోచుచున్నదో! పసిడిపళ్లెరములవలె అందు మెఱయుచు ఆవ్యోమమార్గమున చరించుచున్న చిత్రదృశ్యములు అసంఖ్యగోళములు! మన నేత్రగోచరములగుచున్న అయ్యవి ఎంత చిన్నవైనను దివ్యముగా గానముచేయుచు బాలగంధర్వులదెస సాభిప్రాయముగా తిలకించుచున్నవి. జరామరణముల వర్జించి దేవలోకమున ప్రశాంతత కనిన పుణ్యుల ఆత్మలు ఆ మధురగీతములకు బ్రహ్మానందము పొందుచున్నవి. మృత్తికావృతమై, రక్తమాంసాస్థిపంకిలమైన యీ స్థూలదేహపు చెవులకు ఆ దివ్యగానము, ఆ మధురగీతములు వినరావు!

ఈ ధాతృనామసంవత్సర ఆషాఢ బహుళ చతుర్థి మొదలు శ్రావణ బహుళ షష్ఠివఱకు నగు మాసము-౮ జూలై ౧౯౩౬ మొదలు ౮ ఆగస్టు ౧౯౩౬ వఱకు నగు నీ మాసపు రాత్రులలో తొలిజామున నగపడు నక్షత్రములు, గ్రహములు లోనగు ఖగోళచారుల నారయుదము.

## పాలవెల్లి
## (Milky Way)

ఈ మాసములో పాలవెల్లి ఈశాన్యదిశనుండి దక్షిణదిశకు వక్రముగా వ్యాపించియున్నది. యామ్యోత్తరరేఖకును, తూర్పు దిక్చక్రమునకును మధ్య-ఆదిక్చక్రమునకు ఇంచుమించుగా సమాంతరముగా-నీధవళదృశ్యము వ్యాపించియున్నది. దక్షిణమున నిప్పటి గగనమధ్యరేఖను గడచి ఆగ్నేయమునకు అది చాచుకొనియున్నది. ఈ కొనను ఇప్పటికగపడు పాలవెల్లి వెడల్పుకంటె ఈశాన్యదిశకడ వెడల్పు సుమారు రెండురెట్లుండును. మధ్య రెండు శ్యామసీమలతోకూడ ఈధవళదృశ్యము నడుమ నల్లగ ఛాయాపథము వ్యాపించియున్నది. ఈశాన్యమునుండి వరుసగా అప్సరస, ఊర్వశీపురూరవసు, రాజహంస, శ్రవణ, ధనుర్మండలములమీదుగ, వేదికామండలము ప్రక్కనుండి వృశ్చికమును గడచి అశ్వతరమండలమునకావల ఆగ్నేయక్షితిజముకడ ఇది దృష్టిపథమునకు తప్పుచున్నది. ఛాయాపథముతో పూర్తిగాకూడిన పాలవెల్లి దృశ్య మిపు డెంతో రమ్యముగా నగపడుచున్నది.

## మిక్కిలి ప్రకాశవంతములైన నక్షత్రములు
## (First Magnitude Stars)

ఈ మాసములో నిట్టిచుక్కలు ఎనిమిదిమాత్ర మగపడుచున్నవి. అవేవనగా :

(౧) పడమట అస్తమింపనైయున్న సింహరాశిలో మఘ (Regulus in Leo)

(౨) గగన మధ్యరేఖకును పడమటకును మధ్య కన్యలో చిత్ర (Spica in Virgo)

(౩) చిత్రకు ఎగువ భూతేశమండలములోని స్వాతి (Arcturus in Bootes)

(౪) పాలవెల్లి సమీపమున ఉత్తరాకాశమున బ్రహ్మ (Vega in Lyra)

(౫) పాలవెల్లి సమీపమున దక్షిణాకాశములో వృశ్చికరాశిలోని జ్యేష్ఠ (Antares in Scorpio)

(౬) పాలవెల్లితూర్పుటంచున గరుడమండలములో శ్రవణము (Altair in Aquila)

(౪. ౮) దక్షిణాకాశమున అశ్వతర మండలములో అశ్వినుల 3 వ స్థానమున - ఆల్ఫా - బీటా - సెంటారిచుక్కలు.

## గ్రహములు

ఈమాసములో రాత్రి తొలిజామున మనకు చక్కగా అగపడి మెఱయు గ్రహము గురు డొకడే. గురుడిపుడు జ్యేష్ఠలో వక్రగతు డైయున్నాడు. గగనమధ్యరేఖకు తూరుపుటాకాశమునపాలవెల్లిలో జ్యేష్ఠయు, గురుడును, పడమటి భాగమున చిత్రమఘనక్షత్రములును, వరుసగా విద్యుద్దీపములమాలికవలె ప్రకాశించుచు కనులకు పండువుచేయుట గమనింపతగియున్నది.

## ఉత్తరాకాశమున

చిన్న ఎలుగుతోకచివర ధ్రువుడు మెఱయుచున్నాడు. తోకలో మహేంద్రకశ్యపులును, తోకమూలను అగ్నియు, శరీరమున మిత్ర, ధాత, విధాతలును క్రమముగా నగపడుచున్నారు. ధ్రువుని దిగువనుండి ఈశాన్యమున పాలవెల్లిలోనికి ఊర్వశీపురూరవసులు చొచ్చుకొనియున్నారు. ఆదినుండ అప్సరసలు ఇపుడిపుడే ఉదయమయి తొంగిచూచుచున్నట్లు కనబడుచున్నారు. చంద్రుడును, లక్ష్మియు, పాలసముద్రమున పుట్టిరని పురాణములు తెలుపుచున్నవికదా? అట్లే అప్సరసలు కూడ పాలసముద్రమున పుట్టినట్లు అవి తెలుపుచున్నవి. ఈయంశమే మనుచరిత్రమునందు అల్లసాని పెద్దన్నకవి చక్కగా వర్ణించిన "చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధి పొడమిన చెలువ తోబుట్టు మాకు" అనిన పద్యము ఇపుడు చక్కగా స్ఫురణకువచ్చి పాలసముద్రమునుండి అప్సరసలు జన్మించిన వృత్తాంతము గోచరము గావించుచున్నది. లక్ష్మి పాలసముద్రమున పుట్టి మహావిష్ణువునకు ప్రక్క నిలుచున్నట్లును, పాదము లొత్తుచున్నట్లును చిత్రములు కలవు. అప్సరసలును ఆమెతో పాలసంద్రమున నుద్భవించినట్లు ఇపుడు ఖగోళమున స్పష్టముగా తెలియనగును. ఇక, వాయవ్యమూలను విఘ్నేశ్వరుడు లంబోదరముతో నస్తమింపనై యున్నాడు. అతని వాహనమైన మూషకముకూడ అతనితోనే అస్తమింపనున్నది. వినాయకునకు ఈవల సప్తఋషులు వాయవ్యమునకు వ్రాలి అస్తమింపబోవుచున్నారు. చిన్న ఎలుగు (Ursa minor) కును, పెద్ద ఎలుగు (Ursa major) కును మధ్య నరకుడు మెలికలు తిరుగుచు క్రూరసర్పమువలె ఘోరాకారముతో కానవచ్చుచున్నాడు. నరకుడు విష్ణువునకును భూమికిని జన్మించినాడు కనుక ధరాసూనుడు. ధరాసూన శబ్దవికృతియే లాటిన్‌లో Draconis అని స్పష్టమే కదా?

## పడమట

సింహరాశి అస్తమించుచున్నది. తూర్పున మకరము ఉదయించుచున్నది. ఇటీవల మకరము వాడుకలోనికి వచ్చినను ఋగ్వేదాదివేదవాఙ్మయమున నిది అజమని వ్యవహరింపబడియున్నది. పాశ్చాత్యగ్రంథములలో ఇప్పటికిని దీనికి Capricorn అనియే వ్యవహారము. Capricorn అనగా ఒక జాతి మేక. ఈమేక ఉదయమగుచుండ సింహ మస్తమించుచున్నది. ఇవి ప్రతిస్పర్ధులు (Diametrically opposite). ఈయంశము నాధారముచేసికొని ఋగ్వేదములో ఇంద్రు డొక అద్భుత కార్యము (miracle) నిర్వహించినట్లు వర్ణింపబడినది. చూ. ఋ:

VII. ౧౮-౧౪: "అద్రేణ చిత్తద్వేకం చకార సింహ్యం చిత్పేత్వే నాజఘాన"

"అల్పసాధనముతో అనన్యసామాన్యమైన ఘనకార్యము ఇంద్రుడు నిర్వహించినాడు. మేకచేత సింహమును చంపించినాడు." ఖగోళదృశ్యములనుబట్టి దేవతలకు అనన్యసామాన్యశక్తులు ఆరోపింపబడియున్నవి. అశ్వినులిట్లే వృషభశింశుమార యుక్తమైన రథము నెక్కివచ్చునట్లు వర్ణింపబడెను కదా?

మఘకు ఈవల పూర్వఫల్గునీ, ఉత్తరఫల్గునీ నక్షత్రములు రెండు రెండునేత్రములలాగున మెఱయుచున్నవి. నాలుగును మంచపుకోళ్లవలె చతురస్రముగా నున్నవి. ఉత్తరఫల్గునీ నక్షత్రములలో ఉత్తరపు చుక్కకంటె దక్షిణపుచుక్క తేజోవంతమైనది.

కొంతకాలముక్రిందట ఇది ఇప్పటికంటె చాల గొప్ప తేజస్సుతో మెఱయుచు ప్రథమగణ్యము (First magnitude Star) గా నుండెను. పిమ్మట ఎందుచేతనో తేజము తగ్గిపోయినది.

ఉత్తర ఫల్గుని కేవల హస్త మిలమిలలాడు చున్నది. ఋగ్వేదకాలమున నిందలిచుక్కలు బంగారు వంటి కాంతితో చక్కగా మెఱయుచున్నట్లు వర్ణింప బడినది. చూ. I. ౩౩-౫.

"హిరణ్యపాణి మూతయే సవితార ముపహ్వయే"

ఈ నక్షత్రమునకు అధిదేవత సవితృదేవుడు. కనుక 'ఆదేవుడు బంగారపుహస్తముతో నన్నురక్షించు గాక అని ప్రార్థించుచున్నాను' అని సవితృదేవతాక మైన ఋక్కు కలదు.

హస్తకుపైన వేణీమండలమున కావల క్షీరోదము యొక్క ఉత్తరధ్రువమున్నది. క్షీరోదమునకు దక్షిణమున దిగువను కమఠమకడ దక్షిణధ్రువము-అనగా క్షీరోదము యొక్క దక్షిణధ్రువ ముండుట ఊహించుకొనవలెను. నైరృతిదిక్కున అహిమండలము కొంత అస్తమించినది. చమస వార్తిక నహుషమండలము లింక త్వరలో అస్తమింపగలవు.

దక్షిణమున

అశ్వతరమండలము బాగుగా మెఱయుచున్నది. దక్షిణక్షితిజముపై అశ్వినులు (మూడవస్థానమున ఆల్ఫా, బీటా, సెంటారస్ చుక్కలు) అద్భుత తేజముతో మెఱయుచున్నారు. ఆప్రక్కనున్న వృకము వార్తికపుపక్షిని పొట్టపెట్టుకోకుండ రక్షించి బల్లెముతో పొడిచిచంపుచున్నారు. ఆదిగువను యయాతి, వసుమనాదులును, ఎగువ వేదికకడ బలియు కానవచ్చుచున్నారు.

తూర్పున

మకరము కొంత ఉదయమైనది. మకరము ధ్వజముగాగల మన్మథుడు-ధనూరాశి - పూర్తిగా ఉదయించినది. ఆదిగువ అతని వాహనమైన చిలుక ఉన్నది. వేదములలో ధన్వికి కృశానుడని పేరుకలదు. ఇత డమృత రక్షకుడు. ఎగువను శ్రవణమున్నది. శ్రవణమనగా మన పురాణములలో గరుడుడు. గరుడుడు అమృతము హరించి నాగుల కిచ్చినాడు. తనువెంటనే ఇంద్రుడు వచ్చి నాగులకందకుండ హరించినాడు. గరుడుడు విష్ణువునకు వాహనము, ధ్వజము నైయున్నాడు. శ్రవణమునకు తూర్పుగా వసుదేవతాకమైన ధనిష్ఠ ఉదయించియున్నది. ధనిష్ఠకు ఎగువ ఈశాన్యమున, పాలవెల్లిలో నున్న రాజహంస కావల నారదు డున్నాడు.

మధ్యను

చిత్ర-స్వాతి నక్షత్రములు గగనమధ్యరేఖ గడిచి పడమటకు సగము వ్రాలియున్నవి. చిత్ర "ముత్యము", స్వాతి "పగడము"- ఈ రెండును తోరణస్తంభములవలె జోడుగానుండి ఎచ్చటనున్నను మనోజ్ఞముగా నగపడును. ఆ చుక్కలకేవల గగనమధ్యరేఖకు సమీపమున "విఱిగిపోయిన మూకుటి చెంబు" దాల్చి విశాఖయున్నది. విశాఖ ఇంద్రాగ్ని దైవత్యమైన నక్షత్రము. వాయువు (మరుత్తులు) అధిదేవతగా గల స్వాతిని, అగ్నిదైవత్యమైన విశాఖను గమనించుకొని, ఆ దేవతల ప్రీతికొఱకు వేదములలో ఎన్నో ఋక్కులు ఋషులు రచించినారు.

ఋ. I. ౧౯-౧. మరుద్భి రగ్న ఆగహి
"ఓ అగ్ని, మరుత్తులతో కలిసి రావలెను"

మరుత్తులు - "దివో విమహసః" ఆకాశమున పెద్ద భూతములవంటివారు. (I-౧౬-౧).

భూతేశమండలమునందు స్వాతి కేవర్ణవము నేటికిని ఎంతో ఒప్పియున్నది.

విశాఖకు తూర్పుగా గగనమధ్యరేఖపై అనూరాధచుక్కలు కలవు. వాటికేవల తూర్పుగా జ్యేష్ఠ కలదు. ఇది ఇంద్ర దేవతాకము. ఎగువను శ్రీమహావిష్ణు స్వరూప మున్నది. ఇంద్రునిగూర్చియు, విష్ణునిగూర్చియు వర్ణించుచోట్ల ఋగ్వేదమునందలి ఋక్కులు కడు రమ్యములై యొప్పును.

I. ౨౨-౧౯: ఇంద్రస్య యుజ్యః సఖా.

౨౦. తద్విష్ణోఃపరమం పదం
సదా పశ్యంతి సూరయః
దివీవ చక్షురాతతమ్
౨౧. విష్ణో ర్యత్పరమం పదం.

ఇంద్రుని ప్రియమిత్రుడైన విష్ణువు. ఆకాశరంగమునకు నేత్రముగంటిదై మిక్కిలి ప్రధానాంగమై ఒప్పియున్న శ్రీ విష్ణుని పరమపదమును సూరిజనులు - బుద్ధిమంతులు ఎప్పుడును కనిపెట్టి చూచుచుందురు. ఆపరమపదము మిక్కిలి దివ్యమైనది.

ఈ ఋక్కులు మనవారు పురుషసూక్తముతో చేర్చి నిత్యమును చెప్పుకొనుచున్న వాక్యరత్నములు. ఆనాడు ఖగోళవేధ చేయుచుండిన పూర్వఋషుల ముఖ్యభావము కిందు కలవు. విష్ణుని పరమపద మనుటలో విశేషార్థమున్నది. అది ఆనాటివారికి తెలిసియున్నది. మధ్యయుగములవారు మరువకుండ విష్ణు నక్షత్రముల గమనములతో ఏకాదశులకు సంబంధ మేర్పరచిరి. ఇటీవల హెర్షెల్ (Herchel) వారి ఖగోళవేధమూలముగా దానియథార్థము మరల తెలిసినది.

అదేమనగా:—

చంద్రుడు భూమిచుట్టు తిరుగుచున్నాడు. భూమి, బుధుడు, శుక్రుడు, అంగారకుడు, గురుడు, శని మొదలగు గ్రహములు సూర్యునిచుట్టు తిరుగుచున్నవి. కాని సూర్యుని మాటయేమి? సూర్యుడు తనకుటుంబమునందున్న గ్రహాదులతో కూడ క్షణమునకు పండ్రెండు మైళ్ల చొప్పున ఈ విష్ణుమండలమునకు పోవుచున్నాడు. "పరమపదము" అను మాటలలో ఈవిశేషార్థ మున్నదని నా విన్నపము. పూర్వఋషుల కిది తెలిసియున్నది. హెర్షెల్ దొరవారిది నిర్వచించువఱకు పడమటివారికి తెలియదు. విశేషపరిశోధనలచే నిది యిప్పుడు స్థిరపడినది. ఈ దృష్టితో వేదవాఙ్మయము పరికించినపుడు మనకు ఆనందాశ్చర్యములు కలుగుచున్నవి.

కనుక, మూడడుగులతో విశ్వము నావరించిన విష్ణుడు మాయందు దయగలిగి రక్షించుగాక—

("శం నో విష్ణు రురుక్రమః") అని I. 90. 9. లో చెప్పబడిన ఋక్కు స్మరించి ప్రస్తుతము విరమింతము.

# గ్రంథ స్వీకారము

## భిషగ్రత్న సమ్మానము

భిషగ్రత్న మధునాపంతుల సత్యనారాయణమూర్తిగారి సమ్మానోత్సవ నివేదిక.

ప్రకాశకులు: రేమెళ్ల వేంకటరాయనింగారు.

---

## సీతాకల్యాణము

క్రౌనుసైజు, పుటలు ౧౨౩, వెల రు. ౧

గ్రంథకర్తలు : వాజపేయయాజుల రామసుబ్బారాయ, వేంకటనారాయణ సోదరకవులు; స్నేహలతా కవితా సంఘాధ్యక్షులు, కొల్లాపురము (జటప్రోలు సంస్థానము).

## నివేదనము

(సంఖ్య ౧)

కర్త: ఆకొండి వేంకటశాస్త్రి, తెలుగుపండితుడు, సేవాసదనము, మద్రాసు.

---

## దేశీయపరిశ్రమలు

గ్రంథకర్త: పెండెం వెంకట్రాములు, క్రౌను సైజు, పుటలు ౨౦౦, వెల ౧-౮-౦.

విలాసము : పేరాల, చీరాలపోస్టు.

---

## శ్రీరామాష్టోత్తరశతకము

కర్త : పెమ్మరాజు నారాయణదాస కవి.

సంపాదకుడు: ధరణీప్రగడ వేంకట శ్రీరామమూర్తి, వాడ్రేవుపల్లి. వెల రు. ౦-౧-౬.




## మాఘమాహాత్మ్యము

పద్యకావ్యము. గ్రంథకర్త: అబ్బరాజు శేషాచల శర్మ, డెమ్మీ ౧/౮; పుటలు ౨౨౮. వెల: సాదాప్రతి ౨ రూపాయిలు; క్యాలికో 3 రూపాయిలు. ప్రకాశకులు: శ్రీ అబ్బరాజు హనుమంతరాయశర్మ, తెలుఁగుపండితులు, బోర్డు మిడిల్ స్కూలు; గురజాల, పల్నాటితాలూకా, గుంటూరుజిల్లా.

సంస్కృత పద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యము నాధారముగఁ జేసికొని కవి యీ పద్యకావ్యమును రచించెను. మాఘమాసమున ప్రాతఃకాలముననే స్నానము చేసినచో ఎట్టి కలుషములయినను నశించి జను లుత్తమగతులను పొందుదురని, వారు కోరిన కోరికలెల్ల సిద్ధించునని యిందు పెక్కు దృష్టాంతములతో వివరింపఁబడియున్నది.

ఏతద్గ్రంథ ప్రాశస్త్యముం గూర్చియు, రచనం గూర్చియు గ్రంథకర్తగారి పుత్రులు శ్రీ హనుమంతరాయశర్మగారిట్లు 'తొలిపలుకు' లో వివరించినారు:

'ఇది యాఱాశ్వాసముల పద్యకావ్యము. వీరి గ్రంథరత్న హారంబున కిదియు నాయకరత్నంబు. ఇందు సుమారు ౨,౨3౮ గద్యపద్యంబు లలరారుచుండు. దీని రచనావిధానంబు కడుంగడుఁ గొనియాడఁదగియున్నది ఇయ్యది యర్థంబు గలిచినచోటునకుఁ బదంబు, పదంబాఁగిన తావునకు గణంబు, గణంబు నెలకొనిన ప్రదేశంబునకుం బ్రాసంబుఁ, బ్రాసంబు పాదుకొనినయెడకు విశ్రమంబు నిలువక యొండొంటికిఁ జుట్టరికంబు గట్టిగఁ దెల్పుచుఁ దన వాణిని నలువరాణియైన వాణికి రాణివాసంబునే సేసెనో యన మృదుమధురపదభూయిష్టంబు కవిజనేష్టంబునై ద్రాక్షాపాకంబు వైదర్భీరీతిని నలరారుచుండును.

శేషాచలకవిగారి రచనాకాలంబున నీ గ్రంథంబున నే నచ్చటచ్చట రచనకుం గోడ్పడినవాఁడ నని చెప్పకొనుట తప్పగాదు. మృదుమధురపద గుంభనల నలరారు వారి రచనకును, గుటిలకటువైన నా రచనకును శైలి గలియకుండుటచో యని నా సాహసంబునకు నేన నెరగుపడువాఁడ. అట్లయ్యు నాశ్వాసాద్యంతంబుల వారి యాజ్ఞాబద్ధుండనై కొన్ని పద్యంబులు, మార్కండేయకృత శివస్తవంబు నాచేతనే వ్రాయఁబడినవి.'

ప్రభు, మిత్ర, కాంతాసమ్మితములగు వాఙ్మయములలో పురాణములు రెండవ తరగతివి. వాని నాంధ్రీకరించునపుడు తగురీతి మార్పుల నొనరించి, కుదించి రసమునకు, పాత్రములకు ననుగుణమగునట్టి మార్గము ననుసరించుట యుచితము. ప్రాచీనాంధ్రకవులు పురాణములను రసము చిప్పిలునట్లు ప్రబంధములుగను, కావ్యములుగను అనువదించుచుండిరి. ఈ 'మాఘమాహాత్మ్యము' కేవలము పురాణముగనే భాషాంతరీకృతము.

ఇందలి పద్యములసంఖ్య చాల ఎక్కువ; అందు రసవంతములు చాల తక్కువ. ధార యవ్యగళము; కాని రచన దోషజుష్టము.

ఛందోదోషములు మచ్చునకు—

'నరధర ! శంఖచక్రధర !
శార్ఙ్గగదాధర! శ్రీధరాధరా!'

[పుట ౨౬.] పయి చంపకమాలాపాదమున యతిభంగము కలదు.

గీ. 'ప్రజల నేలెడువాని కో-కష్టుడైన'

[పుట. ౧౧౬.] ఇందును యతి భగ్నమయినది.

'ఈ.........దానహోమముల్
నేపరిఁజేయఁ గోటిఫల-మిచ్చును...'

[పుట ౧౭౭] 'దానహోమములు ఏపరి' అనుటకిచట 'దానహోమముల్ నేపరి' అని వ్రాయఁబడినది.

'దానహోమముల సేపరి' అని యుండదగినది. 'సేపరి' అనిరేఫ రూపమని కవి ఎంచినను యతిభంగము తప్పదు. 'సమసిపోవు బ్రయాగ స్నానమునను' 'యోగి తపముల చేతఁ బ్రయాగస్నాన' [పుటలు ౧౫౪, ౨౦౧.]

ఇచట 'స్నా' కు ముందున్న 'గ' గురువయినది. అది లఘు వయినపుడే ఛందస్సు కుదురును.

పంచపాదముల వృత్తములు, గీతులు నిండు చాల కలవు.

సంధిదోషములు - మచ్చునకు -

'శేషాచలాఖ్యతఁనా బెట్టె'

[పుట ౩.] 'ఆఖ్యనతఁను పెట్టె' నని సాధువు. ఇచట అత్వసంధి కాదు. ప్రథమమీఁది పరుషములు గసడదవ లగును కాని సరళములు కావు.

'సత్కృపల్ జెచ్చెర' [పుట ౫.]

ఈ సరళాదేశము నసాధువు.

'ఈయొప్ప కేల తెచ్చితిరి?

యిట్టి మహాత్ముని బాపచిత్తులై'

[పుట ౫౨] మధ్యమపురుషక్రియకు సంధి నిత్యము. ఇచట సంధిచేయకుండుట దోషము.

'నీదుకార్యముల్, అనిశము తిన్నగా'

[పుట ౧౧౪.] ఇచట 'కార్యము లనిశము' అని యుండవలెను. అట్లు ఉండిన ఛందస్సు చెడును. 'కార్యముల్ అనిశము' అని విసంధి యుండుట దోషము.

కొన్నిక ళలింగు ద్రుతప్రకృతికము లయినవి.

'భీతి నింతలేక' [పుట ౭౪.]

'భీతి యింత లేక' సాధువు.

'ధాతశిరంబు పైనబడి' [పుట ౧౬౩.] 'శిరంబైబడి' యొప్పు.

'నాదురు నట్టి రెల్లరున్.' [పుట ౧౬౨.] 'నాదు రట్టి రెల్లరున్' సాధువు.

'కలదు నతిరమ్యంబై' [పుట ౨౦౨.] 'కల దతిరమ్యంబై' సాధువు.

పయిచోట్లఁ గల 'న' కారము సముచ్చయార్థకము కాఁజాలదు. ఆ యర్థమున కిచట ప్రసక్తి లేదు. కొన్నిచోట్ల (బోయలు నడ్డుకట్టినను. [పుట ౭] మొదలగు పెక్కుచోట్ల.) అక్కఱలేకున్నను 'సముచ్చయము' చెప్పఁబడినది.

ప్రయోగవిశేషములు—

పుట. ౧౩౦. 'ఆరంభుండై'

" ౧౨౭. 'తను భార్యాసుత యుక్తుఁడై.' ఇచట 'తాను' కు బదులు 'తను.'

" ౧౩౨ 'విడిచిపెడితి.'

" ౧౩౪. 'ఆబాలవృద్ధులు.'

" ౧౭౬. 'వేశ్యసతులం దగ్రేసురా లంచు'

" ౧౮౨. 'నీదుపైని బ్రీతి.'

" ౧౮౪ 'పరస్పరతోఁబుట్టువుల వలె.'

" ౧౮౭. 'దయ్యముల కాదు రని.'

" ౧౮౮. 'గంధర్వకన్నియ.'

" " 'పురుషదయ్యము'.

" ౩౮. 'పట్టనమందు.' (పట్టణము)

" ౫౪. 'శంబుకుండు.' శంబూకుఁ డని యుండవలెను.

" ౪. 'శాలను నిర్మించిరి (నియమించిరి) అనుటకు 'నీమించిరి.'

" ౬౫. 'బ్రాహ్మ్యము.' (బ్రాహ్మము)

" ౨౦౦. 'అవారిత బలిమిన్.'

" ౧౮౫. 'ప్రకాశమాన మొండె.' (ప్రకాశమానమయ్యె ననుటకు.)

" ౧౬౪. 'అధిక శౌర్యరులగు.'

" ౧౭౨. 'సీ. ఆనీరములు నగు హరిరూపమని శ్రుతు, లందు నిరూపించె.'

ఇచట కర్త లేదు. 'నిరూపింపఁబడె' ననుట యుచితము.

పుట. ౭. 'పరిమళయుక్తమౌ పంకేరుహాంబులు' ఇచట వచనము సరికాదు.

పుట: ౨౩. 'భాస్కరుని పుత్రుఁడైన వైవస్వతుండు' ఇచటి రెండును విశేషణములే. అర్థము నభిన్నమే. ఇచటి విశేష్యము 'యముఁడు.' అది లేదు.

పుట. ౪౮. 'మనము వాక్కు కర్మమున' (మనోవాక్కర్మముల, లేక మనమున, వాక్కున, కర్మమున అనుటకు.)

పుట. ౧౦౦. 'అంబికాధవుఁడు.' పయి పదము 'శివుఁడు' అను నర్థము నిచ్చును; కాని విపరీతార్థమును స్ఫురింపఁజేయుంచే దుష్టము.

పుట. ౧౧౯. 'సీ. ధరఁగల జంగమ స్థావరంబైన యీ, ప్రాణికోటులయందు.' ('ధరఁగల స్థావర జంగమాత్మకమైన ప్రాణికోటియందు' అనుటకు)

పుట. ౧౬౬. 'బహువత్సరము లుండఁబడుచు.' ఇది అరవతెలుఁగుల 'నేను వినఁబడితిని' వంటిది.

'మాఘమాహాత్మ్యము'న వ్యర్థపదములయు, పునరుక్తులయు కూర్పు ఎక్కువ. ఒక్క యుదాహృతి-పుట ౬౮—

'గీ. ఆచట భార్యలెంద ఱందఱ కన్ని గృహములు మానివరుఁడు నమరశిల్పకారియైన విశ్వకర్మను రావించి యతనిచేత నపుడు నైదు పదులు.'

పారభికి ఏఁబదిమంది భార్యలు ఉన్నట్లు ముందు పద్యమునసే కలదు. ఎందఱు భార్యలు కలరో అందఱికి అన్ని గృహములు కట్టించె ననిన చాలును. మఱల 'ఐదు పదులు' చెప్పుట అనావశ్యకము.

పయివానితోఁబాటు అచ్చుతప్పులు నిండు ఎక్కువగాఁ గలవు. 'వసిష్ఠుఁ'డనుటకు 'వశిష్ఠుఁ' డని ఎక్కుసారులు ముద్రింపఁబడినది.

ఈ గ్రంథమున గ్రంథముతో ఏ సంబంధము లేని శ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారి 'విస్మృతి' (స్మృతియని శ్రీ హనుమంతరాయశర్మగారి అభిప్రాయమేమో!) యు, ప్రకటనకర్తగారి పుత్రుఁడు రచించిన 'పార్వతీపరిణయ' గ్రంథ ప్రశంసయు కలవు. శ్రీ శర్మగారు ఒవరించిన 'మాతృ, పితృ, పుత్ర, జామాతృవిస్మృతి' (స్మృతి) యును ఇందు కలవు.

'ఏది యెట్లయినను వారి (గ్రంథకర్తగారి) రచనా చమత్కారము, ధారాశుద్ధి, సంస్కృత పద జటిలత్వంబు (?), నాంధ్రపదలాలిత్యంబు, గర్భకవిత్వ బంధురంబు (?), చిత్రకవిత్వ సుందరంబు (?), కూర్పునేర్పు నాకంటెఁ బరపండిత మండలంబు నోర్కి పరిగణించుచు గుణాగుణంబుల విమర్శింప నర్హంబు' అని శ్రీ హనుమంతరాయ శర్మగారు వ్రాసిరి వాఙ్మయాభిమానులీ గ్రంథమును జదివి తత్త్వము గ్రహింతురుగాక! బు. వేం. ర.

---

## రామమోహన విజయము

హరికథ. రచయిత: శ్రీ ద్రోణంరాజు రామమూర్తి. మంచి కాగితము. చక్కని యచ్చు. క్రౌను ౬౩ పుటలు. వెల ౮ అణాలు. ప్రకాశకులు: సాధనకుటీరము, పిఠాపురము.

విదేశీయులు భారతదేశమున ప్రవేశించి, తమ ప్రభుత్వముతోఁబాటు మతమును వ్యాపింపఁజేసి హిందువులను తమ మతములో కలుపుకొని హిందూమతమును నశింపఁజేయ మొదలిడిరి. అట్టి సమయమున శ్రీ రాజా రామమోహనరాయ లవతరించి అన్ని మతముల తత్త్వమును పరిశీలించి మతాంతర ప్రవిష్టమగు హిందూజన ప్రవాహమున కడ్డువేసి మతమునకు మహోపకార మొనర్చినాఁడు.

శ్రీ రామమోహన రాయలు జన్మించుసరికి భారతదేశము అన్నివిధముల చాల దీనావస్థలో నుండినది. హిందువులలోనే పెక్కు అంతర్మతములు ప్రబలినవి. వీరశైవులు శివుని, వీరవైష్ణవులు కేశవుని, శాక్తేయులు శక్తిని కొలుచుచుండిరి. వీరికి పరస్పరము మతవైషమ్యములు హెచ్చుపెరుగుచుండినవి. అవైషమ్యము లనేకములగు ఘోరకృత్యములను జరిగించెడివి. భర్తమరణించినచో హిందూస్త్రీ సహగమనము చేయవలెనను నియమ ముండెడిది.

సతిఖురి ప్రబలముగ నుండినది. స్త్రీలకు గౌరవము లేక పోయినది. జాతులలో ఎక్కువతక్కువ భేదములం బట్టి వైషమ్యము ఏర్పడినది. ఇట్టిస్థితిలో పాశ్చాత్యులు, మహమ్మదీయులు హిందూమతమునందలి లోపములను జేర్కొని, తమమతముల మంచిని తేటపఱచి అనేకు లగు హిందువులను తమతమమతములను స్వీకరింపఁ జేసిరి.

శ్రీరామమోహనుఁడు హిందూమతమునకు చాల సౌకర్యములు కలుగఁజేసి, మతాంతరములకంటె దానికిఁ గల గొప్పతనమును బాగుగ వ్యక్తపఱచి హిందూమతమును నిలువఁబెట్టెను. అతఁడు నరబలిని, బలిని మాన్పెను; సహగమనము కూడదని ప్రభుత్వమువారిచే శాసనము చేయించెను; వైషమ్యములకు లోనయిన విగ్రహారాధనము పనికిరాదని తెల్పెను; జాతిభేదము పనికిరా దనెను; స్త్రీలును పురుషులవలె గౌరవార్హులని యుపన్యసించెను. భగవంతుని కిన్ని రూపములు లేవని, అతఁడు నిర్గుణ పరబ్రహ్మ స్వరూపమని, ఈ రూపములు మానవ కల్పితములని అతఁ డుద్ఘోషించెను. తన యాశయముల ననుసరించి అతఁడు 'బ్రహ్మసమాజము'ను స్థాపించి, జాతిభేదమును లెక్కింపక అందఱిని సామాజికులనుగాఁ జేర్చుకొనెను.

శ్రీరామమోహనుఁడు ఖండాంతరములకును పోయి హిందూమతప్రాశస్త్యము నచ్చట చాటెను. అతని యత్నము ఫలించి మతాంతర స్వీకరణమునకుఁ గుతూహలపడిన పెక్కురు భారతీయులు బ్రహ్మసమాజమునఁ జేరిరి.

'రామమోహన విజయము'న పయి బ్రహ్మసమాజ ముఖ్యోద్దేశములు, శ్రీరామమోహనుని సంగ్రహచరిత్రము వివరింపఁబడినవి. ఇందలి రచన సరళము. చాలవఱకు నిర్దుష్టము.

'రమాకాంతుఁ' డనుటకు 'రామకాంతుఁ' డని, 'రామమోహనుఁ' డనుటకు 'రామామోహనుఁ' డని యిందు ఛందస్సిద్ధికై వాడఁబడినది. విశేషనామవాచకములను మార్చుట ఉచితముగాదు.

బ్రహ్మసమాజ తత్త్వము సంగ్రహముగ తెలియఁ గోరువారికీ చిన్న పుస్తకము ముఖ్యపఠనీయము.

బు. వేం. ర.

---

## జగత్ ప్రవక్త

(వచనము - రెండు భాగములు)

గ్రంథకర్త: మహమ్మద్ అబ్దుల్ గఫూర్, ఉర్దూ మున్షీ, బోర్డు హైస్కూలు, చిత్తూరు.

వెల: ఒక్కొకభాగము ఒక్కొక రూపాయి.

హజ్రత్ మహమ్మదు పైగంబరువారి దివ్య చరిత్ర మీరెండు సంపుటములలో సమగ్రముగ నిమడ్పబడినది. ఆ జగత్ప్రవక్తయొక్క సమగ్రచరిత్రయు, వారు పాటుపడి, కష్టములోర్చి ప్రచారముచేసిన ఇస్లాము మతముయొక్క తత్త్వములును సుబోధమైన శైలిలో వివరింపబడియున్నవి. తెలుగువారికిది ముఖ్యముగ నాదరింపదగిన గ్రంథము. స్వస్వమతముల బాగోగులను పరిశీలించుకొనుటకైనను పరమతతత్త్వముల నాకళించుకొనుట వివేకము. సప్రమాణముగ కూర్పబడిన యీ గ్రంథ సంపుటములవలన నిస్లాము మతస్వరూపమును, తత్ప్రవర్తకుల చరిత్రములును సులభముగ, వివరముగ నవగాహనపరచుకొనవచ్చును. మత సంప్రదాయబద్ధములగు పరిభాషలును ఇందు చక్కగ వివరింపబడియున్నవి. భాష నిర్దుష్టము; సులభము. ఇంతచక్కగ విశదమైన తెలుగున రచియించిన యీ గ్రంథకర్త నిజముగ నాంధ్రుల కాదరణార్హుడు. గ్రంథముకూడ మత గ్రంథమైనను కథాంశలతో గూడి చదువ నింపుగ నున్నది.

---

i కావ్యమంజరి

ii నడుమంత్రపుసిరి

కర్త: శిరోమణి [illegible] సూర్యనారాయణ శాస్త్రి. వెల ఒక్కొక్కటి నాలుగణాలు.

ప్రాప్తిస్థలము: వేంకట్రామ అండు కో., 8998 మార్కెట్టువీథి, సికింద్రాబాదు (దక్కను)

# నాభిప్రాయ విశేషములు

ప్రపంచధర్మపరిణామము ధర్మాత్ములకు ధర్మ సందేహమును గలుగజేయుచున్నది. దైవబలమును రాక్షసబలము, నీతిబలమును దేహబలము, ఆత్మబలమును పశుబలము, ధర్మబలమును బాహుబలము జయించినవిధముల మానవనైతికపతనము లందు రాక్షసవిహారము [illegible]. అనాగరికమతము నకు నివాసముగను, పాపసహారము నకు క్రీస్తు ప్రాణత్యాగము నుద్ధరణము నకు మహాత్యాగమును సాధనమైనవిధ మును ధర్మపరిణామము విశదముచేయుచు న్నది. అమరత్వమునకు త్యాగమే మూల మని సకలమతములు, ధర్మములు బోధించు చున్నను నవీనమానవకోటి త్యాగము వెనుకబడుట ప్రపంచము పట్టిన దుర దృష్టము. పాశ్చాత్యరాజ్యములు వృద్ధిచేసిన హింసాసంస్కారము ప్రపంచమునం దంతటను వ్యాపకమును గాంచినవిధమును ప్రపంచ వ్యవహారము లన్నిరంగములందును సహస్ర ముఖములను చాటుచున్నవి. పాశ్చాత్య రాజ్యములు మతవ్యాపనమునకును, వ్యా పారధనరాజ్య లాభములకును మారణాస్త్ర ముల నుపయోగించుచున్నవిధము హేయ మైనను పరిపాటియై పండిత ప్రజాదరణామో దములను బడసినది. మానవధర్మసంరక్షణ మున కేర్పడిన నానాజాతిసమితివ్యవహారము విపర్యయమును ప్రపంచమునకు సువ్యక్తము చేసినవి. అబిసీనియా రాజ్యాపహరణము, నీగసుగారిపతనము, ఆంక్షలయుపసంహారము నానాజాతిసమితియందున్న చిన్నరాజ్యముల కును, పరాధీనరాజ్యములకును స్వధర్మ జిజ్ఞాస కవకాశములను గలుగజేసినవి.

* * * *

పెద్దరాజ్యములు

నానాజాతిసమితి పెద్దరాజ్యముల స్వప్ర యోజనసంరక్షణ కేర్పడిన విషయము ను సమితికార్యక్రమారంభము నుండి యును వెల్లడియగుచున్నను ధర్మా త్ములు సమితిధర్మనీతియందు విశ్వాస మును గలిగియుండిరి. ఆ విశ్వాసమును సమితి సమక్షమునందు నీగసుగారు చేసిన ప్రసంగమును, ఆంక్షల యుపసంహారము ను, అ[illegible]కరణమును నాశనము చేసినది. ఫ్రాన్సు, గ్రేటుబ్రిటను రాజ్యములు నీగసు గారి బహిరంగముగ నభయము నొసంగుచు ఇటలీతో చేసికొన్న రహస్యసంధి పరమా నర్థములకు మూలమైనది. బ్రిటీషు రాజ్యాధి కారులమాటలనునమ్మి నీగసుగారు చెడిపోయిన విధము సర్వత్ర తెలిసినది. బయటికి ఆం క్షలు, లోలోపలను, సహాయమును రాజ్య పంపకమును ధర్మమార్గముగాదు. నీగసుగారి కభయము నొసంగి హెచ్చరించకను అబిసీని యానుదానిగతికి విడిచిపెట్టినను నీగసుగారికిని, దేశమునకును కొంతమేలు కలిగియుండెడిది,

ఇటలీ క్రిందనైనను నీగసుగారు తలదాచుకొని కాలయాపన జేయుట కవకాశము లుండి యుండెడివి.

యుద్ధమునందు సహాయము చేయుట కభయమును, పరాజయానంతరము బ్రిటిషు నౌకమీదను దేశభ్రష్టుని జేయుటయును కేవల మన్యాయము. నీగసుగారికి బ్రిటిషు మంత్రులు, ప్రజలు చూపిన గౌరవ స్వాగతములు కేవలము కపటనాటక ప్రదర్శనములు. అంక్షలు ప్రయోజనకరములు గాకపోయినను నుపసంహరించవలసిన యవసరము గనుపడదు. ఇటలీ అబిసీనియా దండయాత్రయం దవలంబించిన రాక్షసకృత్యములను, దేశాక్రమణమును ఫ్రాన్సు, గ్రేటుబ్రిటను, నానాజాతి సమితి సమ్మతించినపుడు ప్రపంచమునందు ధర్మము, న్యాయము లేవనియే చెప్పవలసియున్నది. ప్రపంచవ్యవహారములందు బలమునకుగల గౌరవ ప్రతిష్ఠలు ధర్మమునకు లేవని విశదమైనది. శాంతిధర్మస్థాపన కేర్పడిన నానాజాతిసమితి హింసా దౌర్జన్యముల నామోదించినపుడు సకలవ్యవహారములందును, హింసాదౌర్జన్యములు సఫలముగాకపోయినను, ప్రతిష్ఠను బడయుట సహజము. రెండు వేలేండ్ల తరువాతను ఇటలీనాయకులు రోమక సామ్రాజ్య విజయములను సంస్మరించి కీర్తించి యానందించుట ప్రపంచ ధర్మ మధోగతిపాలగుచున్న విధమునకు ప్రమాణముగనున్నది. ఇటలీ ప్రజలు చిరకాలము స్వాతంత్ర్యము ననుభవించుచున్న అబిసీనియాచరిత్రమును, పారతంత్ర్య దుఃఖము ననుభవించిన స్వదేశచరిత్రమును సింహావలోకనము చేయుట వివేకము.

లూక్సుగారి ఆత్మహత్య

ఇటలీ విజయములు జర్మనీకి మత్తును గలుగజేయుచున్న విధమును జర్మనీ వ్యవహారములు విశదముచేయుచున్నవి. జర్మను సైన్యములు రైనులాండు నాక్రమించుకొన్నను ఫ్రాన్సు, గ్రేటుబ్రిటను, నానాజాతి సమితి మూకభావమును వహించినవి నాజీ విజృంభణము డాంజిగు ప్రాంతములందు సాగుచున్నను నానాజాతి సమితి నిశ్చేష్టతనువహించినది. నాజీలు యూధులపట్లను జూపుచున్న హింసాదౌర్జన్యావమానములు పరమాసహ్యములైనను సామాన్య సమ్మతములైనవి. జినీవాయందు నానాజాతిసమితిసమక్షమునను పత్రికావిలేఖరి లూక్సుగారు చేసికొనిన ఆత్మహత్యమైనను నాజీలకును, ఫాసిస్టులకును, నానాజాతిసమితికిని, శాంతిధర్మకాములకును జ్ఞానోదయమును గలుగజేయవలసియున్నది. ప్రపంచమంతయును రక్తప్రవాహములతో తడియకను శాంతిధర్మములు దుర్లభములని సకలదేశవ్యవహారములును విశదముచేయుచున్నవి. రాజకీయములు వలెను సాంఘికార్థిక వ్యవహారములును మహాప్రళయమునకు వినియోగపడగల విధమును ప్రపంచవ్యవహారములు విశదముచేయుచున్నవి. ఈ సందిగ్ధసమయమునందు మహావిప్లవ రంగమైన సోవీటు రుష్యారాజ్యము

చూపుచున్న నిగ్రహము, పురోగమనము ప్రపంచశాంతిని సంరక్షణమునకు వినియోగపడుట శుభసూచకముగనున్నది. ప్రపంచ వ్యవహారములు పరతంత్ర రాజ్యములకు- ముఖ్యముగా హిందూస్తానమునకు - గలుగజేయుచున్న దుఃఖవేదన వర్ణనాతీతముగ నున్నది.

* * * *

హిందూస్థానవ్యవహారములు.

హిందూస్థానవ్యవహారములు ౨౦ ఏండ్లకు పూర్వము మోంటేగుగారు చెప్పినటులు దారుతుల్యములును, అయోమయములును, పురాతనములును, ప్రజాయోగక్షేమములకు నిరర్థకములుగను నున్నవి. హిందూస్థానము నానాజాతిసమితినుండి వీడిపోవుటకు తీర్మానములు చేసినను నిరర్థకములు. రాజ్యాంగ సంస్కరణముల వ్యాజమునను జరుగుచున్న ప్రహసనము పరమవిషాదమును గలుగజేయుచున్నది. కౌన్సిలు ఆర్డరులు శరపరంపరలుగను బయలు దేరుచున్నవి. బ్రిటీషుపరిశ్రమలకును, వ్యాపారమునకును, ఉద్యోగులకును రక్షణోపాయములు ప్రవర్ధమానమగుచున్నవి. అధికారులకు రాజ్యాంగ పాశబంధములను బిగదీయుట కనంతావకాశములు గలుగుచున్నవి. ప్రభుత్వాధికారులీయవకాశములను ప్రజాహృదయములందు కలవరమును గలుగజేయుటకు వినియోగించుచున్నారు. వివిధసంఘములందున్ను పక్షములందును మహాసంచలనము బయలుదేరినది.

జిన్నాగారు మహమ్మదీయ పక్షమును బలపరుచుటకు ప్రయత్నములు చేయుచున్నారు. జాతీయపక్షమును, ప్రజాపక్షమును, హరిజనపక్షమును, స్వరాజ్యపక్షమును, జస్టిసుపక్షమును, మితవాదాదిపక్షములను పునరుద్ధరణచేయుటకు పక్షనాయకులు విశ్వప్రయత్నములను జేయుచున్నారు. కాంగ్రెసుపక్షమును ఎన్నికలందు పాల్గొనుటకు నిశ్చయించినది. నిరంకుశప్రభుత్వమును ప్రతిఘటించుట కేర్పడిన కాంగ్రెసుపక్షము ప్రజాపోషణమును బడయుచున్నవిధము కాంగ్రెసువిజయములు వెల్లడిచేయుచున్నవి. కాంగ్రెసునందును జాతీయపక్షము, సాంఘిక పక్షము, పార్లమెంటరీపక్షము, మంత్రినిరాకరణపక్షము మొదలగుపక్షము లుండుట చేతను కాంగ్రెసునందును భేధాభిప్రాయము లేర్పడినవనువదంతి ప్రబలినది. కాని వార్ధాయందు గతవారమునందు సమావేశమైన కార్యనిర్వాహకసంఘ వ్యవహారములు భేదాభిప్రాయముల కవకాశములు లేవని విశదము చేసినవి.

గాంధిమహాత్ముని యుపదేశము లెల్లప్పుడును శాంతిసంయోగములకు వినియోగపడుట సహజము. ముప్పదియారు కోట్ల ప్రజలును, విశాలమైన దేశమును, వివిధమతసంఘములున్ను గల దేశమునందు భేదాభిప్రాయము లుండుట సహజము. ఆ భేదములను దేశక్షేమమునకున్ను, శత్రుభేదమునకును వినియోగించుట ధర్మము కాని

దేశద్రోహమునకును, శత్రుక్షేమమునకును వినియోగించుట ధర్మముకాదు. ప్రజలందరును కాంగ్రెసుసభ్యులుగను జేరియును, కాంగ్రెసు అభ్యర్థులను ప్రోత్సహించియును ప్రతినిధులుగను నిలిచియును కాంగ్రెసువిజయమునకు దోడ్పడుట పరమార్థము.

* * * *

కాంగ్రెసు - ప్రజలు

కాంగ్రెసు గతించిన ౫౦ ఏండ్లయందును దేశస్వాతంత్ర్యమునకును, ప్రజాక్షేమమునకును పాటుపడిన ధర్మ చరిత్రాంశము గాంధిమహాత్ముని నాయకత్వము ప్రజలయందు గలుగజేసిన ప్రబోధవిశ్వాసములు సకల జనులకును స్వధర్మానుష్ఠానమునకు ప్రమాణములుగనున్నవి. శాసనసభలయందు సభ్యు లగుటకు 3000 మందికి మాత్రమే యవకాశములుగలవు. శేషించిన ౨ కోట్లమంది యును కాంగ్రెసుప్రచారము, ఖద్దరుప్రచారము, హిందీప్రచారము, గ్రామపరిశ్రమోద్యమము మొదలగు నిర్మాణోద్యమములందు పనిచేయుట కవకాశము లనంతములుగలవు. ప్రారంభమునందువలెను వర్తమాన సమయ ముందును కాంగ్రెసుసేవకులు త్యాగనిగ్రహములనుబూని స్వవిషయములనుమరచి కాంగ్రెసువిజయమునకై నూతనరాజ్యాంగనియోజనములందును పనిబూనుట ప్రయోజనకరము, ధర్మము. సామాన్యులు పనిచేయుటయును, ఏ నాయకుడో లాభము పొందుటయును కాంగ్రెసుసేవకులం దసంతృప్తిని గలుగజేసినను నిది తప్పని పని. గాంధిమహాత్ముడు ప్రకటించిన అనాసక్తయోగము హిందూదేశమునకే కాక ప్రపంచమునకంతకును మోక్షసాధనము గాగలదు. దేశక్షేమమునకై ఎవరేమి చేసినను నది దేశకైంకర్యమునకై వినియోగపడుచున్నది. భేదములు శ్రద్ధయందును, దేశకాలపాత్రములందును గలదు గాని పనియందు లేదు. అన్ని పక్షములవారును భేదాభిప్రాయములను విడిచి దేశమోక్షమునకై కాంగ్రెసుద్వారా పని చేయుటకు చేయుచున్న ప్రయత్నములు భగవదనుగ్రహమునను ఫలప్రదము లగుగాత! ఆంధ్రదేశమునందును ప్రజానాయకులకు పూర్వమువలెనే కాంగ్రెసుపట్లను భక్తిశ్రద్ధలు ప్రబలి కాంగ్రెసున కఖండవిజయము గలుగుగాత!

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.